# నూలు సొగసులు






రాజ్ కమల్ చీరలు —
ఫ్యాషన్‌కు తగిన రీతిలో
అధునాతన సృష్టిలోని
సోయగాలను
మేళవింప జేస్తాయి.

రాజ్ కమల్ వారి చీరలో
సినీతార జయప్రద.

**రాజ్‌కమల్**
కాటన్ ప్రింటెడ్ చీరలు

*International's*
**MARKET QUEEN**
342178®

KIRON/RKS/83

## కథలు

''శ్రీవల్లవి'' అందమైన ముఖచిత్రంతో వెలువడిన 4–11–83 సంచికలోని నాలుగు కథలూ చాలా బాగున్నాయి.

ఎస్. అన్సర్ హుస్సేన్, గిరింపేట.

## సీరియల్స్

ఎంతో ఆసక్తితో ఎదురుచూచిన ప్రసిద్ధ నవలా రచయిత్రిగారి ''యక్షగానం'' రసవత్తరంగా సాగుతోంది. ''అనురాగ తరంగాలు'', ''జీవనమురళి'' సీరియల్స్ చాలా బాగున్నాయి.

బి. వి. రాణిసంయుక్త, బి. వి. జగదీశ్వరి, చుండుపల్లె.

## దర్పణం

కొండముది శ్రీరామచంద్రమూర్తిగారి ''జీవనమురళి'' నవల మొదటి నుండి చివరి వరకు సినిమా ట్రిక్‌గానే నడచింది.

ఆంధ్రసచిత్రవారపత్రిక 25 జూన్ 1941 సంచిక నుంచి ప్రచురించిన శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావుగారి 'బొమ్మ' (ఆలేఖ్యం) ఈ వారం సంచికకే వెలుగునిచ్చింది. ఇతర కథలలో 'న్యాయం అందరికీ ఒక్కటే' 'నవ్వే కళ్ళలో' కథలు మమ్ముల నమితముగా ఆకర్షించినవి. ఊమెన్‌గారి 'లోకం పోకడ' నేటి రాజకీయ వాతావరణానికి 'దర్పణం'లా వుంటున్నది.

స్వరాజ్యలక్ష్మి, ఆనందగజపతిరావు, తెట్టంగి.

## న్యూఢిల్లీ లేఖ

వజ్రోత్సవ ప్రత్యేక సంచిక (ఆంధ్ర సచిత్ర వారపత్రిక)లో గత 50 సంవత్సరములలో ప్రచురించిన ముఖ్యమైన విషయాలను తిరిగి పాఠకులముందు ఉంచడమైనది. కొంత కాలం క్రితం శ్రీకృష్ణ న్యూఢిల్లీ లేఖలను ప్రతీవారం, ఆయన మరణించేవరకు ప్రచురితమైనవి. అప్పట్లో శ్రీకృష్ణ న్యూఢిల్లీ లేఖల గురించే నాకు ఆంధ్ర సచిత్ర వారపత్రిక చదవటం అలవాటు అయ్యింది. డా॥ జయదుబాషీ, శ్రీకృష్ణ న్యూఢిల్లీ లేఖలను మరపించే విధంగా ప్రపంచ రాజకీయ పరిస్థితిని విపులీకరిస్తున్నారు.




ఈ వజ్రోత్సవం సందర్భంగా ఆనాటి కొన్ని 'శ్రీకృష్ణ న్యూఢిల్లీ' లేఖలను ప్రచురించి ఈనాటి పాఠకులుకూడా మరొక్కసారి చదివేలా చేయమని కోరుచున్నాను.

ఎమ్. రామకృష్ణారావు, పోతిరెడ్డిపాలెం.

## అభివందనములు

ది. 2–12–83 నాటి సంచికలో డి. విజయభాస్కర్‌గారి లేఖ చాలా ప్రశంసనీయముగా నున్నది. భాస్కర్‌గారి సర్వమత సమాన దృష్టి ప్రశంశనీయము. నేడు ప్రపంచములో చెలరేగుతున్న మతభేధ జ్వాలలను రూపు మాపుటకు ప్రయత్నించుటకు బదులు జయ్‌దుబాషీగారు ప్రోత్సహించుట చాలా శోచనీయము.

సర్వమత సమ్మేళన దృష్టిగల విజయ భాస్కర్ గార్కి అభివందనములు.

అబ్దుల్ సలామ్, యువజన ఏక్‌దిల్ మిషన్, మచిలీపట్నము.

## బొమ్మ

శ్రీశ్రీగారి ''బొమ్మ'' (ఆలేఖ్యం) రచన, ఈ సంచికకు ఒక ప్రత్యేకత అని చెప్పొచ్చు. ''గతస్మృతులు'' శీర్షికన యిలాంటి రచనలు మళ్ళీ ప్రచురిస్తుంటే బావుంటుంది.

స్వరూజ్యోత్స్న, రాయగడ.

## వ్యాసాలు

జానపద చిత్రాలు, చక్రపాణిగారి వ్యాసము ఎంతో విజ్ఞానదాయకంగా వుంది. (1950 నవంబరు 8 సంచిక నుంచి)

గోపరాజా లక్ష్మప్ప, కదిరి.

## ధర్మపథం

2–12–1983 తేదీ గల సంచికలో ''జూదంలో న్యాయం'' అనే నా ''ధర్మపథం''లో ''నలుడూ! ధర్మరాజు — రాజ్యాలు కోలుపోయి'' అనుటకు బదులుగా ''హరిశ్చంద్రుడూ, ధర్మరాజు రాజ్యాలు కోలుపోయి'' అని పడింది. ఈ తప్పును పాఠకులు సవరించుకోవాలని ప్రార్థన.

— బులుసు వేంకటరమణయ్య ●


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]

శుక్రవారం : 23–12–'83
రుధిరోద్గారి నామ సం. మార్గశిర బ. చవితి
సంపుటము 76 సంచిక 15

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు. | 1-50 |
| ఆరు మాసాల చందా | రు. | 42-90 |
| పోస్టులో ఏడాది చందా | రు. | 85-80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం. విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
'మవాలి' హిందీచిత్రంలో శ్రీదేవి

కథలు :


'డామిట్! కథ అడ్డంతిరిగింది!' ... 11
ఏమిటో ఈ పెద్దవాళ్లు ... 24
అమృతం కురిసిన రాత్రి ... 44
''అమ్మా! నీపాలుచేదే!'' ... 59


సీరియల్ నవలలు :


యక్షగానం ... 16
అనురాగ తరంగాలు ... 28
గోరంత దీపం ... 50


వ్యాసాలు, శీర్షికలు :


ఉత్తరాలు—4, న్యూఢిల్లీ లేఖ—6, లోకంపోకడ—7, అభినవ భగీరథుడు – 8, ధర్మపథం – 22, సరగమాల – 33, సినిమాకబుర్లు – 34, సినిమా విశేషాలు—36, ప్రశ్నావళి – 42, 'వేమన'పద్యాలు—47, వ్యక్తిగతం, వారఫలం—58, హైదరాబాద్ నోట్ బుక్ – 64, అవీ–ఇవీ–అన్నీ – 66.



# రూపాయిని పెద్దది చేయడం సులభమే కాని అసలుకే మోసం రాకుండా చూసుకోవాలి

రూపాయిని రెండు రూపాయలు అనతి కాలంలోనే చేస్తామని చాలామంది ప్రకటిస్తారు. కాని మీ పెట్టుబడి ఎంతవరకు పదిలము? మీరు శ్రమపడి కూడబెట్టిన డబ్బు పైన అధిక ఆదాయం ఎంతైనా అవసరమే ఎందుకంటే ధరల పెరుగుదలతో డబ్బుకు నేడున్న విలువ రేపుండదు ఆ విలువ పడిపోకుండా మీ నిద్ర చెడి పోకుండా వుండాలంటే మీ డబ్బును అధిక ఆదాయంతో బాటు అమిత భద్రత కల్పించే చోట పెట్టాలి ఆ రెండు హామీలనిచ్చే సంస్థే 'రాజ్ యువరాజ్'

బహు భద్రత:-

'రాజ్ యువరాజ్' వెనుక ఏండ్ల తరబడి పేరు ప్రతిష్ఠలు సంపాదించిన 14 ప్రముఖ కంపెనీలు వున్నాయి దేశంలో భారీ ఎత్తున ఖనిజాలను ఎగుమతి చేసే 'శ్రీ విజయలక్ష్మి మినరల్స్ ట్రేడింగ్ కంపెనీ', ఎ పి ఐ.డి.సి తో కలిసి కోట్లరూపాయల పెట్టుబడితో స్థాపించిన 'ది ఆంధ్రప్రదేశ్ కార్బైడ్స్ లిమిటెడ్'లు ఈ గ్రూపు లోనివే మిగతా కంపెనీలు వాటి వివరాలు ఉచితంగా పంపబడే ఒక పుస్తకము పొంది తెలుసుకోవచ్చు
'రాజ్ యువరాజ్'లో దాచుకొన్న డబ్బుకి ఈ కంపెనీల అబయం వుండటం ద్వారా మీ పెట్టుబడికి అపారమైన భద్రత వుంటుంది ఈ హామీతో బాటు కొన్ని పథకాలలో పెట్టే పెట్టుబడికి జాతీయ బ్యాంకు కేష్ సర్టిఫికేట్లు కూడా ఇవ్వబడతాయి

అత్యధిక ఆదాయం:-

'రాజ్ యువరాజ్'లో దాచుకున్న డబ్బు పై సాలీనా 20 శాతం వరకు ఆదాయం లభిస్తుంది అంతేగాక, అనుకోని అవసరం వచ్చినప్పుడు డిపాజిట్ గడువు కాలం పూర్తి కాకుండానే మీ డబ్బు మీరు తిరిగి తీసుకొనే అవకాశం కూడా వుంటుంది

విస్తృతమైన పథకాలెన్నెన్నో:-

అందరి అవసరాలు దృష్టిలో వుంచుకొని 'రాజ్ యువరాజ్ 11 రకాల పథకాలు ప్రవేశపెట్టింది కేవలం 6 సంవత్సరాలలో మీ పెట్టుబడిని మూడింతలు చేసే పథకముంది మీ బిడ్డను కాలేజీ చదువుకి, సుఖమయ జీవితారంభానికి అనువైన 'విద్యా ప్రణాళిక' వుంది మీరు రిటైరయ్యాక మీ జీవితం ప్రశాంతంగా, ఆర్థిక పరమైన ఇబ్బందులు లేకుండా వుండటానికి అవసరమయ్యే ముందు చూపే 'రిటైర్‌మెంట్ ప్రణాళిక' మిమ్ముల్ని ఒకటో రెండో లక్షలకు అధిపతిని చేయటానికి 'లక్షాధికారి పథకము' వుంది నెలనెలా వడ్డీ లభించాలంటే 'ఫిక్సెడ్ టైమ్ డిపాజిట్' పథకముంది.

**అన్ని పథకాల పూర్తి వివరాలు తెలిపే ఉచిత పుస్తకం కోసం వ్రాయండి.**

**Raj Yuvraj**
**INVESTMENTS & FINANCE**

రిజిష్టర్డ్ ఆఫీస్: రాజ్ యువరాజ్ థియేటర్స్
పోస్టు బాక్స్ నెం. 507 గాంధీనగర్,
విజయవాడ - 520 003
గ్రామ్సు: ఫోన్: 76146

బ్రాంచ్ ఆఫీస్:-
123 హుస్సేనా మంజిల్,
అంగప్ప నాయికన్ స్ట్రీట్,
మద్రాస్ - 600 001 ఫోన్: 28265

నేడు ఆదా చేయండి.
అదే రేపు మిమ్ముల్ని ఆదుకుంటుంది.

BRAIN WAVE/RYIF/3

**న్యూఢిల్లీ లేఖ**



డా. జయదుబాషి

# దురహంకారంతో కూడిన అమెరికా విధానాలు

కొత్త ఢిల్లీ కామన్వెల్త్ సభలకి రావలసిన ఒక వ్యక్తి విజ్ఞాన భవనానికి 10000 మైళ్ల అవతల పాతిపెట్టబడి ఉన్నాడు. గ్రెనెడా ప్రధానమంత్రి మారిస్ బిషప్‌ని అతని అనుచరుడే చంపేశాడు. హంతకుడు సేనాధిపతికూడా. ఇది జరిగిన రెండు రోజులకి అమెరికా సేనలు గ్రెనెడా ప్రవేశించాయి. గ్రెనెడా అట్లాంటిక్ సముద్రంలోని ఒక చిన్న ద్వీపం. బిషప్ కమ్యూనిస్టే కాని మార్క్సిస్టునని చెప్పుకునేవాడు. ఎందుకోకాని కమ్యూనిస్టులు చాలా మంది మార్క్సిస్టులమని చెప్పుకోవటమే మేలు అనుకుంటారు... ఏది ఏమయితేనేమి, అమెరికా వాళ్ళు ఆయన్ని కమ్యూనిస్టుగానే వర్ణించేవాళ్ళు. బిషప్ అన్నాకాని ఆయన ప్రభుత్వమన్నా కాని అమెరికా వాళ్లకి ఇష్టం లేదు. సరే, బిషప్ ఇక లేడు, ఆయన్ని చంపి ఏలు దామనుకున్న ఇద్దరు ప్రముఖులూ జెయిల్లో ఉన్నారు.

శ్రీమతి గాంధీ కామన్వెల్త్ సభలు మొదలు పెట్టేప్పుడు చేసిన ఉపన్యాసంలో బిషప్ ప్రసక్తి లేదు. ఆయన కోసం సభికులు లాంఛనప్రాయంగా నయినా మౌనాన్ని పాటించి తమ విచారాన్ని ప్రకటించలేదు. ఇంతకిముందే ఇక్కడ జరిగిన తటస్థదేశాల సభలకి బిషప్ వచ్చాడు. అప్పుడే ఆయన్ను మర్చిపోయారన్న మాట.

అధ్యక్షుడు రీగన్‌గాని, ఆయన అనుచరులు కాని గ్రెనెడాకి 15000 మంది సేనలని ఎందుకు పంపించవలసివచ్చిందో చెప్పలేదు. గ్రెనెడా జనాభా 125000. ఇంతమందికోసం 15000 మంది సైనికులా? ఢిల్లీలోని కరోల్‌బాగ్‌లో కూడా గ్రెనెడాలోకన్నా ఎక్కువమంది జనమే కదా? 15000 సైనికులూ, ఒక విమానాన్ని తీసుకుపోయే నౌకా, కొన్ని డజనుల పెద్ద ట్రక్కులూ, ఎన్నో హెలికాప్టరులూ, వందల కొద్దీ టాంకులూ, వందల కొద్దీ జీపులూ కూడా కావలసి వచ్చాయి. ఈ వాహనాలతోపాటు కొన్ని పెద్ద పెట్టెలలో కోకకోలా పానీయం సీసాలు సయితం వెళ్ళాయిట. అమెరికావాళ్లకి యుద్ధం చేసేప్పుడు కూడా కోకకోలా ఉండాలన్నమాట.

అమెరికాలో పత్రికలు ప్రభుత్వానికి అనుకూలంగా ఉండవు. గ్రెనెడా విషయంలోనూ అంతే. గ్రెనెడామీద దాడి మంచిది కాదనే అభిప్రాయం జనంలో బాగా విస్తరించి ఉందని కూడా తెలుస్తోంది. రీగన్ చీటికీ మాటికీ పేచీలు పెంచుకునే రకం అని చాలామంది నమ్మకం. సమస్యలని యుద్ధం ద్వారా పరిష్కరించ వచ్చునని ఆయన అనుకుంటాడని జనం నమ్ముతారు. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసి 38 సంవత్సరాలయింది. ఈ కాలంలో అమెరికావాళ్లు వియత్నామ్, కొరియా యుద్ధాలు చేసి ఏమి సాధించారు? భూగోళం అంతటా అమెరికా సేనలు ఉన్నాయి కాని ఉండి ఏమి చెయ్యగలుగుతున్నాయి? లెబెనాన్ సంగతే తీసుకోండి. అక్కడ అమెరికా సేనలకి ఏమిటిపని?

గ్రెనెడా ఒక స్వతంత్ర దేశంగా ఉండేది. ఆదేశానికి ఒక రాజ్యాంగం కూడా ఉండేది. [అప్పుడప్పుడు ప్రభుత్వం పని చేసేది కాదు. గ్రెనెడా మొదటి ప్రధాని సర్ ఎరిక్ గెయిరీ ఒక పెద్ద దొంగ—ఇడీ అమీన్ లాంటివాడు. గెయిరిని పడగొట్టిన వ్యక్తి కొత్త రత్నం పక్షం లేదా న్యూజువెల్ పార్టీ అధిపతి కీ.శే. మారిస్ బిషప్.] బిషప్‌కి క్యూబాలో మంచే స్నేహితులు ఉండేవాళ్ళు. పాపం హత్య చెయ్యబడటానికి ముందు బిషప్ క్యూబా వెళ్లివచ్చాడు. క్యూబాతో స్నేహం తప్పా ఏమిటి? నాకు కాస్ట్రో అన్నా అతని గూండాలన్నా అసహ్యమే కాని సవ్యంగా ఎన్నికలలో గెలిచిన ఒక ప్రభుత్వానికి ఎవరు, స్నేహితులుగా ఉండాలో ఉండకూడదో చెప్పేందుకు ఇంకొకళ్లెవరు? అమెరికా గ్రెనెడాతో సంబంధాలు తెంచుకుంది. అక్కడ తన రాయబారిని ఉపసంహరించుకుంది. అరటిపళ్ళూ, కరక్కాయలూ పండించే ఆ ద్వీపం ఇక అమెరికా ఆధీనంలో ఉంటుందన్నమాట.

అమెరికా ఒక సంపన్న దేశం. అందుకనే అనుకుంటాను ఆ దేశస్తులకి తీర దేశాలతో అందులోనూ చిన్న తీరదేశాలతో సంప్రదించటానికి కష్టపడుతారనుకుంటాను. భారతదేశం తీరదేశమే కాని పెద్దదేశం. చీనా కూడా అంతే. జపాన్ చిన్నదేశమే కాని సంపన్నదేశం. రష్యా పెద్దదేశమూ, ఎంతో కొంత సంపన్నదేశమూ కూడా. అందుకనే ఈ దేశాలలో అమెరికా సంబంధాలని కొనసాగించుకోగలుగుతోంది. గ్రెనెడా చిన్నదేశమూ, తీరదేశమూ కూడా. దానితో అమెరికా మర్యాదగా ఉండగలదా? ఉండలేదనే తెలుస్తోంది. ఎప్పుడూ వాటితో గిల్లికజ్జాలు పెట్టుకుంటూ ఉంటుంది. ఇది శోచనీయం. ఈ ప్రపంచంలో ఉండే దేశాలలో ఎక్కువ శాతం చిన్నవి బీదవే కదా? ప్రపంచం తీరే అంత.

అమెరికా వాళ్ళతో వచ్చిన చిక్కేమిటంటే వాళ్లకి తాము ధనవంతులమని అహంకారం ఎక్కువ. ఒకప్పుడు బ్రిటన్‌కి కూడా ఇలాంటి అహంకారమే ఉండేది. చివరికి వాళ్లసామ్రాజ్యం ముక్కలయిపోయింది. ఇప్పుడేమో బ్రిటన్ ఒక చిన్న దేశం. అంత సంపన్నమయిన దేశమూ కాదు. అందుకనే బ్రిటన్ వైఖరిలో కాస్తయినా సౌమ్యత కనపడుతుంది. అమెరికా వాళ్ల సంగతి వేరు. జపాన్ తో కలిసి ఈ దేశం వాళ్లు భూగోళంమీద సంపదలో మూడవ వంతు కలిగి ఉన్నారు. [డాలరులలో లెక్కవేసినా సరే, ఆయుధాలలో లెక్కవేపినా సరే.] అందుచేత వాళ్లకి చిన్నవాళ్లని గౌరవించాలన్న ఆలోచన రాదు.

"ఆఫ్గనిస్తాన్‌లో రష్యావాళ్లకి పనేమిటి?" అంటే "గ్రెనెడాలో అమెరికా వాళ్లకి ఏమిటి పని ?" అని అడగక తప్పదు. గ్రెనెడామాత్రమే కాదు లెబెనాన్‌లో మాత్రం ఏమిటి పని ? వియత్నామ్‌లో అమెరికాకి చావు దెబ్బలు తగిలాయి. అక్కడ చీనా వాళ్లతో పోట్లాడి, మళ్లీ ఆ చీనా వాళ్లతోనే స్నేహంగా ఉంటున్నారు. ఎప్పుడూ అవతలి వాళ్లతో యుద్ధమేనా ? ఈ విధానం వల్ల ప్రయోజనం ఏమీ ఉండదు కదా ? ఇలాగ అందరితో యుద్ధాలుచేసి బాగుపడిన దేశం ఏదయినా ఉందని చరిత్ర నిరూపిస్తుందా ? హిట్లర్‌కి పట్టిన గతి ఏమిటి ? ముసోలినీ ఏమయ్యాడు ? యాహ్యాఖాన్, భుట్టోల సంగతి ఏమిటి ? విల్లు ఎక్కుపెట్టుకోండి కాని బాణం వదలకండి !

కాని అమెరికా వాళ్లు చేసేది ఇదే ! కమ్యూనిస్టులు శత్రువులే అనుకోండి, మీ ఇష్టం — అంత మాత్రాన యుద్ధానికి దిగటమేనా ? వాళ్లని ప్రతిఘటించే పద్ధతులు లేనేలేవూ ? అధ్యక్షుడు రీగన్ వయస్సు కీ. శే. బిషప్ వయస్సుకన్నా రెండు రెట్లు ఉంటుంది. ఒకసారి ఆయన్ని తన వైట్ హవుస్‌కి పిలిచి ఉంటే ఎంత బాగా ఉండేది ? పిలిచి తనకి తోచినది చెప్పి ఉండవచ్చు కదా బిషప్‌తో ? బిషప్ పరిభాష మార్క్సిస్టుల పరిభాషేకాని అలాగ మాట్లాడేవాళ్లు ఎందరో యువకులూ, వృద్ధులూ కూడా ఉంటారు. జవహర్‌లాల్ నెహ్రూకి మార్క్సిస్టు స్నేహితులు చాలామంది ఉండేవాళ్లు. [ఆయనకి ధనవంతులూ మిత్రులుగా ఉండేవాళ్లనుకోండి.] అమెరికా సంపన్న దేశమే. ఎంత సంపన్న దేశమయినా ప్రపంచానికి అంతటికీ ఒక్క దేశం కాపలా కాయగలదా ? కాయలేదు. ఈ యదార్థం రష్యా వాళ్లకి తెలుసు. తెలుసు కనుకనే ఆలోచించి చేస్తారు ఏ పని చేసినా. 

## లోకం పోకడ-ఊమెన్












# అభినవ భగీరథుడు

"నిత్య గోదావరీ స్నాన
పుణ్యదో యో మహామతిః,
స్మరామ్యాంగ్లేయదేశీయం
కాటనుం తం భగీరథం."

ఈ శ్లోకాన్ని పఠించినవారు చయనులు గారు. చయనులుగారు చయనంచేసి చయనులుగా రయినవారేగాని మామూలు చయనులుగారు కారు.

సూర్యుడు తన ప్రతాపం చూపిస్తున్నాడు. పది గంటల ప్రాంతం. ఇప్పటినుంచీ ప్రారంభిస్తేనే కాని, మధ్యాహ్నిక కృత్యాలు రెండు జాములకైనా తెములవని, క్రొత్త కాలువలో ఆదరాబాదరా స్నానంచేసి, సంధ్యావందనాదికాలు ముగించుకొని, విడిచిన నీర్కావి మడుగు ధోవతిని నడిశిరస్సున ఉంచుకొని, చెంబునిండుగా నీరు గ్రహించి, ఒడ్డెక్కబోతూ, కాలువవైపు తిరిగి, పై శ్లోకం పఠించి, కన్నులు నిమీలించి ఒక క్షణంపాటు, చేతిలో జలపూరిత కలశం ఉండగానే చేతులు జోడించి, ఒడ్డునైపు తిరిగి రెండడుగులు వేశారు; ఆగిపోయారు.

ఒడ్డుపైన ఆజానుబాహువూ, కమ్మెచ్చున లాగి వంచిన వెండి తీగెలవలే పలితమైన కేశజాలం కలవాడూ, అట్టివే య్యై, వెనకకు త్రిప్పబడి గండువయ్యాకాని మీసాలు కలవాడూ, సూటూ, బూటూ, హేటూ ధరించినవాడూ, ధవళధవళాంగుడూ ఐన ఒక సీమదొర నిలువబడి, అధికార తేజోవిలయాలయినప్పటికీ ఆదర గౌరవ వినయనికేతనా లయిన నేత్రాలను చయనులుగారి వైపే ప్రసరింపజేస్తూ, అచ్చ భారతీయ ధోరణిలో రెండు చేతులూ కలిపి నమస్కరించారు.

చయనులుగారు యత్కించిత్ చలితు లయినా, సకలశ హస్తాలను జతపఱుస్తూ, 'శ్రీ రామార్పణమస్తు' అన్నారు.

దొరగారు తన ప్రక్కనున్న ఆయనతో చిఱునవ్వు నవ్వుతూ ఏదో అన్నారు. ఆ దొరగారి ప్రక్కనున్న ఆయన, బిళ్ళకుచ్చులు పోసి పంచె కట్టి, తొడిగిన చెవులులేని అంగీ పైన పొడుగాటి కోటు వేసి, సన్నమల్లు పెద్ద పాగాచుట్టి, పైన వెడల్పంచుల కండువా వేసికొని ఉన్నాడు; అన్నాడు :

"అయ్యా ! ఇందాక తమరు చదివిన శ్లోకాన్ని, దొరగారు మళ్ళీ చదవమంటున్నారు," అని.

చయనులుగారు విస్పష్టోచ్చారణతో మళ్ళీ పఠించారు. దొరగారి ముఖంపై ఆశ్చర్యానందాలు లాస్యమాడాయి. మళ్ళీ ఇంగ్లీషులో ఏదో అన్నారు. తిరిగీ తలపాగా ఆయన ఇలా అన్నాడు తెలుగులో.

"దాని తాత్పర్యమేమిటండీ."

"నిత్యమూ గోదావరీ స్నానం చేయటంవల్ల కలిగే పుణ్యాన్నిచ్చిన మహామేధావీ, ఆంగ్లేయ దేశీయుడూ, అభినవ భగీరథుడూ, ఐన కాటనుదొరగారిని స్మరిస్తున్నాను ! ఇదీ దీని తాత్పర్యం."

తాత్పర్యాన్ని పాగా ఆయన ఇంగ్లీషులోని కనువదించారు. ఇక దొరగారు ఇంగ్లీషులో అన్నవాటిని పాగా ఆయన తెలుగు చెయ్యటమూ, చయనులుగారి మాటలను మళ్ళీ ఇంగ్లీషు చేయటమూ జరుగగా కథ నడిచింది.

"భగీరథు డెవరు ? కాటన్ ఎవరు ? ఈయన అభినవ భగీరథు డెలా అయ్యాడు ? మీకు నిత్యగోదావరీ స్నాన పుణ్యాన్నెలా ఇచ్చాడు?"

"భగీరథుడంటే, తన పితామహులకు ముక్తిని కలుగజేయటానికై అష్టకష్టాలూపడి, ఆకాశగంగను అధోలోకానికి తీసుకువెళ్లి పితామహులను ఉద్ధరించిన అతిలోక పురుషుడు.

కాటన్‌గారిని గుఱించి నాకంటే తమకే యెక్కువ తెలిసి ఉండాలి. మాకు తెలిసినదల్లా, ఆ మహానుభావుడు ఆంగ్లదేశీయుడు సీమదొర. ఉద్యోగరీత్యా మా దేశానికి వచ్చినా, జీతపు రాళ్ళుందుకొని కాలం గడిపేవాళ్ళలో కలియక, ఈ దేశాన్ని పరాయిదేశంగా భావింపక, ఈ ప్రజల కింత అన్నోదకాలు కలిగించినవాడు. ప్రభుత్వంవారు మొదట అంగీకరింపకపోయినా, వారికి లాభం కలిగే హేతువులు చూపించి, ఒప్పించి అఖండ గౌతమికి ఆనకట్ట కట్టించి మా దేశాన్ని సస్యశ్యామలం చేసిన సుకృతాత్ముడు.

ఆకాశం నుండి అభవమస్తకానికీ, శివ శిరస్సునుండి శీతాద్రికీ, శీతాద్రినుండి భూత లానికీ, అవనీతలంనుండి అంభోధికీ, పాథోధి నుండి పాతాళానికీ వియద్గంగను తీసుకువెళ్ల టానికి భగీరథు డెంత శ్రమించాడో, ఎంత దీక్ష వహించాడో కాటన్‌దొరగారు, సముద్రాభిముఖి యైపోయే అఖండగౌతమిని బుజ్జగించి, తన మేధానేత్ర ప్రసరణం వెనుకనే మలకమలకలుగా త్రిప్పి, అఖిల జనులనూ ఉద్ధరించేదిగా చేయడానికి అంతగానూ శ్రమించాడు; అంత

ఆంధ్రసచిత్రవారపత్రిక
1959 సెప్టెంబరు 16
సంచిక నుంచి



సర్ ఆర్థర్ కాటన్

దీక్షనూ వహించాడు; కనుక అభినవ భగీరథు డన్నాము.

అంతకున్నా మించి ఆయన మాకు చేసిన మహోపకారం మరొకటి ఉంది. మాది కర్మభూమి. మాకు ఇహ సౌఖ్యాలకంటె పరమపదానందానికే ప్రాధాన్యం. కర్మిష్ఠులకు ప్రథమ కర్తవ్యమూ ప్రధానమూ స్నానం. ఆ స్నానం జీవనదిలో అయితే శ్రేష్ఠం. అందునా అఖండ గౌతమీజలంలో అయితే వేఱే చెప్పాలా ? మాకూ గౌతమీమాతకూ చాలా దూరం. ఇదివఱకు ఏ పర్వదినాలలోనో మాత్రమే — అదయినా ప్రయత్నించి ప్రయాసపడితేనే గౌతమీ జల స్నానం లభ్యమయేది. ఎంత కర్మమీద నిష్ఠ ఉన్నా భుక్తి గడవాలికదా ! అగ్రహారం విడువలేక పోయాం. గౌతమ మహాముని కున్నంత తపశ్శక్తి మాకు లేదు ఆమెను మా కాళ్ళదగ్గఱకు రప్పించు కోవటానికి. ఆ భగీరథుడు తన పితామహులను ఉద్ధరించుకొనటానికి గంగను త్రిప్పితే, కాటను దొరగారు మా పితృదేవతలనూ మమ్మూ ఉద్ధరించటానికా అన్నట్లు ఈ గౌతమీ గంగను మా యింటి ప్రక్కకు పంపి మాకు నిత్యగౌతమీ స్నానఫలాన్నిచ్చారు. ఈయన అభినవ భగీరథుడు కాకపోవడమేమిటి ?"

ఈ మాటలు వింటూన్నంతసేపూ దొర గారి వదనం వింతవింతగా అలతిఅలతిగా ఎఱుపు దనం వహిస్తూ ఉంది. పాగా ఆయన దొరగారిని చూపుతూ చయనులుగారితో ఏదోఅనబోయారు. కాని దొరగారు వారించి ఇలా అన్నారు.

"ఆ కాటన్‌గారు చేసినగొప్ప ఏముంది ? ఆయన ప్రభుత్వ యంత్రంలో ఒక సీల. జరిగిం దంతా ప్రభుత్వపక్షానే. అదీగాక, అతని స్థానంలో, ఆ సమయంలో, ఎవరుఉన్నా ఆ పని చేయించేవారేమో ! అదతని విధి. తన విధి తాను నిర్వహించి మంచి ప్రభుత్వోద్యోగి అనిపించు కొని ఉండవచ్చు అంత మాత్రానికే ప్రాతః స్మరణీయుడు కావాలా అతడు ? నిజానికి మీ

# సంపూర్ణ పోషకాహారంలో అన్ని పోషక పదార్థాలు సరియైన పాళ్ళలో వుండాలి...



## సిరిలాక్ సంపూర్ణ పోషకాహారాన్ని సిద్ధం చేస్తుంది— రుచికరమైన విధంగా.

మీ పాపకి నాలుగు నెలలు నిండి ఘన పదార్థాలు తీసుకోడానికి సిద్ధంగా వున్నప్పుడు, సిరిలాక్ గురించి మీ డాక్టర్‌ని సంప్రదించండి. మీ పాపకి సిరిలాక్ ఆహారంగా యిచ్చిన ప్రతి పర్యాయము సంపూర్ణ పోషకాహారం యిచ్చామనే నమ్మకం మీకు మరొకసారి కలుగుతుంది.

అసలు సిరిలాక్ యిచ్చిన ప్రతి పర్యాయము ఒక ఘన ఆహార పదార్థం నుంచి అవసరమైన అన్ని పోషకాలు. మాంసకృత్తులు, కాలరీలు, పాపకి లభిస్తున్నట్లే. అది యిస్తూ పోషక పదార్థాల లోపం తొలగించడానికి మరొకటి ఇవ్వవలసిన అవసరం లేదు.

గోధుమ పిండి, పూర్తి మీగడ పాలు, పంచదార - రుచికరంగా కలిపి వుండడం చేత సిరిలాక్‌కి ఈ సంపూర్ణ పోషకత్వం, రుచి లభించాయి. శరీర నిర్మాణానికి మాంసకృత్తులు, శక్తికి పిండి పదార్థాలు, క్రొవ్వు పదార్థాలు, అన్ని విధాల పెరుగుదలకి అత్యంత అవసరమైన విటమిన్లు, ఖనిజాలు సిరిలాక్ అందచేస్తుంది.

మీ పాపకి సిరిలాక్ యివ్వండి—పాప బాగుగా, ఆరోగ్యంగా పెరగడానికి.




# సిరిలాక్®

పాలు వుండనే వున్నాయి




SAA/FSL/C/2670 TEL

NESTLÉ

కృతజ్ఞత అంతా ప్రభుత్వానికే చెందవలసి ఉంటుంది.''

''మే మలా అనుకోము. ప్రభుత్వమనేది ఒక భావమనీ, మీ మాటలలో ఒక యంత్రమనీ, అందులో కాటన్ దొరగారూ ఒక సీల అనీ అంగీకరిస్తాము. ఆయన స్థానంలో ఎవరు ఉన్నా ఆ పని చేసేవారే అన్నారు. ఎవరుచేస్తే వారే మా కృతజ్ఞత నందేవారు. కాటన్ కాటన్‌గా కాక నిత్యమూ గౌతమీస్నాన పుణ్యఫల ప్రదాతగానే స్మరింపబడుతూంట. ఇతరులు ఉండటానికి అవకాశం ఉన్న పదవిలో ఉండటం ఆయనకేమీ అనర్హతను ఆపాదింపజాలదు.

ఇక అది ఆయన విధిగదా అనేది. ఆయన ఆ ఉద్యోగంలో ఉన్నారు గనక ఆ పని చేసే అవకాశం దొరికినమాట మరి వాస్తవమే. అయితే, ఆయన్ని ఎవరూ గౌతమీనది మీద ఒక ఆనకట్ట కట్టించ వలసినదిగా ఆజ్ఞాపించలేదు మొట్ట మొదట. పైగా, ఆయన కట్టిస్తే బాగుంటుందంటె పైవారు ప్రతికూలించారు. అందర్నీ ఒప్పించి కుయుక్తులు అన్నింటినీ త్రోసి రాజనీ, సర్వవిఘ్నాలనూ జయించి, ఈ మహాకార్యం చేశాడాయన.

ఈ కృతజ్ఞత అంతా ప్రభుత్వానికే చెందాలన్నారు. ప్రజల నుండీ పన్ను తీసికొని వారికి సౌకర్యాలేర్పఱచటం ప్రభుత్వ విధి. అందులో ప్రభుత్వానికి స్వార్థ దృష్టి ఉండటానికి వీలులేదు. ఈ ప్రభుత్వం అట్టిది కాదు. తనకూ లాభం ఉందని కాటన్ ఎన్నోవిధాల వాదించి చూపితేనేకాని ఈ పనికి అంగీకరించ లేదు. ఈ ప్రభుత్వ దృష్టిలో ఇదిఒక లాభసాటి వ్యాపారంతప్ప ప్రజల కోసం చేసితీరవలసిన పని కాదు. విధి విధానాన్ని అలాఉంచి, కేవలం లౌకిక దృష్టి నుంచి ఆలోచిస్తే కాటన్ లేనిదే ఈ పని ప్రభుత్వం చేసేది కాదు.

అలాటి కాటన్ మేధా, నిరంతరదీక్షా కారణంగా లభించే ఈ పుణ్యజలంలో నిత్యమూ స్నానంచేస్తూ, దానితో పితరులకు తర్పణాలిస్తూ ఆయన్ని స్మరింపకపోవటమా ? ఎంత ఆత్మ భ్రంశం !''

# అభినవ భగీరథుడు

దొరగారి కపోలాలు మరీ అరుణితము లయాయి. వారు లజ్జాభారంతో అన్నారు.

''అయ్యా ! భారతీయులు ఇంత కృతజ్ఞులని నేననుకోలేదు. మర్యాదకు మాటలతో కృతజ్ఞత చెప్పటంకాక తమ హృదయంలో అతనికి ఇంత శాశ్వత మందిరాన్ని ఏర్పరుస్తారను కోలేదు. ఇంత అదృష్టవంతుడైన కాటన్ ధన్యుడు. అయ్యా ! ఇంకా నన్నునేను మీ నుండి దాచుకోలేను. నేనే ఆ అదృష్టవంతుణ్ని; కాటన్‌ను. తమ హృదయ వైశద్యమూ, వైశాల్యమూ చూచి—ప్రభుత్వాన్ని గూర్చిన తమ అభిప్రాయముతో ఏకీభవించలేకపోయినా — ముగ్ధుణ్ణయ్యాను. నా ఆనంద సూచకంగా తమకొక నూరారులు సమర్పించ దలచుకొన్నాను. బంగళాకువెళ్ళి అసిస్టెంటు ఇంజనీరుగాచేత పంపుతాను.తమరు తప్పక స్వీకరించాలి.''

'నేనే కాటన్ నన్న' మాట వినగానే చయనులుగారు సంభ్రమంగా రెండడుగులు వెనక్కు వేశారు. వాకొనగాని మహానందం వారిని పులకితులను జేసింది. కన్నులు మిలమిలలాడినాయి. చలితకుండల కాంతులు కపోలారుణిమలతో తళతళలాడినాయి, అన్నారు.

''అబ్బ ! ఎంత సుదినం ! ఒక గ్రామానికి కాదు, పట్టణానికి కాదు— దేశానికెల్లా అన్నదాత లయిన మహానుభావుడా నాతో ఇంతసేపూ నిలుచుని మాట్లాడి, నన్ను నూరాలిచ్చి సత్కరించదలచినది ! ఇంత అదృష్టం పడుతుం దనుకోలేదు. బాబూ ! సహజోక్తి తప్ప ఎఱుగని ఈ ఛాందసుని మాటలు మిమ్మల్ని ఇంతగా ఆకర్షించాయా ! మీరింత సరసులా ! ఇది ఔననటం ఎలాగ ? కాదనటం ఎలాగ ? తమవంటివారు తామై మెచ్చి యిస్తున్నపుడు కాదనటం అవినయ సూచకమేమో! కాని, అవుననటం మట్టుకెలాగ ? ఈ ఔదార్యం తనకు సహజమయినట్లే ఔచిత్య వివేచనముమ్నా; కనుక ఫరవాలేదు. అయ్యా ! నేను చయనం చేసినవాణ్ని; అప్రతిగ్రహణ నియమంకలవాణ్ణి! గ్రాసవాసోదైన్యం లేనివాణ్ణి; అన్యథా భావించకండి. చయనులు యెట్టివాడో ఈ మండలానికంతకూ తెలుసు.''

దొరగారు చిన్నబుచ్చుకొన్నట్టు అయినారు. పాగా ఆయన అన్నారు.

''అయ్యా ! చయనులుగారూ ! తమరలా సెలవిస్తేగాదు. అంత గంభీరులయిన దొరగారూ ఎంత చిన్నబుచ్చుకున్నట్టయినారో చూడండి ! వారు కాలువల్లోకి తొలిసారి నీరు ప్రవహించినప్పుడు కూడా మీ ఆ మాటలు విన్నప్పుడు పొందినంతటి సంతోషాన్ని పొందలేదు. ఆనకట్ట పని ఆగిపోయినప్పుడు కూడా మీరు గ్రహించననటంతోటే పొందిన ఖిన్నతను పొందలేదు. కాలువపై పర్యవేక్షణకు వచ్చి గుఱ్ఱాలను బంగళాలో వదిలి ఇలా వచ్చాము. అసలే మీ వంటివారంటే వీరికి ఆసక్తి. మిమ్మల్నిచూస్తూ నడుస్తున్నవారు మీ శ్లోకము విని ఆగిపోయారు. తనపట్ల భారతజాతి చూపే కృతజ్ఞతకు చిహ్నంగా మిమ్మును గుర్తించి ఉప్పొంగిపోయినవారు దానికి ప్రకుంగుపాటుగా చిన్నపుచ్చుకోవటం భావ్యమా ? ఆలోచించండి పెద్దలు.''

చయనులుగారు కనులు మూసికొని ఒక్క నిమిషం ఆలోచించారు; అన్నారు.

''సరే ! తుని తగవుగా నాకొకటే మార్గం స్ఫురిస్తోంది. ఆ మహానుభావుడికీ తృప్తి కలుగుతుంది. నాకూ ఆనందమవుతుంది. మా అగ్రహారానికి రామాలయం లేదు. అప్పుడప్పుడు ఏ ముష్టి ఎత్తయినా కట్టింతామా అనిపించేది. కాని అగ్నిహోత్రం విడువ వీలులేక పడినదికాదు. సరే, ఈనాటికీ ఘటన ఉన్నది కాబోలు ! దీన్ని అందుకు వినియోగిస్తాను.''

''మీ కృతజ్ఞతనూ, హృదయ నైర్మల్య వైశాల్యాలనూ చూచే ముగ్ధుణయిన నన్ను మీ నిష్ప్రహత్వం దిగ్భ్రాంతుణ్ణి చేసింది. మీకేలా ఇష్టమయితే అలా వినియోగించండి. మీ చేతితో జరిగితే అదే పదివేలు. మీ సంప్రదాయం ప్రకారం మీకు నమస్కరించాలనిపిస్తోంది. పాదాలు స్పృశించవచ్చునా ?''

**''ఎంతమాట!'' అన్నారు చయనులుగారు.**

పాదాభివందనం చేయటానికి అవసరులయ్యారు దొరగారు. చయనులుగారి గంభీర కంఠం నుండి గౌతమీ ప్రవాహ సదృశములయిన ఆశీర్వచనాలు ఇలా వెలువడినాయి అప్రయత్నంగా:

''దీర్ఘాయురారోగ్యైశ్వర్యాభి వృద్ధిరస్తు''
''సమానానా ముత్తమ శ్లోకోఽస్తు.''

*   *   *

[ఇది నిజంగా జరిగినదని, తమ తాతగారు తమకు చెప్పినారని, నాకుచెప్పిన శ్రీ ఎమ్. చలపతిరావుగారికి కృతజ్ఞత. శ్లోకము నేను వ్రాసినది.]

**—"అనంతం" ★**



# "డామిట్! కథ అడ్డం తిరిగింది!"




సినిసెట్టి శ్రీనివాసరావు

"లక్ష్మి సాయంత్రం వెళ్ళిపోతుందిరా" అంది అమ్మ.

"ఊహూ." అని ఊరుకున్నాను. అంతకంటే ముందుకెళ్ళి, "ఇప్పుడే ఏం తొందరొచ్చింది. నాల్గు రోజులుండి వెళ్ళొచ్చుగా ?" అనే ధైర్యంలేదు నాకు.

చిన్న ఇల్లు — చిన్న జీతం —చిన్న జీవితం.

ఒక్కమనిషి పెరిగితే — ఇల్లు ఇరుకు — బడ్జెట్ తారుమారు — ఎటూ తోచక బేజారు.

"లక్ష్మి సాయంత్రం వెళ్ళిపోతుందిట." చెప్పింది నా శ్రీమతి.

"అమ్మ చెప్పింది" అన్నాను.

"చీర కాకపోయినా, కనీసం జాకెట్టు గుడ్డయినా పెట్టాలి. అలాగే పిల్లాడికి ఓ జత చొక్కా — నిక్కరు..." అంటూ నా ముఖంలోకి చూసి ఆగిపోయింది.

"పెట్టు... నీ దగ్గర డబ్బులుంటే." అన్నాను.

నా స్తోమత — అసమర్థత బాగా తెలుసు శ్రీమతికి. ఈ రోజు క్రొత్తగా చెప్పొచ్చేదేమీ లేదు. అందుకే మారుమాట్లాడకుండా ఊరుకుంది.

నేను సాయంత్రం ఇంటికొచ్చేటప్పటికి లక్ష్మి వెళ్ళిపోయింది. "చెల్లెలు వెళ్ళిపోతుంటే, కనీసం బస్సు ఛార్జీలుకూడా పెట్టలేదు. వెధవ" అందిట అమ్మ.

శ్రీమతి చెప్పింది.

అమ్మ అంటే అంది. అమ్మ అన్నమాటలన్నీ అక్షరాల... అంటే, 'వెధవ' అన్నమాట కూడ శ్రీమతి నాతో చెప్పటంలోగల ఉద్దేశ్యం? తన దృష్టిలోకూడ నేను వెధవనేగా ?

తల్లి తిట్టే పర్వాలేదు. కానీ పెళ్ళాం కూడ...

అవమానం ... సిగ్గు ... ఆత్మాభిమానం వున్న వాడెవడైనా ఆత్మహత్య చేసుకుంటాడు.

మరైతే నాకు ఆత్మాభిమానం వున్నట్లా? లేనట్లా ?

ఆత్మహత్య చేసుకోలేదుకన్క లేనట్లే !

ఏమిటో జీవితం మరీ చప్ప చప్పగా తయారైంది.

గొర్రెతోక ఆదాయం. అధిక వ్యయం. నేను—శ్రీమతి, అమ్మ, ముగ్గురు పిల్లలు — మొత్తం ఆరుగురం. ఎనిమిది వందల జీతం. కటింగులు పోను చేతికొచ్చేది ఆరు వందలు. ఇంటి అద్దె రెండు వందలు. పాలఖర్చు వంద. మిగిలిన సగం జీతంలో ఆరుగురం బ్రతకాలి.

ఇంతకంటే తక్కువ ఆదాయం వచ్చేవాళ్ళ సంగతి ?

"వాళ్ళ సంగతి మనకెందుకు? మనసంగతి మనం చూసుకుందాం" శ్రీమతి.

నిజమే. ఎవడి స్వార్థం వాడు చూసుకో

వాలి. ఎవడెలా ఏడిస్తేనేం ? స్వార్థం లేకపోతే మామూలు మనిషి ఎలా అవుతాడు ?

రెండ్రోజులయ్యింది అమ్మనాతో మాట్లాడి. అంటే నా మీద కోపం వచ్చిందన్నమాట.

ఇలా అమ్మకు నా మీద చాలాసార్లు వచ్చింది కోపం.

చెల్లి పెళ్ళికి డబ్బు సర్దలేనన్నప్పుడు, బావగార్ని పండక్కి పిలిచి కట్నం చదివించనప్పుడు, అక్కచెల్లెళ్ళు వచ్చి వెళ్ళినప్పుడంతా చీర – జాకెట్టు పెట్టనప్పుడు ... ఇలా ఎన్నో సార్లు ... ఏవేవో చేయలేదని, జరుపలేదని.

వీటన్నిటికీ కారణం ... ఆర్థికంగా నా బలహీనతే. కేవలం జీతం రాళ్ళమీదే ఆధారపడి బ్రతికేవాడ్ని.

బంధువులేకానీండి, మిత్రులేకానీండి ... ఇంటికి వస్తున్నారంటే భయం. ఒక కప్పు టీ ఇవ్వగలనో లేదోనని.

ఎంతైనా అమ్మకదా ! ఆమె మాట్లాడపోయినంత మాత్రాన నేనే వెళ్ళి పలకరిస్తే తప్పేముంది !

అందుకే "ఏమ్మా ! అట్లావున్నావ్ ? వొంట్లో బాగోలేదా ?" అన్నాను.

"ఎందుకు బాగోలేదు. బాగానేవుంది. నేను మీ అన్నయ్య దగ్గరకు వెళ్దామనుకుంటున్నాను. రేపు ఆదివారం నన్ను వాడిదగ్గర వదిలేసిరా" అంది.

ఇదీ మామూలే. అమ్మకు కోపంవచ్చినప్పుడల్లా అన్నయ్య దగ్గరకు వెళ్ళిపోతాననటం.

కానీ, వెళ్ళిన నాల్గురోజులకే మళ్ళీ తిరిగి రావటమూ మామూలే. అమ్మకి – వదినకి పడదుమరి.

అయినా, అన్నయ్యంటేనే అమ్మకు ఇష్టం.

అన్నయ్య అమ్మ అడిగినంత డబ్బు ఇస్తాడు. డబ్బంటే లెక్కలేని మనిషి. సంపాదనెంతో తెలీని మనిషి అన్నయ్య.

నాకు అది చేతకాదు కనుక నేను అమ్మకు ఇవ్వగల్గింది ఒక్కటే! నా దగ్గరుంచుకుని నేను– శ్రీమతి అమ్మకు సేవచేయటం.

అన్నయ్య ఇచ్చే డబ్బుముందు మేము చేసే సేవలు అమ్మకు విలువైనవిగా అనిపించలేదనటం నిజం.

అందుక్కారణమూ లేకపోలేదు. నాన్న చేసింది చిన్న ఉద్యోగం. ఎప్పుడూ డబ్బుకిబ్బందే. అందుకనే ఇద్దరి కొడుకుల్లో అమ్మకు కావల్సిన డబ్బు ఇవ్వగలిగే అన్నయ్యంటే ఆమెకు ఇష్టం. నాన్నమాదిరే నేను. నాన్నమీదున్న చిన్నచూపే నామీదవుంది అమ్మకు. నాన్నలాగానే నేను తెలివితక్కువవాడినని అమ్మ అభిప్రాయం. తెలివి గలవాడినైతే డబ్బెందుకు సంపాదించలేకపోతున్నాను ?

బిడ్డ తప్పుచేస్తుంటే వద్దని వారించి మంచిమార్గం చూపించవలసిన మాతృమూర్తి— ఆ తప్పు చేయకపోవటం అసమర్ధతగా ఎంచి అప్రయోజకుడుగా చూడటం ఎంతవరకు సమంజసం ?

కొడుకు సంపాదనెంతో తెలిసి, ఆర్థిక స్తోమతు తెలిసి, అతడి శక్తికి మించిన ఖర్చులు పెట్టటంలేదని బాధించటం—పరోక్షంగా, అతన్ని డబ్బు సంపాదనకై అడ్డదారులు వెతుక్కోమనటమేగా ?

అమ్మ ఇష్టప్రకారమే ఆదివారం ఫస్టు బస్సులో తీసుకెళ్ళి అన్నయ్య దగ్గర వదిలి వచ్చాను.

* * *

ఇంటికొచ్చేసరికి శ్రీమతి ముఖం మాడ్చుకొని వుంది.

"ఏం అలా వున్నావ్ ? వొంట్లో ఏదైనా నలతగా వుందా ?" అన్నాను చెయ్యి పట్టుకోబోతూ. అమ్మ లేదు కనుక కాస్త చొరవ తీసుకున్నాను.

"ఈ ఇంటి చాకిరీ చేసి చేసి నా ఎముకలు అరిగిపోతున్నాయి. ఏవిటో గుండెల్లో దడ — నీరసం. ఇక నా వల్లకాదు; ఈ సంసారం చేయటం. నెలకు రెండు వేలు ఆదాయం వుండి, ఇంటిలో పనిమనిషి, వంటమనిషి వుండి టైముకు అన్నీ అమరిపోతూ వుంటే, హాయిగా మంచంమీద పడుకుని ఏ నవలో చదువుకుంటూ కూర్చునే జీవితం వుంటే ఇంకేం కావాలి ? మనకు ఆ అదృష్టం కూడానా ? ప్రొద్దస్తమానమూ వెట్టిచాకిరీ తప్ప." మనసులో బాధ బైట పెట్టేసింది.

అటు అమ్మ — ఇటు శ్రీమతి.

ఇద్దరిదీ ఒకటే మనస్తత్వం.

పొరుగిళ్ళ పిల్లలు కాన్వెంటుల్లో చదువుకుంటుంటే, మా పిల్లలు మామూలు గవర్నమెంటు స్కూళ్ళల్లో చదువుకుంటున్నారని కోపం. ఇన్నేళ్ళుగా ఉద్యోగం చేస్తున్నా... ఇంత బంగారమని కాని...రిటైరైయాక ఉండేందుకు ఓ ఇల్లుకాని, బ్యాంకుల్లో ఫిక్సెడ్ డిపాజిట్లని కాని ఏర్పాటు చేసుకోలేకపోయానని కోపం. ఏడాదికొకసారి తిరుపతో, మరో చోటుకో తీసుకు వెళ్ళటంలేదని కోపం. అందరిలా తరచూ సినిమాలకని... పండుగ పండక్కి అందరికీ కొత్త బట్టలు ఉండవని కోపం... ఇలా నామీద శ్రీమతికి కోపానికి కారణాలు కోకొల్లలు.

ఇన్ని మాట లెందుకు ? శ్రీమతికి నా మీదున్న అభిప్రాయం ఈజీగా చెప్పాలంటే, శ్రీమతి ఒకరోజు నాతో చెప్పిన ఆ విషయం చాలు.

"రాజాలాంటి సంబంధం వదిలేశాడు మా నాన్న. బ్యాంకులో పన్జేస్తాడతను. ఉద్యోగం మంచిది అయినా, జీతం తప్ప పై సంపాదన వుండదని ఆ సంబంధం వదిలేశారు. అదే టైములో మీ సంబంధం వచ్చింది. మీరు చేసేది గుమాస్తా ఉద్యోగమేయైనా, మీ డిపార్టుమెంటులో పై సంపాదన బాగా ఉంటుందన్న ఉద్దేశ్యంతోనే మా నాన్న మీ సంబంధం సెటిల్ చేశాడు. అందుకే అనుకున్నదానికంటే మీకు కట్నం ఐదు వేలు ఎక్కువ కూడ ఇచ్చింది. కానీ, మీ ప్రయోజకత్వం చూశాక మా నాన్న పొరబడ్డారని తెలుసుకున్నాను."

శ్రీమతి చెప్పింది విని 'డంగ్' అయిపోయాను. కుర్రాడి చదువు, ఉద్యోగం, ఫేమిలీ బేక్‌గ్రౌండ్‌ని బట్టి కట్నం రేటు నిర్ణయింపబడుతుందని తెలుసుకొని... ఉద్యోగం చిన్నదైనా పన్జేసే డిపార్టుమెంటును బట్టి కూడ కట్నం రేటు మారుతుందని అప్పుడే తెలుసుకున్నాను.

"అందుకే, చదువుకున్న కుర్రాళ్ళూ, మీ చదువుకు తగ్గ ఉద్యోగం దొరక్కపోయినా పర్వాలేదు, చిన్న ఉద్యోగమే అయినా, మంచి డిపార్టుమెంటు, అంటే పై రాబడి వుండే డిపార్ట్‌మెంటును సెలక్టు చేసుకోండి. అప్పుడు కట్నాల మార్కెట్‌లో మంచి రేటు పలుకుతుంది మీకు. ఆ డబ్బు మదుపుపెట్టి 'సైడు బిజినెస్' చేసుకోవచ్చు."

అటు అమ్మకి— ఇటు శ్రీమతికి ఇద్దరికీ ఒకటే అభిప్రాయం నా మీద.

ఇంతకంటే దారుణం ఏముంటుంది ?

కన్నతల్లి – కట్టుకున్న ఇల్లాలు ఇద్దరూ కోరుకునేది ఒక్కటే.

నేను పై సంపాదన సంపాదించాలి. దాంతో వాళ్ళు సుఖపడాలి.

ఏమైతేనేం, ఇన్నాళ్ళకు, "ఉద్యోగం పురుష లక్షణం" అన్నట్లు, 'లంచం పుచ్చుకోవటం పురుషలక్షణం' అన్న సత్యాన్ని తెలుసుకున్నాను.

అందుకే ఇంతకాలం ఏదైతే చేయకూడదని అనుకున్నానో, ఇప్పుడు అదే ... పైసంపాదన చేయటానికే నిశ్చయించుకున్నాను.

* * *

"మీ బిల్లు పాస్ అయిపోతుంది. 'ఫార్మాలిటీస్'చేసేసి చెక్కు తీసుకువెళ్ళిపోవచ్చు" అన్నాను చెక్కుకోసం వచ్చిన కంట్రాక్టరుతో.

"చెక్కు ఇప్పించండి. కేష్ చేసుకొచ్చి డబ్బు కట్టేస్తాను." అన్నాడతను.

"అదేంకుదరదు. ముందు పేమెంట్ అయ్యాకే చెక్కు ఇచ్చేది." గట్టిగానే చెప్పాను.

"ఇప్పుడు నా దగ్గర కేష్ లేదుసార్, చెక్కిస్తే కేష్ చేసుకుని వచ్చి ఇస్తాను"అన్నాడు.

నా మొదటి కేసు వీడు. చెక్కు తీసుకున్నాక ఎగనామంపెడితే ... నో...నో... వీడు చెయ్యిజారిపోవటానికి వీల్లేదు.

"అయితే రేపొచ్చి తీసుకువెళ్ళండి చెక్కు. ఇంకోవిషయం, ఈ బిల్లుమీద వెయ్యిరూపాయలివ్వాల్సుంటుంది" అన్నాను.

"అదేవిటి ? ముప్పైవేల బిల్లుకు వెయ్యి రూపాయలా ? వన్‌పర్సెంట్ ఇస్తున్నాం. ఆ లెక్కన మూడొందలొస్తుంది" అన్నాడు.

"ఆ రేట్లు పాతరేట్లు, అప్పటికీ ఇప్పటికీ ధరల్లో ఎంత మార్పురాలేదు. అందుకే మీ రేట్లు కూడ పెంచాలి. థ్రీ పర్సెంట్ చేసుకోండి. వెయ్యిఇచ్చి చెక్కు తీసుకెళ్ళండి." ఖచ్చితంగా చెప్పేశాను.

"నావల్లకాదు, వన్‌పర్సెంట్ ప్రకారం ఇస్తాను. అంతకుమించి ఇవ్వలేను... ఇవ్వను." నా అంత ఖచ్చితంగానూ చెప్పాడతను.

"ఇవ్వకపోతే మీబిల్లు పాసుకాదు" అన్నాను.

"ఎలా పాసుకాదో నేనూ చూస్తాను" అంటూ లేచాడు.

"చూస్కో" అన్నాను రెక్‌లెస్‌గా.

కోపంగా వెళ్ళిపోయాడు కంట్రాక్టరు.

ఎవడికోసం ఇస్తాడు అడిగినంత, కాస్త మెత్తగా వుంటే నెత్తిచెయ్యి చూపిస్తారు,



మొత్తానికి గట్టిగానే అడిగాను. నా ప్రవర్తనకు నాకే ఆశ్చర్యమేసింది లంచం తీసుకోవటం అంటే భయపడే నేను ఎలా మాట్లాడానా అనిపించింది.

ఆరోజు రాత్రి శ్రీమతితో చెప్పాను, వెయ్యిరూపాయలు రాబోతున్నాయని.

ముందు ఆశ్చర్యపోయినా, నేను, "నిజం—ఒట్టు" అన్నమీదట నమ్మేసింది శ్రీమతి.

"మరైతే ఒకపని చేద్దాం, మొట్టమొదటి పై సంపాదన కనుక అందులోనుంచి ఓ వంద దేవుడికి తీసి ప్రక్కన పెడ్దాం" అంది.

గాడ్ ది గ్రేట్... అడక్కుండానే వాటా కొట్టేస్తున్నాడు.

తనకో చీర... నాకో జత బట్టలు... పిల్లలకు అవీ ఇవీ, మొత్తానికి మిగిలిన తొమ్మిది వందలకు లెక్క చెప్పేసింది శ్రీమతి.

నీ ఇష్టం అలానే కానీ అన్నాను.

ఎప్పుడూ సీరియస్‌గా, సమస్యల బరువుతో సతమతమైపోతూవుండే శ్రీమతి ముఖంలో ఏదో వెలుగు — తేటదనం కన్పడింది ఈరోజు. నాకు ఏదో రిలీఫ్ అనిపించింది.

కారణం — తీరని కోరికలు కొన్ని మాత్రం తీర్చుకునే అవకాశం దొరికినందుకేనా ? కావొచ్చు, మధ్యతరగతి మనుషుల్లో పేరుకున్న నిరాశ నిస్పృహలకు కారణం... కోరికలు తీర్చుకోలేని అశక్తత కావొచ్చు. అందుకే డబ్బు చేతికందిన రోజు వాళ్ళు పొందే ఆనందం తాత్కాలికమైనా అదొక అనిర్వచనీయమైన అనుభూతి వాళ్ళకు. అల్పసంతోషులు.

మర్నాడు... రెండోనాడుకూడ రాలేదు కంట్రాక్టరు.

డబ్బు కోసం ప్రయత్నం చేస్తూవుంటా డనుకున్నాను. మూడోరోజు మేనేజరుగారు పిలుస్తే వెళ్ళాను.

"నీమీద కంట్రాక్టర్ శివరామన్ కంప్లైంట్ చేస్తూ హెడ్డాఫీసుకు టెలిగ్రాం ఇచ్చాడట. వెయ్యి రూపాయలడిగావటగా బిల్లు పాస్ చేయటానికి. ఎంక్వయిరీకి — జనరల్ మేనేజర్‌గారు వస్తున్నారు ఎల్లుండి" అన్నారు మేనేజర్‌గారు.

బిక్కచచ్చిపోయాను నేను.

నేను — శ్రీమతి కన్నకలలన్నీ కరిగి పోయాయి. వొళ్ళంతా చల్లబడిపోయి నట్లయ్యింది. మాట్లాడాలంటే నోరు పెగలటం లేదు. మైండ్ పూర్తిగా పనిచేయటం మానేసింది.

ఎందుకిలా మొదటి ప్రయత్నమే బెడిసి కొట్టింది. టేకిల్ చెయ్యటం సరిగ్గా లేకనా ? లేక దేవుడికిచ్చిన వాటా సరిపోకనా ?

ఆ రోజంతా మనశ్శాంతి కరువయ్యింది.

రాత్రి ఇంటికి వెళ్ళాక,

"పండక్కి 'డిస్కౌంట్' ఇస్తున్నారటండి

# డామిట్ ! కథ అడ్డం తిరిగింది !

చీరలమీద. ప్రక్కింటి కృష్ణవేణిగారు తీసుకున్నారు రెండు చీరలు. చాల బాగున్నా యండి. మీరు పర్మిషనిస్తే నేనూ రెండు చీరలు కొనుక్కుంటాను. చూద్దాం... డబ్బు సరిపోతేనేలెండి... ఏం మాట్లాడరేం ? డబ్బు చేతికొచ్చిందా ?" అని అడుగుతున్న శ్రీమతికి ఏమని సమాధానం చెప్పను ?

"ఇంకా అందలేదు" అన్నాను.

"అందేకేలెండి." అంటూ సమాధానం చెప్పుకుంది శ్రీమతి.

మర్నాడు ఉదయం మేనేజరు పిలిస్తే రూంలోకి వెళ్ళాను.

"రేపేగా ఎంక్వయిరీ. జి. ఎం. వస్తున్నాడు తెలుసుగా ?" అన్నాడు మేనేజరు కళ్ళద్దాల్లోంచి అదోలా చూసి.

విని మౌనంగా వుండిపోయాను.

"ఏం చేద్దామనుకుంటున్నావ్. జి. ఎం. సంగతి తెలుసుకదా, ఎంక్వయిరీలో నీ మీద 'ఎలిగేషన్స్' బుజువయితే..." అంటూ ఆగాడు నా ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూస్తూ.

నాకేం చెప్పాలో తెలీటంలేదు. ఇలాంటి విషయాల్లో ఎ. బి. సి. డి.లు తెలియనివాణ్ని

నా మౌనం చూసి అతడే అన్నాడు.

"నీకో ఉపాయం చెప్తాను, చేస్తావా ?" అని.

"ఏమిటి ?" అన్నట్లు చూశాను.

"ఓ అయిదువేలు ఫట్టా. అంతా నాకే ననుకోనేవ్. జి. ఎం.కి — నాకు సగం — సగం. ఎంక్వయిరీ రిపోర్టు నీకు ఫేవర్‌బుల్‌గా వచ్చేటట్లు చూస్తాను." అన్నాడు.

దీన్నేమంటారు ? కాకుల్నికొట్టి గాబందు లకు వెయ్యటమనా ? చిన్న చేపను పెద్దచేప తినటమనా ?

నాకేం వినపడటంలేదు. అయిదు వేలు అన్నమాట తప్ప.

"ఆలోచించుకో. సాయంత్రానికల్లా ఏ విషయం చెప్పాలి." అన్నాడు మేనేజరు మళ్ళీ.

అక్కడనుంచి లేచి వచ్చేశాను.

ఐదువేలు ఇవ్వటం నావల్ల కానిపని. అందుకే మేనేజర్ని మళ్ళీ కలవలేదు.

* * *

మర్నాడు జి. ఎం.గారు వచ్చారు.

నామీద కంప్లైంట్ టెలిగ్రాం ఇచ్చిన 'శివరామన్' వచ్చాడు.

ఆఫీసంతా గందరగోళంగా వుంది.

"పూర్‌ఫెలో... అత్యాశకిపోతే ఏమవు తుందో తెలీదు పాపం. అందుకే ఇరుక్కు న్నాడు."

నామీద కామెంట్స్ పాస్ చేస్తున్నారు స్టాఫ్ మెంబర్లు.

ఏ క్షణాన నాకు మేనేజర్‌గారి దగ్గరనుండి పిలుపు వస్తుందోనని ఎదురుచూస్తున్నాను నేను.

అనుకున్న సమయం రానేవచ్చింది.

నేను భయపడుతూనే మేనేజర్‌గారి రూం లోకి ప్రవేశించాను. రూం లోపల, జి.ఎం.గారు, మేనేజరుగారు, శివరామన్, స్టెనో కూర్చుని వున్నారు.

నన్నూ కూర్చోమన్నారు.

మేనేజర్‌గారి ముఖం సీరియస్‌గా వుంది.

జి. ఎం. ముఖంలోకి చూసే ధైర్యంలేదు నాకు.

ఎదురుగావున్న గోడకు వ్రేలాడుతున్న జాతి పిత పఠం బోసి నోటితో నన్ను చూసి నవ్వు తున్నట్లనిపించింది.

ముందుగా కొన్ని ఇతర ప్రశ్నలు అడిగిన పిమ్మట అసలు పాయింటుకు వచ్చారు జి. ఎం.

ఒక టెలిగ్రాం కాయితం శివరామన్‌కి చూపిస్తూ, "ఇది మీరిచ్చిందే అనుకుంటాను." అన్నారు జి. ఎం.

శివరామన్ ఏం సమాధానం చెబుతాడోనని నా గుండె అతి వేగంగా కొట్టుకుంటోంది.

ఆ క్షణంలో జి.ఎం గారు, మేనేజర్‌గారు 'కాలం తీరిన జీవుణ్ణి ఎత్తుకుపోవటానికి వచ్చిన యమభటుల్లా కనిపించారు నాకు.'

శివరామన్ ముఖంలోకి దీనంగా చూశాను నేను.

మరుక్షణం, "ఈ టెలిగ్రాం నేను ఇవ్వలేదు" అన్నాడు శివరామన్.

అంతే; అప్పటివరకు ఉన్న నాలో టెన్షన్ ఒక్కసారిగా దిగిపోయింది.

"క్రింద మీ పేరువుంది. మీరివ్వకపోతే మీ పేరుతో ఎవ్వరిస్తారు ? సరిగ్గా చెప్పండి" అన్నారు జి.ఎం. అధికార స్వరంతో.

"నేనైతే ఇవ్వలేదు. నా పేరుతో ఎవ్వరైనా ఇచ్చారేమో" అన్నాడు శివరామన్.

"మీరివ్వలేదుసరే. పోనీ మీ బిల్లు పాస్ చేయటానికి లంచం క్రింద ఇతను వెయ్యి రూపాయలు డిమాండ్ చేశాడాలేదా ?" జి.ఎం. అడిగారు.

"లేదు" అన్నాడు శివరామన్.

అంతే ఎంక్వయిరీలో నా మీద ఎలిగేషన్స్ నిరూపించబడనట్లు తేలిపోయింది.

అయితే శివరామన్ మొదట కంప్లైంట్ ఇచ్చి, తర్వాత ఇవ్వలేదని ఎందుకు అబద్ధం చెప్పాడో ఎవ్వరికీ అంతుపట్టని విషయం.

అది నాకు — శ్రీమతికే తెలుసు.

కొనిపెట్టానన్న చీరలు కొనిపెట్టకపోగా, శివరామన్‌చేత ఆ టెలిగ్రాం తను ఇవ్వలేదని చెప్పించటానికి, అతడు డిమాండ్ చేసిన వెయ్యి రూపాయల కోసం శ్రీమతి చేతిగాజులు అమ్మవల్సి వచ్చింది. ఆ రహస్యం మా ఇద్దరికే తెలుసు.

ఈసారి మెళ్ళో గొలుసుకూడ అమ్మేస్తా ననుకుందేమో, శ్రీమతి నన్ను పైసంపాదన గురించి మరెప్పుడూ అడగలేదు. ★

# ట్రిలో

## ఉపయోగించడానికి మీకొక మంచి కారణం:




## ఇతర ప్రముఖ డిటర్జెంట్ బిళ్లలకన్న
# దీని ధర 30% తక్కువ.

### ఇవిగో, ఇంకా మూడు కారణాలు:

### మరింత నురుగు



దీని సమృద్ధమైన నురుగు మరే డిటర్జెంట్ బిళ్లకన్న ఎక్కువ బట్టలను శుభ్రం చేస్తుంది.

### మరింత ఉతికే శక్తి

అతిగా మాసిన బట్టల్ని కూడ చక్కగా శుభ్రం చేయగలది ట్రిలో అందులోనే ఉన్న బ్లూ తెల్లటి బట్టలకు వాటి అసలు తెల్లదనపు మెరుపు తెస్తుంది.



### మరింత మన్నిక




ట్రిలో సులువుగా మెత్తబడిపోదు. అందుకే అందులో వృధాపోయేది ఎంత మాత్రం ఉండదు. పూర్తిగా అరిగిపోయేదాకా ట్రిలోను వాడవచ్చు.

**ట్రిలో** — మరింత ఉపయోగకరమైన నీలి డిటర్జెంట్ బిళ్ల.

Godrej ఉత్పాదన

CHAITRA-GS-188 TEL

సీరియల్

# యక్షగానం

ర్గీయ శ్రీమతి మాదిరెడ్డి సులోచన

"నీ కష్టం నేను గ్రహించాను బిడ్డా!" అన్నదామె.

"మీరు ఎంత గ్రహించినా, నా కష్టం ఊహించలేరు స్వామీ. మావారు పూర్తిగా మారి పోయారు. అమ్మ, అమ్మంటూ అల్లాడతారు. మందో, మాకో పెట్టారు స్వామీ..."

ముకుందాదేవి మొహాన చిరునవ్వు వెలిసింది.

"నాకు తెలుసు బిడ్డా! మా అమ్మను నువ్వు గౌరవించకపోతే, మీ వాళ్ళ రావద్దంటు న్నాడు..."

"పదివేలుస్వామి... పదివేలు అచ్చు అలాగే అంటున్నాడు.

"నిన్ను వదిలితే నాకు మరో భార్య దొరుకు తుంది కాని, మరో అమ్మ దొరకదు..."

"అంటున్నాడు, నిజమే స్వామీ ... యెలా గ్రహించారు. నా కాపురం కాపాడండి! ..." ఆ స్త్రీ సాష్టాంగపడి నమస్కరించింది.

"ఒక నమస్కారం చేసి వెళ్ళు. అంతా చక్కపడుతుంది."

"నమస్కారం ఏమిటి స్వామీ! నా కాపురం చక్కబడితే అభిషేకం, అర్పణ చేస్తాను."

"కాని ఒక్కమాట..."

"సెలవీయండి."

"మీ వారితో వాదనకు దిగకు. ప్రేమగా ఉన్నట్లు నటించు. అది ముఖ్యం."

"మంచిది స్వామి..."

(గత సంచిక తరువాయి)

ఆమె వెళ్ళిపోయింది. నీలు హృదయంపై పెద్దభారం దిగింది. ఆమె తేలికగా నిట్టూర్చి ఇటుతిరిగి పక్కలో బల్లెం దిగినంతగా ఉలికి పడింది.

రాయుడి భార్య కూర్చున్నది.

ఆమె నీలిమను చూచి, వెటకారంగా నవ్వింది.

"భగవాన్! నా కష్టం గ్రహించాలి."

"గ్రహించాం బిడ్డా!"

"చెప్పండి స్వామీ..."

"ఈ విభూతి ధరించు అన్ని కష్టాలు హరించిపోతాయి."

"నా కష్టాలు ఏమిటో చెప్పు...చెప్పు స్వామీ, ఇదిగో నా స్నేహితురాలు, మీరు భగవంతుడు కాదని పందెం కాసింది."

"అజ్ఞానంలో ఉన్నావు బిడ్డా! ఎందరు, ఎన్నిరకాల పందెం కాసినా ఉన్నది లేకుండా పోదు."

"వేదాంతం చెప్పటం దేనికి? కష్టం ఏమిటో చెప్పు."

"ఏ కష్టం అయినా దానికి మూలం ఆశ ..."

"అంత డొంక తిరుగుడు వద్దు. సూటిగా చెప్పండి. నా బాధ ఏమిటో."

**జరిగిన కథ — 8 :** నీలిమ, ఆదిత్య పరస్పరం ప్రేమించుకొంటారు. వారిద్దరూ కలసి చిన్నబాబు అసలు రంగు బయటకు లాగుతుంటారు. నీలిమని, చిన్నబాబుకిచ్చి పెళ్లి చేసే విషయంలో నందనరావు, ముకుందాదేవి ఘర్షణ పడతారు. తన అత్త చనిపోయిన కారణంగా మళ్లీ పెళ్లి చేసుకోవటానికి ప్రయత్నాలు చేస్తుంటాడు వసంత సహాయంతో డా॥ శివాజి. స్వతంత్రను పరిచయం చేస్తుంది వసంత డా॥ శివాజికి. ఆదిత్య డా॥ శివాజి హాస్పటల్లో రోగులకు ఫిజియో థెరపీ చేయించటానికి చేరతాడు. డా॥ శివాజి, వసంతల వ్యవహారం ప్రత్యక్షంగా తెలుసుకొన్న స్వతంత్ర ఓ ఉత్తరం ద్వారా తన నిర్ణయాన్ని శివాజికి తెల్పుతుంది. ఇక తను ఆడే నాటకాన్ని విరమించాలని ప్రయత్నిస్తుంటుంది ముకుందాదేవి.

"నీ బాధ ఏమిటో నీకు తెలియదా!" తీక్షణంగా చూచాడు భగవంతుడు.

"అజ్ఞానంచేత వాళ్లేదో అంటున్నారు. జవాబు ఇవ్వండి స్వామీ" అన్నది సత్యవతి.

ముకుందాదేవికి కృష్ణపరమాత్మ వేషంలోకి వెళ్లిపోగానే ఏదో ఒక మైకం ఆవేశం కల్గి పాత్రలోకి వెళ్లిపోయేది. ఈ రోజు కాస్త జంకుగా చూచింది.

ఆ క్షణంలో నీలిమకు జూలియస్ సీజర్ నాటకం గుర్తుకు వచ్చింది. బ్రూటస్‌ను నమ్మిన సీజర్ అతను పోటు పొడవగానే "యూ టూ బ్రూటస్" అంటూ ఆశ్చర్యపోతాడు. అలాంటి భావనే తల్లి కళ్లలో చూచింది. సత్యవతికూడా ఎదురు తిరుగుతుందని ఊహించలేదు.

ఇదీ ఒకందుకు మంచిదే. కొంచెం దుష్ప్రచారం జరిగినా తల్లి త్వరగా అవతారం చాలిస్తుంది. అనుకుంది.

ముకుందాదేవి కళ్ళు మూసుకుని ముఖం చిట్లించి, విభూతి చేతిలో వేసింది. విభూతి చేతిలో వేయటం అంటే వచ్చేవారం రమ్మని అర్థం అన్నమాట.

వాళ్ళు ముకుందాదేవి వాయిదావేస్తే ఏం చేయాలో ఆలోచించుకురాలేదు. అందుకే వెనుక ఉన్న భక్తుల యాగీకి కదిలిపోయారు. వాళ్ళు వెళ్లిపోగానే తలనొప్పి సాకుతో సత్యవతి వెళ్లి పోయింది.

ముకుందాదేవి బేలగా చూచింది. నీలిమ కళ్లలోనే ధైర్యం చెప్పింది. ఆరోజు మామూలు తంతు జరుగగానే, అభిషేకానికి ఏర్పాట్లు చేసారు. అప్పుడే సత్యవతి వచ్చి కడుపులో నొప్పి అంటూ ముకుందాదేవి పాదాల దగ్గర వాలిపోయింది.

"సత్యా!"

"భగవాన్! మీ సత్యనే కడుపులో నొప్పి."

ముకుందాదేవికి మండిపోయింది. సత్యవతి చేస్తున్నది నటన అని తెలుసు. అందుకే ఒక

పాడితీసి నోట్లోవేసి, పాలు పాయ్యాలని ఎత్తింది. సత్యవతి వెనక్కు తగ్గింది. ఆ పాడి ఏమిటో తనకు తెలుసు. ఆ పాడి తీసుకుంటే ఏమవుతుందో కూడా తెలుసు.

వెనక్కు తగ్గింది.

''స్వామివారి ప్రసాదం కాదంటావా ?'' ఒక భక్తురాలు బలవంతగా సత్యవతి నోరు తెరిపించి, పాడి, పాలు మింగేవరకు పట్టుకుంది. అది మింగుతూ, సత్యవతి గాఢ నిదురలోకి జారుకున్నది. ఆమెను ప్రక్కనే ఉన్న సోఫాలో పడుకోబెట్టారు.

ముకుందాదేవి ఒక గాఢమైన నిట్టూర్పు వదిలింది.

నీలిమ సమయం చూచింది. పదకొండు గంటలు కావచ్చింది. అభిషేకానికి మరోగంట. తప్పదు అనుకుంది. ఇంట్లో ఆదిత్య ఉన్నాడు. కాని అతన్ని చూచి సావిత్రమ్మ ఏమంటుందో ! అనుకోనీ. ఈ రోజు అంతా తేల్చి వేస్తుంది. పన్నెండు గంటలకు అభిషేకం ముగిసింది.

సత్యవతి లేదు. పనివారి సాయంతో సామాన్లు తీసుకుని ఇంటికి వచ్చింది. ఆమె ఊహించినట్టు హాల్లో ఆదిత్యలేదు. సావిత్రమ్మ, కారాలు మిరియాలు నూరటంలేదు.

ఇల్లంతా నిశబ్దంగా ఉన్నది.

''సావిత్రీ !''

''తల్లీ కొడుకు మొదటాట సినిమాకెళ్లారమ్మా.''

''రెండో ఆటకెళ్లినా ఇంటికివచ్చే సమయం అయింది కదే.'' అన్నది ముకుందాదేవి.

నందనరావు గుర్రు పెడుతున్నాడు.

ముకుందాదేవి అలసటగా గదిలో అడుగు పెట్టి సర్పద్రష్టలా ఆగిపోయింది. బీరువా తలుపులు బార్లా తీసి ఉన్నాయి. తలుపులో ఉన్న లోపలి స్టోర్ తలుపులు తీసి ఉన్నాయి. సామాన్లనీ. బయటికి కనిపించేవి. బోసిగా, కనిపించింది



# యక్షగానం

ఆమె కాళ్లలో సన్నగా ఒణుకు ప్రారంభం అయింది.

"నీలూ !"

నీలమ చేతిలోని వస్తువులు క్రిందపెట్టి వచ్చింది.

"ఏమిటమ్మా..."

ముకుందాదేవి మాటలు రానట్లు చేతలుడిగినట్టు, చేత్తో బీరువావైపు చూపింది.

"అమ్మా!" ఒక్కంగలో లోపలికి వెళ్లింది నీలిమ, మళ్లీ వచ్చింది.

"అమ్మా... అమ్మా... ఏం వదిలి పెట్ట లేదు... పిసరంత కూడా లేకుండా తీసుకుపోయారు..." అన్నది అరిచినట్టే.

"ఏమిటి తీసుకుపోయారా !" ఆమె వెళ్లింది. ఏం మిగలలేదు. బీరువాలో చీరలు హాంగ్ చేసే రాడ్స్ తప్ప ఏం మిగల్లేదు.

"దోపిడి... దగా... మోసం..." పిచ్చిగా అరిచింది ముకుందాదేవి.

"అవునూ, వీళ్లంతా ఏరి ? ఆదిత్య ఎడి? ఆదిత్యా... ఆదిత్యా..." పిలుస్తూ బయటికి వచ్చింది. జవాబు లేదు.

చీమ చిటుక్కుమన్నా మేలుకునే నందనరావు శవంలా పడి ఉన్నాడు.

"అమ్మా !... దోపిడీ జిరిగింది దోపిడీ..."

"నా ఏళ్ల కష్టార్జితం నీలూ...సావిత్రీ.."

"ఏమిటే అలా కెకలు వేస్తున్నావ్ ?" అప్పుడే టాక్సీ వాడికి డబ్బులిచ్చి వచ్చింది సావిత్రి.

"నువ్వు... నువ్వు ఇంతసేపు... ఎక్కడున్నావ్ ?"

"అదేం ప్రశ్నే పిచ్చి ప్రశ్న. నువ్వేకదా చెప్పి పంపావు. ఇంట్లో మీకు బోరుగా ఉంటుంది. సెకెండ్ షో చూచిరమ్మని."

"నేనా... నేను... యెవరితో చెప్పాను ?"

"ఉత్తరం రాసి, మీ అసిస్టెంటు తెచ్చిందే..." అన్నది.

"నా అసిస్టెంటా !" ముకుందాదేవి ఆశ్చర్యపోయింది.

"మీ అసిస్టెంటే, నన్నూ బయటికి పంపింది మేడమ్. చిన్నబాబుకు యాక్సిడెంటు అయిందని చెప్పింది." అన్నాడు, అప్పుడే అక్కడికి వచ్చిన ఆదిత్య.

ముకుందాదేవి అతడిని దీక్షగా చూచింది.

"నువ్వెప్పుడు వచ్చావ్ ?"

"నందనరావుగారికి బాగాలేదంటే చూచి పోదాం అని వచ్చాను."

"ఇంతకుముందు నువ్వు ఇంట్లో ఉన్నావన్న మాట."

"అవునమ్మా ! నేనే నాన్నగారి దగ్గర ఉంచి వచ్చాను." అన్నది నీలిమ.

ముకుందాదేవి తల పంకించింది. "అర్థం అయిందే అంతా అర్థం అయింది." అని గొణుక్కుంటూ వెళ్లిపోయి ఫోన్ చేసింది.

"అమ్మా... యెవరికి ?"

"పోలీసులకి..."

"నీకేమయినా మతిపోయిందా ! ఆ డబ్బు పోలీసులకు తెలియదు." అన్నది, ఫోన్ లాగుతూ.

"నువ్వు "నోరుముయ్యి..." కూతుర్ని నెట్టేసి, ఫోన్ చేసింది. ఫోన్ పెట్టేసి వచ్చి ఆదిత్య కాలరు పట్టుకుంది.

"ఒరేయ్... చెప్పు... చెప్పరా ! ఇప్పటికయినా మించిపోయిందేంలేదు. నా డబ్బు నాకిచ్చెయి, నా వస్తువులు అక్కడ పెట్టు... క్షమించేస్తాను..." ఆమె ఆవేశంతో మాట్లాడలేక పోతున్నది.

"మీరు... మీరేమంటున్నారు ?"

"నేను అన్నది అర్థంకావటంలేదా ! బుద్ధి జ్ఞానం ఉన్నాయా ! అన్నం పెట్టిన ఇంటికి కన్నం వేస్తావా ! వెళ్లిపోయినవాడివి ఎందుకు వచ్చావు ?" కోపంగా ఊపేసింది.

"అమ్మా ! వదులు..." నీలిమ వదిలించింది.

"అయితే నీ కూతురే పిలిపించుకుందన్న మాట. ముకుందా తొందరపడి రిపోర్ట్ ఇచ్చావు. అతనితో కలిసి నీ కూతురే కాజేసిందేమో." సావిత్రమ్మ అన్నది వెటకారంగా.

"మమ్మీ! ఆ బిచ్‌కు బుద్ధి చెబుతానన్నావు. ఇప్పుడు చెప్పు." అన్నాడు చిన్నబాబు నవ్వుతూ.

"యెవరు... బిచ్ యెవరు ?" ఆవేశంగా అరిచింది నీలిమ.

"ఇంకెవరు? నువ్వే...నువ్వే..." అన్నాడు, కోపంగా.

నీలిమ పురుగును చూచినట్టు చూచింది — వెళ్లి, ఆ చెంప, ఈ చెంప పెడా, పెడా వాయించేసింది.

"ఈడియెట్ ! గెటవుట్..."

"నా కొడుకును ... ఫారిన్ రిటన్డ్‌ను కొడతావుటే..."

"ఫారిన్‌లో పాకీదొడ్లు కడిగినా గొప్పే..." కోపంగా ఇంకా ఏదో అనబోయింది. అప్పుడే పోలీసులు వచ్చారు.

"మా అమ్మాయికి కట్నం యివ్వాలని దాచిన డబ్బు, భక్తులు సమర్పించిన కానుకలు పోయాయి..." అంటూ అంతా చూపింది.

"ఎంత డబ్బు, బంగారం పోయిందమ్మా!" ఇన్‌స్పెక్టరు అంతా చూస్తూ అడిగాడు.

"భక్తులు ఇచ్చింది అక్కడ పడేశానేతప్ప నేను ఏనాడు లెక్క చూడలేదు" అన్నది ఏడుస్తూ.

"ఓ లక్ష రూపాయలు ఉంటాయా !"

"ఉండే ఉంటాయి..." అన్నది మనసులో అంచనావేస్తూ. ఎంత లేదన్నా పది, పదిహేను లక్షలకు తక్కువ ఉండదు. ఆ విషయం తలుచుకోగానే ఆమె గుండెలు దడదడలాడేయి.

అతను అంతా తిరిగి చూచాడు. అందరి స్టేట్‌మెంట్లు తీసుకున్నాడు. నందనరావుకు నిదుర మాత్రల డోసు ఎక్కువయింది. అతనికి ఫాస్కులో పాలు తాగించింది ఆదిత్య.

నీలిమ ఆదిత్యకే ఇల్లు అప్పగించింది. తను వచ్చేవరకుండమన్నది. ఆదిత్య ఇల్లు వదిలాడు, దొంగతనం జరిగింది. ముకుందాదేవి అతని పేరే చెప్పింది. పరిస్థితి అతనిపైకే త్రోసింది.

అతన్ని అరెస్ట్ చేయక తప్పలేదు.

ఫెర్టిలైజర్ సిటీ 'మొనామీ ఆర్ట్స్' వారు నిర్వహించిన అఖిలభారత అన్నిభాషల ఏకాంకికల పోటీల్లో సంఘ మిత్ర (ఫెర్టిలైజర్ సిటీ) వారు ప్రదర్శించిన శ్రీ ఆదివిష్ణు రచన 'వాళ్లిద్దర్తో వీళ్లు ముగ్గురు'లో శ్రీయుతులు క. స. భా. చారి,. మల్లికార్జునరావు, కె. వి. పార్థసారధి, కె.ఎస్.పి. రావు, పి. మాధవరావు, కృష్ణ పాల్గొన్న ఒక దృశ్యం. ఈనాటికకి ఉత్తమ ప్రదర్శన, ఉత్తమ దర్శకుడు (శ్రీ క.స.భా. చారి), ఉత్తమ సహాయ నటుడు (శ్రీ కె. ఎస్. పి. రావు) బహుమతులు లభించాయి.



# ఉచిత కానుక!

## గ్లూకోన్-డి (T) యొక్క తక్షణ శక్తితోపాటుగా




## ఆకర్షణీయమైన స్టెయిన్‌లెస్ స్టీల్ చెమ్చా ఒకటి.

HTB-GLL-9686

తక్షణ శక్తినిచ్చే మీ దినసరి పానీయం. దాన్ని కలుపుకోడానికొక చక్కని సాధనం.

ఈ తళతళ మెరిసే స్టెయిన్‌లెస్ స్టీల్ చెమ్చా గ్లూకోన్-డి 400 గ్రా. ప్యాక్‌తో పూర్తిగా ఉచితం.

తాజాదనాన్నీ, చల్లగా శక్తినీ ఇచ్చే గ్లూకోన్-డి విటమిన్ డి, కాల్షియం, ఫాస్ఫరస్‌లతో బలపరచబడినది. దాన్ని అలాగే తీసుకోండి, లేదా పళ్లరసం, పాలు, తేనీరు, కాఫీ, లేదా మంచినీళ్లలో కలిపి తీసుకోండి.

అయితే ఒక్కటి! దాన్ని గ్లూకోన్-డి ప్రత్యేక కానుక చెమ్చాతో మట్టుకు కలిపి తీసుకోండి!







స్టాకు పరిమితం, నిర్ణీత స్థలాలలో మాత్రమే లభ్యం.

**తక్షణ శక్తి కోసం–గ్లూకోన్-డి** (T)

మంచి ఆరోగ్యానికి మూలస్థానం
గ్లాక్సో

''ఇన్‌స్పెక్టర్‌గారూ! పరిస్థితులు అలా వచ్చాయి. అతనికేం తెలియవు. మా అమ్మదగ్గర పనిచేసేవారే ఇదంతా చేశారు...'' అని నీలిమ చెప్పినా వినలేదు. ఆదిత్యను అరెస్ట్ చేశారు.

''ముకుందా! ఏదో చెడిపోయిందానవని... దయతలచి నీ చరిత్ర తెలిసి పిల్లను చేసుకుందాం అనుకుంటే, నా కొడుకును కొడుతుందా! ఏదే నిమ్మల్ని కొడుతుందే! ఓహో! తమరు దేవుడేమో. రక్షించుకుంటావేమో...'' అన్నది వెటకారం చేస్తూ.

ముకుందాదేవికి జవాబు ఇచ్చే అవకాశం ఇవ్వలేదు. ఆమె ఇచ్చే స్థితిలో కూడా లేదు.

సావిత్రి కొడుకుతో వెళ్లిపోయింది.

''అమ్మా... పాలు త్రాగుతావా!'' నీలిమ అడిగింది.

ముకుందాదేవి కూతురి చేతులలో ముఖం దాచుకుని బావురుమన్నది.

''అయిపోయిందే... అంతా అయిపోయింది. ఏ నటీ నటించని పాత్ర నటించాను. సంపాదించాను... అంతా పోయింది...''

''అమ్మా! ఇది ఆ చైనులు, రాయుడిగాడి పనే. అనవసరంగా ఆదిత్యను ఇరికించావు'' అన్నది కోపంగా.

''నన్ను... నన్నేం అనకు...'' ఆమె డొక్కలెగిరిపడేట్లు ఏడుస్తూనేఉంది. బలవంతంగా పాలు త్రాగించి, నిదుర మాత్ర ఇచ్చింది. తల్లి నిదురబోయేవరకు అలాగే కూర్చుంది. ఆమె మనసంతా శూన్యంగా ఉంది. ఏం జరుగుతుందో ఊహించలేకపోయింది.

## 15

శివాజి స్వతంత్రతతో తెగతెంపులు అయ్యాక, వివాహమే వద్దు అనుకున్నాడు కాని పార్థసారధి గొడవ ఎక్కువయిపోయింది. వసంతతో దూరంగా ఉంటున్నాడు. ఆమె నిందలు నిష్ఠూరాలు వేస్తున్నది. అయినా తప్పించుకు తిరుగుతున్నాడు. ఇంట్లో ఒక స్త్రీ అండదండలు కావాలి. అందుకే తన విషయాలు స్పష్టంగా తెలుపుతూ పత్రికలో ప్రకటన ఇచ్చాడు.



''భార్య మరణించిన నలభై మూడేళ్ల డాక్టరుకు వధువు కావలెను. విడాకులిచ్చినవారు, విధవలు అయినా ఫరవాలేదు. డాక్టరుగారితో పాటు అతని ఎనిమిది సంవత్సరముల కొడుకు బాధ్యత వహించాలి'' అని అడ్రసు కూడా ఇచ్చాడు.

శివాజి కూర్చుని, రోజూవచ్చిన అప్లికేషన్స్ పరిశీలిస్తున్నాడు. ఒక్కటీ నచ్చలేదు. మరీ వయసులో చిన్నవారో, పెద్దవారో వస్తున్నారు. అతని అంచన ప్రకారం ముప్పై సంవత్సరాలు దాటి ఉండాలనుకున్నాడు. కాని అలాంటి వారు దొరకలేదు.

ఆరోజు పోస్ట్‌లో రెండే, రెండు ఉత్తరాలు వచ్చాయి.

ఒకావిడ ముప్పై సంవత్సరాలు ఉద్యోగం చేసిందట, అన్నదమ్ములను చదివించిందట. అక్క, చెల్లెళ్లను ఆదుకున్నదట. ఇప్పుడు తనకు తాను మిగిలిపోవాలనుకుంటున్నదట. ఉద్యోగం, మాని బాదర బందీలేక, ఇల్లాలి జీవితం గడపాలను కుంటోందట.

అతను వయస్సు చూచాడు. సిన్సియర్‌గానే వ్రాసింది. నలభై ఎనిమిదేళ్లుట. నలభై ఎనిమిదేళ్లు ఉండటం ఆమె తప్పు కాదు కాని, ఆ వయసులో ఆమె ఇల్లాలుగా స్థిరపడగలదా?

అతనికి అర్థం కాలేదు.

రెండో అప్లికేషన్ తీసాడు. లోకల్ పోస్ట్. 'నందనరావు' చిరపరిచితమైన పేరులా కనిపించింది. వివరాలు చదివాడు. ''వధువు నీలిమ, తండ్రి నందనరావు, పెరాలసిన్ పేషెంటు'' ఆసక్తిగా చదివాడు.

''రోజూ అవి చూచి పడెయ్యటమేనా! దాన్ని సెటిల్ చేసేది ఏమయినా ఉన్నదా!'' అన్నాడు పార్థసారధి.

''ఈ నందనరావు మన పేషెంటు కదు మామయ్యా!''

''మన పేషెంటే. అతని మాట నమ్మి మనము అతను పంపిన వ్యక్తికి ఉద్యోగం ఇచ్చాము...''

''ఆదిత్య గురించా! మంచి వర్కర్...''

''అతని సంగతి పూర్తిగా తెలియదు. అతను దొంగల ముఠాను తయారు చేసాడట.'' అన్నాడు పార్థసారధి.

''ఈజిట్...''

''ఆనందరావు భార్య దేవుడ్నీ, దేవుడిని అంటూ సంపాదించిదంతా దోచిపెట్టి, జైలుకు వెళ్లాడు'' అన్నాడు.

''నిజమా! కాని ఆదిత్యను చూస్తే అలా అనిపించదు మామయ్యా! చాకులాంటి కుర్రాడు.''

''మెరిసేదంతా మేలిమి కాదన్న సామెత ఉందికదా. ఆ నందనరావు భార్య ఈరోజు రోడ్డున పడింది. ఆ పిల్ల అప్లైచేసి ఉంటుంది.''

''అవును మామయ్యా'' అన్నాడు. అతని కళ్లముందు ఒక్కసారి తండ్రి ఆరోగ్యం గురించి తపనపడే ఆ అమ్మాయి కనిపించింది. ఒక రాత్రంతా కార్డ్సు ఆడారు. ఆమెను చూడగానే ఎందుకో ఒక విధమైన అనురాగం, ఆత్మీయత కలిగాయి. కొందరిని చూస్తే, అంతేనేమో!

''ఆ పిల్లను గురించి మరిచిపో. వాళ్ల సమస్యలు మనమెక్కడ నెత్తిన వేసుకుంటాము'' అని పార్థసారధి వెళ్లిపోయాడు.

శివాజికి ఎందుకో ఆ అమ్మాయిని చూడాలనిపించింది. వెంటనే రిప్లై రాసాడు. ఆదివారం, తన ఇంటికివచ్చి కలుసుకుని మాట్లాడమన్నాడు. అతను ఆ ఉత్తరంపై అడ్రసు రాస్తుండగానే, నర్సింగ్‌హోమ్‌నుండి ఫోన్ వచ్చింది.

అతను వెళ్లాడు. అపెండిసైటిస్ పేషెంటును తీసుకువచ్చారు. సర్జన్‌తో కలసి ఆపరేషన్ పూర్తి చేసారు.

అతను బయటికి వచ్చేసరికి చంద్రసేన్, వసంత కూర్చున్నారు.

''హల్లో...'' విష్ చేసాడు.

''హల్లో...'' అన్నాడు చంద్రసేన్.







వసంత బుద్ధిమంతురాలిలా తల వంచుకుని కూర్చుంది.

"డాక్టరుగారూ! ఒక సంతోష వార్త. మాకు ... అదే మా వసంతకు ... అదే మా వసంత ఫ్యామిలీ వేలో ఉంది."

"ఈజిట్! కంగ్రాచ్యులేషన్!" అన్నాడు.

"మేము కొన్నాళ్లు ఢిల్లీలో కాపురం పెడదాం అనుకుంటున్నాము. నేను అక్కడ ఉంటున్నాను వ్యాపార రీత్యా. వసంత లోన్‌లీగా ఫీలవుతుంది" అన్నాడు అతను.

"ఐడియా ఈజ్ గుడ్."

"అందుకే ఆదివారం అందరి స్నేహితులకు భోజనాలకు చెప్పాను. మీరు రండి డాక్టరు గారూ."

"విత్ ప్లెజర్ ..." వారిని పంపించాడు. వసంతను లేడీడాక్టరు దగ్గరకు పంపి పరీక్ష చేయించాడు. మందులు రాసిచ్చి పంపించి వేసాడు.

"వసంతగారిప్పుడు మీ కంపెనీ కోసం తాపత్రయ పడరులెండి. స్త్రీలు భలే చిత్రమైన వారు. తమ సంతానం పట్ల చూపిన అభిమానం వేనిమీదా చూపరు" అన్నాడు.

"పురుషులు తక్కువేం కాదు" అన్నది చురుకుగా.

"మా వసంతకు నోటి పదును ఎక్కువయింది. మీరేం అనుకోకండి."

"మరేం ఫరవాలేదు. పేషెంటుగా మీకన్నా నేను ఆమెను బాగా ఎరుగుదును" అన్నాడు శివాజీ.

"చూడండి వసంతగారూ! బయటి తిరిగే మగాడికి వృత్తిరీత్యా, మొహమాటానికి, కొన్ని బలహీనతలువల్ల కొన్నిఅనుబంధాలు ఏర్పడతాయి. అవి 'శాశ్వతం చేసుకోలేడు" అన్నాడు.

"అంగీకరించాం. భోజనానికి రండి."

వాళ్లు వెళ్లిపోయారు. ఆ వారమంతా ఒక్క నిముషం తీరిక దొరకలేదు

యూనివర్సిటీ ఆడిటోరియమ్‌లో మెడికల్ కాన్ఫరెన్స్ జరిగింది. ఆదివారం ఉదయం లేస్తూనే వసంత ఇంటికి వెళ్లాడు. ఆమెకో రాధాకృష్ణుల బొమ్మకొని బహుమతిగా ఇచ్చాడు. చంద్రసేన్‌గారికి స్నేహితులు కూడా వచ్చారు. అందరూ లైట్‌గా డ్రింక్ తీసుకుని భోజనానికి లేచారు. భోజనం చేస్తుండగా గుర్తుకు వచ్చింది. తను నీలిమకు అప్పాయింట్‌మెంటు ఇచ్చిన సంగతి. వాచి చూసుకున్నాడు. రెండుగంటలు కావస్తుంది. పదిన్నరకు టైమ్ ఇచ్చాడు.

"ఓ గాడ్..." అతను లేచి, అందరి దగ్గరా సెలవు తీసుకుని వచ్చాడు. అతను నీలిమ ఉంటుందనుకోలేదు.

అతను వరండాలో అడుగుపెట్టి ఆగి పోయాడు. నీలిమ పేపరు చదువుతూ, పేము కుర్చీలో ఓ ప్రక్కకు ఒదిగి నిదురబోతున్నది.

"నీలిమా!... నీలిమగారూ..."

## ఈ జి టోస్!

ఆగ్నీ ఆజ్యం కలసిఉంటే
సుఖమేంటి ?
మంటలు మంటలు !
ధనం పదవీ కలసిఉంటే
సుఖమేంటి ?
మంటలు మంటలు !
అగ్ని పొయ్యిలోనా
ఆజ్యం అన్నంలోనా
ఉంటే హాయి హాయి !
ధనం బడుగువర్గాలకూ
పదవి బుఱ్ఱగలవారికీ
ఉంటే హాయి హాయి !
అంటే;
కొన్ని కలసి ఉంటే సుఖం సున్న !
ఉండాల్సిచోట ఉంటే సుఖం మిన్న !

—పి. మోహన్

ఉలిక్కిపడి లేచింది.

"అయామ్ సారీ... వెళ్లిపోయి ఫోన్ చేసి రావల్సింది." అన్నాడు.

"నమస్తే..." కళ్లు నులుపుకుని కంగారుగా లేచింది.

"మీరు వెళ్లిపోవాల్సింది."

"ఇంటి దగ్గరయినా ఇదే పని చేయాలి డాక్టరుగారూ." అన్నది.

"కూర్చోండి ..." అన్నాడు. ఆమె కూర్చుంది. తను కూర్చున్నాడు. ఆమె ముఖం వాడిపోయినట్టు పీక్కుపోయింది.

"మీరు మొదట వెళ్లి భోజనం చెయ్యండి" అన్నాడు.

"నేను వంట చేసి, అమ్మ, నాన్నలకు పెట్టి, నేను భోజనం చేసాను." అన్నది ధన్యవాదాలు చెబుతూ.

"అయితే కాఫీ తీసుకోండి." వంటావిడచేత కాఫీ, బిస్కెట్లు తెప్పించాడు. ఆమె తీసుకున్నది.

"మీరు అసహాయులయి ఈ నిర్ణయం తీసుకున్నారా!"

"మిమ్మల్ని ప్రేమించానంటే మీకు తృప్తిగా ఉంటుందా!" ఎదురు ప్రశ్న వేసింది.

అతను నవ్వాడు.

"పరస్పరం అవసరం డాక్టరుగారూ! సొమ్ము పోయి, దిమ్ము పట్టిందన్నట్టు అవుతుంది. కారమ్మిన డబ్బు అంతా లాయర్లకే పెట్టాము. ఇంట్లో ఒక భాగం అద్దెకిచ్చాం. దాంతో మా బ్రతుకు గడవాలి. నిజానికి ఆ వచ్చే అద్దె మా నాన్న ఒక్కనెల మందులకు సరిపోదు. మీ ఇల్లు చూచుకుని, మీ అవసరాలు నేను తీరుస్తాను. నాన్నగార్ని నర్సింగ్‌హోమ్‌లో ఉంచి ట్రీట్‌మెంటు మీరివ్వండి" అన్నది. ఆ మాటలో ఎక్కడా జంకు, భయం లేవు.

"నీ నిర్ణయం మీ అమ్మ, నాన్నలతో చెప్పావా!"

"చెప్పాను."

"వాళ్లేమన్నారు ?"

"పదుగురాడుమాట పాటియై ధరజెల్లు, ఒక్కడాడుమాట యెక్కదెందు" అని వేమనగారి సూక్తి. పది మంది చెప్పిన అబద్ధ మయినా, సత్యంగానే భావించబడుతుంది. ఒక్కడే పలికినది సత్యమయినా,దానిని అబద్ధపు మాటగానే అందరూ తలుస్తారు.




మాటకు ఉన్న విలువ మరి దేనికీలేదు. ఎటువంటి తీవ్రమైన ఆయుధాలయినా దాని ముందు పని చెయ్యలేవు. అది రాజ్యాలను నిలుపుతుంది. రాజ్యాలను నశింపజేస్తుంది. మనిషిని ఉన్నతస్థితికి తెస్తుంది. అధోగతి పాలు చేస్తుంది మనిషి జీవించడానికీ, లేదా అకాలమృతిని పొందడానికీ గొప్ప సాధన మయినది మాటయే !

రోగంతో బాధపడుతున్నవానికి వైద్యుడు ధైర్యంచెప్పి కొద్ది రోజుల్లో రోగం పూర్తిగా పోగొట్టగలనని హామీయిస్తే — ఆ మాట మందువలె పనిచేసి రోగి కోలుకొంటాడు. అలాకాక "ఈ రోగం కుదిరేదికాదు. నా మందులు పనిచేసినట్లు కనబడదు" అని అంటే — రోగి ఆ మాట విని క్రుంగిపోవడం, రోగం ఎక్కువ కావడం, ఎప్పుడోపోయే ప్రాణం శీఘ్రంగా పోవడం సంభవిస్తుంది. వైద్యు డెప్పుడూ రోగిని క్రుంగదీసే మాటలు చెప్ప కూడదు.

జాతకం చూచిన జ్యోతిష్కుడు, జాతక చక్రంలో మారణయోగం ఉన్నట్లు గ్రహించినా ఆ విషయం చెప్పకుండా, ధైర్యం కలిగించే మాటనే చెప్పాలి. అలా కాకుండా "నీకు మారణయోగం ఉన్నది. కొద్ది కాలంలోనే అపాయం కలుగుతుంది" అని చెప్పితే, పిడుగు లాంటి మనిషి కుంగిపోయి, తీవ్రమైన ఆందోళ నకు గురియై, మానసిక రోగంతో బాధపడి కొద్ది రోజుల్లోనే మరణించవచ్చును.

విద్యలో వెనుకబడినవానికి ఉత్సాహాన్ని కలిగించే మాటలతో ప్రోత్సాహం ఇచ్చి విద్యా వంతుణ్ణి చెయ్యవచ్చు. హీనస్థితిలో ఉన్న వానికి ప్రోత్సాహం ఇచ్చి వృద్ధి పొందించ వచ్చును. ఆ విధంగానే శ్రీమంతుణ్ణి స్తుతిస్తూ, పొంగవేసి, అతనిచేత ధనం విపరీతంగా వ్యయం చేయించి దరిద్రుణ్ణిగా మార్చవచ్చును.

మాటకు ఇంత శక్తి ఉన్నా, ఆ మాట ఒకరికి మేలుచేసేరీతిలోనే ఉండాలిగాని,అధోగతిని కలిగించే పద్ధతిలో ఉండకూడదు. మంచి స్వభావంగల వాళ్లెవ్వరూ ఇతరులకు హానిని కలిగే విధంగా మాటలాడరు. విద్యావంతులు కూడా, తమకు సరిగా మాటలాడడం చేతగాక, ఉపకారం చెయ్యాలనుకున్నా, ఆ మాటలవల్ల అపకారం కలిగే సంఘటనలు ఎన్నో ఉన్నాయి.

అంధుడయిన ఒక విద్యార్థి — తెలివి కలవాడగుటవల్ల శ్రమపడి ఎలాగో బి. ఏ. పట్టాన్ని సంపాదించాడు. అతనికి పై చదువు చదవాలనే గట్టి కోరిక ఉంది. "దీనితోనే తృప్తిపడు. ఇంకా పైచదువు చదివి ఏమి చేస్తావు ? అంధుడివికూడాను." అని ఒక అధ్యాపకుడు నలుగురిలోనూ అన్నందుకు ఆ అంధ విద్యార్థి ఎంతో బాధపడి, జీవితంమీద విరక్తి కలిగి ఆత్మహత్య చేసుకోవడం సంభ వించింది. తాను మంచికే చెప్పాననుకున్న ఆ ప్రొఫెసరు తర్వాత ఎంతో పశ్చాత్తాపం పొందవలసి వచ్చింది.

అందువల్ల, మనం మాటలాడేటప్పుడు ముందు వెనుకలు బాగా ఆలోచించి, నిదానించి మాటలాడడం అవసరం. లేకపోతే, కలహాలు, అసంతృప్తి కలగడం, అపయశస్సు పొందడం జరుగుతుంది. ★

# యక్షగానం

"అవకాశాలు లేకపోయినా, ఆశలుంటాయి. కొన్నాళ్ల క్రితమే వారిని కాదని నా నిర్ణయం, నేను తీసుకుంటే, ఈనాడు ఎంతో సంతోషంగా ఉండేదాన్ని." అన్నది నీలిమ.

"బాగా ఆలోచించుకున్నావా ! నీకంటే రెండింతలుంది నా వయసు."

"సుఖపడాలనుకుంటే వయసు అడ్డురాదు. నాకేం అభ్యంతరంలేదు. మీకేమయినా ఉంటే చెప్పండి." అంత కచ్చితంగా మాట్లాడుతున్న ఆ అమ్మాయిని ముగ్ధుడయి చూచాడు.

"మా అమ్మ విదేశీ మోజులోపడి, తన స్నేహితురాలి కొడుకుతో పెళ్లి అంటే, కాదని నాకు నచ్చినవాడిని చేసుకుని, ఆమెను ఆ దేవుడు నాటకంనుండి తప్పించవలసింది."

"మీ అమ్మగారి దగ్గర మహత్తు లేదా !"

"హేతువాదంతో శాస్త్రం చదివే మీరు నమ్ముతారా !"

"నమ్మక ఏం చేయను ! చెప్పే విషయాలు వింటుంటే మతిపోయేది." అన్నాడు.

"అదే మనిషి బలహీనత ! మంచిగా బతుకుతాం అంటే యెవరూ నమ్మరు. కాని మోసం చేస్తే అందరిని ఆకర్షిస్తారు. అయినా మోసంతో వచ్చిన ఆస్తి మోసంతోనే పోయింది." అన్నది.

"మీరు ఎవరినయినా ప్రేమించారా !"

"డాక్టరుగారూ ! 'మువ్వు' అనండి చాలు. ఫలించని ప్రేమ గురించి చర్చలు, మాటలు దేనికి !" అన్నది. అతను ఏం మాట్లాడలేదు.

"నాకు ప్రమాణాలపై, వాగ్దానాలపై నమ్మకం లేకపోయినా, ప్రమాణంచేసి, ఓ వాగ్దానం చేస్తున్నాను. మీతో వివాహం అయ్యాక మీ దానిగానే మిగిలిపోతాను." అన్నది.

"ఓ... నో ! అలాంటి అపనమ్మకంతో కాదు. మరి రిజిస్టర్ మేరేజ్‌కు సిద్ధమేనా !"

"మీరు గుడిలోగాని, నల్గురి పెద్దలుముందు దండలు మార్చుకుందాం అన్నా, నాకేం అభ్యంతరం లేదు." అన్నది.

"అయితే మా మామగారు చాలా భక్తులు. మనము క్లుప్తంగా ఏదయినా గుడిలో దండలు మార్చుకుందాం." అన్నాడు.

"అలాగే." అన్నది.

"ముహూర్తం చూచి ఫోన్ చేస్తాను."

"థ్యాంక్యూ..." లేచింది నీలిమ.

"థాంక్స్ నేను చెప్పాలి నీలిమా." అన్నాడు. ఆమె బయటకి రాగానే, డ్రాప్ చేస్తానన్నాడు.

"వద్దు. నేను వెళ్లగలను. మీరిప్పుడే వచ్చారు." అన్నది.

ఆమెనే చూస్తూ నిలబడిపోయాడు. కొన్ని రోజుల క్రితం తండ్రిని చూడటానికి యువరాణిలా కార్లో వచ్చి తీసుకు వెళ్లింది. ఈ రోజు నడిచి పోతున్నది. విధి లీలలు విచిత్రమైనవి.

(ఇంకా ఉంది)



# పిల్లలూ – పెద్దవాళ్ళూ

అవధానుల విజయలక్ష్మి

బాబాయి పెళ్లనగానే నాకెంత సరదా వేసిందో !

డాబామీదికి పరిగెత్తి సాయంత్రం దాకా స్కిప్పింగ్ చేసుకొంటూ ఉండిపోవాలని పించింది ... వీధి చివర మైదాన ముందే అక్కడికెళ్లి ఆకుపచ్చటి గడ్డిలో ఈ చివర్నించి ఆ చివరిదాక పరుగులు పెట్టాలనిపించింది...పార్కు మధ్యలో జారుడుబండ ఉందే దానిమీది కెక్కి జాంయిమని జారిపోవాలని పించింది.

బోల్డంత హుషారొచ్చేసిందిగా ... మరేం చెయ్యడం ? అందుకే డాబామీది కెక్కి హాయిగా స్కిప్పింగ్ చేస్తూ కూర్చొన్నాను. కింటినించి అమ్మ కేకేసింది.

''ఒసే చిట్టీ తొందరగా రావేతల్లీ...ఇవాళ బండిలో బాబాయి పెళ్లిచూపుల కెళ్లాలిగా.''

నేను గబగబా కిందికి పరిగెత్తాను. అసలు మొన్ననే చెప్పింది అమ్మ ''మనం ఎల్లుండి బాబాయి పెళ్లిచూపుల కెళ్తాం తెలుసా !'' అని.

నాకెంత సరదా వేసిందో ! పెళ్లంటే ఎంత బాగుంటుందో ! చక్కా బోల్డు మంది పిల్లలొస్తారు. హాయిగా అన్ని ఆటలూ ఆడుకోవచ్చు... మరేమో ఎంచక్కా బాజాలు వాయించుతారు. వింటుంటే ఎంత బాగుంటుందో !

''బాబాయికి పెళ్లా ? అమ్మా ... భలే భలే'' అంటూ గెంతాను.

''పెళ్లికాదే పిల్లా ! పెళ్లిచూపులు ! ... అంటే తెలుసా ? మరి బాబాయి పెళ్లి చేసుకోవాలంటే ఓ అమ్మాయి ఉండొద్దూ ? మరి ఆ అమ్మాయి ఎలా ఉందో మనం చూడొద్దూ ? అందుకే ఎల్లుండి పొద్దున్నే ఆ ఆంటీ వాళ్లూరికి వెళ్తాం'' అమ్మ అలా చెప్పగానే బోల్డంత సంతోషం వేసేసింది. 'బండిలో వెళ్తాంట' ఎంత బాగుంటుందో ! ఎంచక్కా

కిటికీ పక్కనే కూర్చొంటే మరీ బోల్డు బాగుంటుంది!

అందుకే మొన్నటినించీ నా సామాన్లన్నీ నా చిన్న అల్యూమినియం పెట్టెలో సర్దేను కొంటున్నాను. నా బొమ్మలూ, కామిక్‌లూ... అన్నీనూ.

అయినా ఈ పెద్దవాళ్ళేంటో ఒక్కోసారి ఉత్త పిచ్చివాళ్ళలా ఉంటారు.

"పెళ్ళికెళ్తూ పిల్లిని చంకనబెట్టుకొని వెళ్ళాడట... నీలాటివాడే ఎవడో... అక్కడికి ఈ బొమ్మలూ, పుస్తకాలు ఎందుకే తల్లీ" అంటూ నేను కష్టపడి సర్దుకొన్నవన్నీ తీసేసింది.

నాకెంత కోపమొచ్చిందో! చాలాసేపు డాబా మీది కెళ్ళిపోయి ఎవ్వరితోనూ మాట్లాడకుండా కూర్చొండిపోయాను... ఆఖరికి కడుపులో బోల్డు ఆకలేసేసి దిగిపోయాను.

"పదవే చిట్టితల్లీ... స్నానం చేయించుతాను. ఇవాళ గబగబా తెమలాలి తెలుసా!" అంది అమ్మ నా గౌను విప్పి గబగబా నన్ను బాత్రూంవైపు తీసికెళుతూ.

రోజూ అయితే అలా స్నానానికని అమ్మ ఈడ్చుకెళ్ళిపోతుంటే చాలా చికాగ్గా ఉంటుంది. మరివాళ చాలా హుషారుగా ఉన్నాను కదా అందుకే అమ్మ వెనకే గబగబా నడిచాను.

స్నానం చేయించుతూ అమ్మంది.

"అక్కడికెళ్ళాక వాళ్ళింట్లో అల్లరి చెయ్యకుండా బుద్ధిగా ఉండాలి తెలుసా!"

ఏంటో ఈ పెద్దవాళ్ళు!! ఈ మాట రెండు రోజుల్నుంచి చెపుతోంది కదా! నాకు మాత్రం బోరుకొట్టదూ?

"పోనీ అమ్మా ... రైల్లో అల్లరి చేసుకోవచ్చా?" అడిగేశాను.

"అవునుమరి ... రైల్లోనూ అల్లరి చెయ్యకుండా... అక్కడి కెళ్ళాకా కూడా చెయ్యకుండా... రోజల్లా బుద్ధిగా ఉండడమంటే కష్టం కాదూ!" అమ్మ నవ్వింది.

"భడవకానా...పోన్లే ట్రెయిన్లో బోల్డు నీ క్కావలసినంత అల్లరి చేసుకో... అక్కడి కెళ్ళాక మాత్రం బుద్ధిగా ఉండాలి."

"ఓ అలాగే బోల్డు బుద్ధిగా ఉంటాను."

"అక్కడ వాళ్ళు తినడానికి ప్లేట్లో మిక్చరూ, జిలేబీలూ అలాంటివి ఇచ్చారనుకో పూర్తిగా తినేయకూడదు. కొంచెం ఒదిలెయ్యాలి. లేకపోతే కక్కుర్తి పిల్లవనుకొంటారు."

"మరి ఇంట్లోనేమో ఒదిలేస్తే దెబ్బలాడతావు. అక్కడేమో 'తినకుండా ఒదిలేయాలని చెప్తావు'" అన్నాను.

అవును మరి. ఈ పెద్దవాళ్ళు ఒక్కోసారి వాళ్ళేం చెప్తారో వాళ్ళే మర్చిపోతుంటారుకదా!

అమ్మ నావైపు కోపంగా చూసింది. అయ్య బాబోయ్. ఊరికి తీసికెళ్ళడం మానేస్తుందేమో!

"సరేలే... పూర్తిగా తినకుండానే ఒదిలేస్తాన్లే. మరి బోల్డు బాగున్నా ఒదిలేయాలా?"

"ఊ"

"మరి జిలేబీ కాకుండా లడ్డూ ఇచ్చినా ఒదిలేయాలా?"

"చంపుతున్నావుకదే నీ ప్రశ్నలతో... మరి నువ్విలా అల్లరి పెడుతూ కూర్చున్నావంటే ట్రెయిను వెళ్ళిపోతుంది. మనం ఊరికివెళ్ళలేం" అంది అమ్మ తువాల్తో గబగబా నా ఒళ్ళు తుడుస్తూ.

"సరేన్లే... ఏదిచ్చినా ఒదిలేస్తాన్లే. మరి చిన్న ముక్క ఒదిలేయాలా? పెద్ద ముక్కా?" అడిగాను. అడక్కపోతే నాకు మాత్రం ఎలా తెలుస్తుంది? మళ్ళా ఎక్కువ ఒదిలేస్తే ఇంట్లో దెబ్బలాడినట్లే దెబ్బలాడదూ?

అమ్మేం జవాబు చెప్పలేదు. నన్ను గబగబా బాత్రూంలోంచి ఈడ్చుకుపోయింది.

* * *

పెళ్ళికూతురు పిన్నీ వాళ్ళింటికొచ్చేశాం. అందర్నీ కుర్చీల్లో కూర్చోపెట్టారు. నేనూ, అమ్మా, నాన్నా, బాబాయ్యీ,తాతగారూ అందరం కుర్చీలో కూర్చొన్నాం.

ఈ కుర్చీలు మా ఇంట్లో సోఫాల్లాగా మెత్తగాలేవు... నేను కూర్చొన్న కుర్చీ అటూ ఇటూ ఊగుతోందికూడానూ.

అమ్మ చెప్పినట్లు వాళ్ళు అందరికీ ప్లేట్లలో బిస్కట్లుపెట్టి మధ్య టేబిల్ మీద పెట్టేశారు.

అమ్మ ముందే చెప్పేసిందిగా... బుద్ధిగా ఉండాలని! అందుకే బోల్డన్ని తీసుకోవాలనిపించినా ఒక్కటే బిస్కట్టు తీసుకొన్నాను. కూర్చున్న కుర్చీ బాగాలేదు... బిస్కట్టుకూడా ఒక్కటే తీసుకొన్నాను. అయినాసరే ఇంట్లోలాగ నాకు కోపం రానేలేదు! ఎందుకో తెలుసా!

మా అందరికి ఎదురుగా కుర్చీలో కూర్చొని ఉందిగా... పెళ్ళికూతురు పిన్ని... ఎంత బాగుందో!

అందుకే బిస్కట్టు తినడం మర్చిపోయి కూడా ఆ ఆంటీనే చూస్తూ కూర్చొన్నాను.

నా బర్త్‌డేకి అమ్మ కొందిగా పసుప్పచ్చటి గౌను? సరిగ్గా ఆ రంగులోనే ఉంది ఆంటీ.

మరేమో కళ్ళెంత బాగున్నాయో! పుస్తకాల్లో బొమ్మలకి వేస్తుంటారే కళ్ళు? అంత బాగున్నాయి! ఆంటీ బోల్డు బోల్డు బాగుంది! మరేమో అంత బాగుందా... అయినా సరే ఎందుకో ఎవరివైపూ చూడకుండా మధ్యనున్న టేబిల్‌వైపే చూస్తూ కూర్చొంది. అప్పుడప్పుడు కొంచం కొంచం బాబాయివైపు చూస్తోంది. అంతే. కాని బాబాయి మాత్రం నాలాగే అలా ఆ ఆంటీవైపే చూస్తూ కూర్చొన్నాడు.

నాన్నగారూ, అమ్మా, నాయనమ్మ, తాతయ్యా అందరూ ఏంటేంటో అడిగేస్తున్నారు ఆ ఆంటిని.

ఆ ఆంటీయేమో మెల్లగా జవాబులు చెప్తోంది.

"ఒకపాట పాడుతల్లీ" అంది నాయనమ్మ.

నేను రోజూ రేడియోలో పాటలు వింటూ ఉంటానుగా! అంత బాగా పాడింది. ఊహూ ఇంకా బోల్డుబాగా పాడింది.

కొంచెంసేపయ్యాక ఆ ఆంటీ లోపలికెళ్ళిపోయింది.

"నువ్వూ లోపలికెళ్ళి ఆ ఆంటీతో మాట్లాడు" అన్నాడు నా పక్కనే కూర్చున్న బాబాయి నా చెవిలో గుసగుసగా.

నాకు భలే సరదా వేసింది.

అసలు నా అంతట నేనే ఆంటీ వెనకే లోపలికెళ్దామనుకొన్నాను. కాని అమ్మ కోప్పడుతుందేమోనని భయమేసింది. మరి బాబాయి వెళ్ళమన్నాడుగా. అందుకే ఎంచక్కా లోపలి కెళ్ళాను.

అక్కడ మంచంమీద తన పక్కనే కూర్చోపెట్టుకొంది ఆ ఆంటీ.

"నీ పేరేంటి పాపా?"

నన్ను బోల్డుమంది పెద్దవాళ్ళు ఈ ప్రశ్న అడిగారా? ఈ ఆంటీ అడిగినంత ముద్దుగా ఎవళ్ళూ అడగలేదు.

"సుధ ... మరేమో ... ఇంట్లోఅందరూ చిట్టీ అని పిలుస్తారు."

"స్వీట్ గర్ల్! ఏ క్లాసు చదువుతున్నావ్?"

"ఒకటో క్లాసు ఆంటీ...మొన్న క్లాసులో సెకండ్ రాంకు వచ్చాను తెలుసా! మరేమో ఈసారి ఫస్టొస్తే నాన్న మంచి గౌను కొంటానన్నారు తెలుసా?"

"మరి బాగా చదువుతున్నావా?"

"ఓ ..."

ఆ ఆంటీ నన్ను ఒళ్ళో కూర్చోపెట్టేసుకొని గట్టిగా ముద్దు పెట్టేసుకొంది. ఎంత బాగుందో ఆ ముద్దు!

మా ఊళ్ళోకూడా ఇలాంటి ఆంటీలు చాలా మంది ఉన్నారు. ఎవ్వరూ నన్నిలా ముద్దు చెయ్యలేదు.

ఓసారి బాబాయి నడిగాను. "బాబాయ్... మరీ పక్కింటి రాధ ఆంటీ... ఎదురింటి సుందరి ఆంటీ... వీళ్ళంతా ఎప్పుడూ నాతో సరిగ్గా మాట్లాడరేం? నన్ను ముద్దు చెయ్యరేం?"

"అందంగా ఉన్నామని వాళ్ళకి గర్వంలే!" అన్నాడు బాబాయి. ఏమిటో... నాకేం అర్థం కాలేదు.

మరి ఈ ఆంటీకూడా అందంగా ఉందిగా?

"పాపా మరి ఇందాక ఒక్కటే బిస్కట్టు తిన్నావుగా ఇంకా ఇవ్వనా?"

ఒక్కొక్కసారి అమ్మ ఎంతో ప్రేమగా అడుగుతూ ఉంటుందే! అలాగే అడిగింది. మ్మా నాన్నా అక్కడ లేరుగా! అందుకే యంలేకుండా కావాలనేశాను.

ఆ ఆంటీ బోల్డు బిస్కెట్లు తెచ్చి చ్చింది. అవి తింటూ కూర్చొన్నాను.

అంతవరకూ ముందుగదిలో పెద్దవాళ్ళం ిరూ ఏమిటేమిటో మెల్లిగా మాట్లాడేసు ంటున్నారు కదా! ఎందుకో ఒక్కసారి గట్టిగా మాట్లాడుకోడం మొదలెట్టారు.

ఏమయింది చెప్మా అనుకొని నేనూ ఆ దిలోకెళ్ళాను.

"ఇరవై వేలకి తూగలేమండీ..అమ్మాయిని చూశారుగా?... పని పాటలు చక్కగా చేస్తుంది. ంగీతం మీరే విన్నారు... దయచేసి సరిపెట్టు ోండి నా జీతంలో పైసా పైసా కూడబెట్టి ంత చెయ్యగలిగాను... పెద్దవాళ్ళు మీరే అలా నేస్తే ఎలా చెప్పండి?"

కళ్ళజోడు పెట్టుకొన్న తాతగారు తాతయ్య వైపు తిరిగి జాలిగా అడుగుతున్నారు.

"ఏమిటో ఈ పెద్దవాళ్లు! వీళ్ళ మాటలు ఒక్కటీ అర్థంకావు కదా!"

"అలా అనేస్తే ఎలా చెప్పండి... వ్యహారాల దగ్గిర నాకసలే మొహమాటం జాస్తి... అయినా సరే మిమ్మల్ని చూడగానే ఏదో చనువు పుట్టి... మీ మంచితనం చూసి అడగడానికి ధైర్యం చేసేశాను... కాదన్న నమ్మకమూ నాకుంది" తాతయ్య ఆ కళ్లజోడు తాతగారి వైపు తిరిగి అన్నాడు.

"రాజమండ్రి వాళ్లు ముప్పైవేలన్నారు... అనకాపల్లి వాళ్లు పాతిక వేలన్నారు. అమ్మాయి బాగుంటుంది ... సాంప్రదాయం మంచిదని వచ్చాం..." నాయినమ్మ అంది.

"కాదనకండి మరి. మీరు పదివేలన్నారు ...పోనీ మరో ఐదువేలు ... అబ్బాయి చదువుకి చేసిన అప్పకి వడ్డీ ఇంకా కడుతూనే ఉన్నాం" అన్నాడు తాతయ్య.

ఏమిటోగోల! ఒక్కముక్క అర్థంకాలేదు. ఎంచక్కా ఆంటీ దగ్గరకే వెళ్లి కూర్చొంటాను. చక్కా కబుర్లు చెపుతోంది. కాని ఎందుకో మరి ఆ ఆంటీ ఇందాకట్లా సరదాగా మాట్లాడలేదు. ఎటో చూస్తూ కూర్చొంది.

"చిట్టీ దామ్మా వెళ్దాం" ఆంటీకి టాటా చెప్పేసి అమ్మావాళ్ల దగ్గర కొచ్చేశాను.

మళ్లా రైలెక్కేశాం.

వస్తున్నప్పుడు కిటికీపక్కనే నన్ను కూర్చో పెట్టుకొని బోల్డుకబుర్లు చెప్పాడా...ఇప్పుడేమో అసలు మాట్లాడకుండా కిటికీలోంచి బయటకు చూస్తూ కూర్చొన్నాడు బాబాయి.

మరి నేను వచ్చేసేముందు పెళ్ళికూతు రాంటీ కూడా ఇలాగే కూర్చొని ఉందే?

# ఏమిటో ఈ పెద్దవాళ్లు

ఎందుకు చెప్మా?

ఆ తెలిసింది... మా తతయ్యా... ఆ కళ్ళజోడు తాతగారూ, నాయినమ్మా అందరూ కలిసి పదివేలు... ఇరవైవేలు అంటూ ఏంటేటో మాట్లాడేసుకొన్నారుగా? అప్పట్నించే వీళ్ళిద్దరూ ఇలా ఉన్నారు. మెల్లిగా వెళ్ళి బాబాయి ఒళ్ళో కూర్చొన్నాను.

"బాబాయ్... బాబాయ్ ఇందాకా వాళ్ళింట్లో మన తాతగారూ, వాళ్ళ తాతగారూ, నాయినమ్మా... అందరూ కలిసి పదివేలు, ఇరవైవేలు అని మాట్లాడేసుకొన్నారు కదా? ఏమిటి బాబాయ్ అవి?"

"అవా? అవి రూపాయలు!" అన్నాడు బాబాయి కిటికీలోంచి బయటకు చూస్తూనే.

"అయ్యబాబోయ్! పదివేల రూపాయలే? దేనికి బాబాయ్ అన్ని రూపాయలు?"

"దాన్ని కట్నం అంటారమ్మా."

"అంటే ఏమిటి బాబాయ్?"

"నువ్వెప్పుడూ అమ్మతో కలిసి కూరల దుకాణానికి వెళ్ళలేదూ?"

"బోల్డుసార్లు వెళ్ళానుగా!"

"మరేమో అప్పుడు కూరలవాడు రెండు రూపాయలు కిలో అంటాడు. అమ్మేమో రూపాయికిస్తావా? అంటుంది."

"అవునవును."

"అటువంటిదే కట్నం కూడానూ" బాబాయి కోపంగా అన్నాడు.

మొదట నాకేం అర్థం కాలేదు. తర్వాత కిటికీ పక్కన కూర్చొని చాలాసేపు ఆలోచించేశాను.

ఇంటికి కూరలు తెచ్చుకొంటే అమ్మ కూరలవాడికి పది రూపాయలిస్తుంది... నాకోసం బొమ్మని కొని తెచ్చినప్పుడు షాపువాడికి ఇరవై రూపాయలిచ్చింది. బర్త్‌డేకి నాకు గౌను కొని ఇంటికి తెచ్చినప్పుడు యాభైయ్యో, వందో, మూడువందలో ఇచ్చింది. మరిప్పుడు ఆ ఆంటీని వాళ్ళింటినుండి మా ఇంటికి తెచ్చేసుకొంటున్నాం కదా! మరి ఆ ఆంటీవాళ్ళ అమ్మకీ నాన్నకీ డబ్బులివ్వొద్దూ? ఎంతో...ఎంతో...అందంగా ఉంది. బోల్డుబాగా పాడింది. ఎంతో చక్కా కబుర్లు చెప్పింది. అమ్మలాగే బోల్డు ముద్దు చేసింది. మరి అంత మంచి ఆంటీని తెచ్చేసు కొంటుంటే వాళ్ళకి బోల్డు ... బోల్డు ... డబ్బు లియ్యొద్దూ?

ఇరవైవేల రూపాయలంటే బోల్డు డబ్బు అనుకో ... రెండు బస్తాల బిస్కెట్లు వస్తాయి. నాలుగు డబ్బాల చాక్లెట్లు వస్తాయి ... పదిహేనో నలభైయ్యో మంచి గౌన్లొస్తాయి.

అయినా అంతమంచి ఆంటీ వస్తున్నప్పుడు ఇవన్నీ ఎందుకూ? ఇరవై వేలేంటి ... ఆ ఆంటీ గురించి లక్షరూపాయలిచ్చేయొచ్చు కోటి రూపాయలిచ్చేయొచ్చు ...

ఆంటీని తెచ్చుకోడానికి పాపం తాతయ్య దగ్గిరా, నాయనమ్మ దగ్గరా అన్ని డబ్బులు లేవేమో!

కూరలకి డబ్బులు సరిపోనప్పుడు అమ్మ బేరం చేస్తుందే ... అందుకే ఆలా బేరం చేశారేమో!

మరి ఆ ఆంటీని మా ఇంటికి తెచ్చుకోకపోతే ఎలా?

నాకూ, బాబాయికీ బోల్డు ఏడుపొస్తుంది కదా!

మళ్ళా చాలాసేపు ఆలోచించేశాను.

ఆ ... అయిడియా వచ్చింది.

గబగబా నాయినమ్మా, తాతగారూ కూర్చొన్న సీటు దగ్గరకెళ్ళాను.

"నాన్నమ్మా ... ఇందాక నిన్నూ, తాతయ్యనూ చూస్తుంటే నాకెంత జాలేసిందో తెలుసా! పాపం ఆ పెళ్ళికూతురు ఆంటీని మనింటికి తెచ్చేసుకోవాలనీ మీకుందికదా. కాని మీ దగ్గర డబ్బు సరిపోలేదు కదా! అందుకే అంతసేపు బేరం చేశారు కదా?"

ఏమిటో ఈ పెద్దవాళ్ళు! నేను అంటున్న దేమిటో అర్థం కానట్లు అలా నా వైపు చూస్తూ ఉండిపోయారు. వీళ్ళు మాత్రం మళ్ళీ అన్ని మాటలూ అర్థం కాకుండానే మాట్లాడతారు!

అందుకే మళ్ళా బాగా అర్థమయ్యేటట్లు చెప్పాను.

"అదికాదు తాతయ్యా... ఆ ఆంటీని తెచ్చుకోవాలంటే మనం బోల్డు డబ్బు ఇయ్యాలి కదా! మరంత మంచి ఆంటీని తెచ్చుకొంటు న్నప్పుడు ఇయ్యొద్దూ? మరి మీకు డబ్బు చాల్లేదు కదా? అందుకే నా కిడ్డీ బాంకులో దాచుకొన్న ఇరవై రూపాయలూ తీసేస్కోండి... ఇంకా డబ్బులు తక్కువైతే మళ్ళా ఇస్తాన్లే... మరే... ఆ డబ్బుతో... బోల్డన్ని బొమ్మలూ, గౌన్లూ వస్తాయనుకో... అయినా అంత మంచి ఆంటీ వస్తున్నప్పుడు ఆ వెధవ గౌన్లూ, బొమ్మలూ అక్కర్లేదు లెద్దూ... మరి ఆ డబ్బు తీసుకొంటారా?"

అంతే! నాయనమ్మా, తాతగారూ ఒకరి మొహం ఒకరు చూసుకొంటూ ఉండిపోయారు. అమ్మేమో నాన్నవైపు చూసి నవ్వింది... నాన్న ఎందుకోమరి గబుక్కున ఇంకోవైపుకి మొహం తిప్పేసుకొన్నాడు. బాబాయేమో గబుక్కున నన్ను ఒళ్ళో కూర్చోపెట్టేసుకొన్నాడు... గబుక్కున నా బుగ్గమీద ముద్దు పెట్టేసుకొన్నాడు. మళ్ళా అమ్మవైపు చూసేసరికి ఎందుకో అమ్మ కళ్ళలో నీళ్ళున్నాయి.

నేనడిగిన దానికి మాత్రం ఒక్కరూ జవాబు చెప్పలేదు.

"ఏమిటో ఈ పెద్దవాళ్ళు!?" 



శ్రీమతి జి. భవానీకృష్ణమూర్తి

సీరియల్

# అనురాగ తరంగాలు

ఒక్కొక్క విభాగాన్ని ఒక్కొక్కరికి అప్పగించి తనమీద ఉన్న భారాన్ని కాస్త తగ్గించుకుంది లీల.

వెంకటలక్ష్మికి టైలరింగు సెక్షను అప్పగించింది. కామాక్షి ఎంబ్రాయిడరీ, వైరు బేగులు అల్లడం మొదలైన వాటి గురించి చూస్తూంటే; ప్రసన్న అరటితోటల పెంపకం గురించి శ్రద్ధవహిస్తోంది. ఆండాళ్లు అప్పడాలు, వడియాలు, ఊరగాయలు, జామ్‌లు, సిరప్‌లు తయారుచేసే సెక్షనును అజమాయిషీచేస్తోంది. బిడ్డతల్లి అయిన రేణు రోజూ రావడానికి వీలు కాకపోవడంతో స్కూలుని జగదాంబకి అప్పగించింది. మార్కెటింగ్ సౌకర్యాలు చూసుకోడానికి రఘు ఒకతన్ని నియమించాడు.

అందరూ తమతమ బాధ్యతల్ని సక్రమంగా నిర్వహిస్తున్నారా లేదా అనేది తనిఖీ చేస్తూ ఎకౌంట్సు ఎప్పటి కప్పుడు సరిగా ఉన్నాయోలేదో చూసుకోవడం మాత్రమే లీల పని. పనిలేకపోయినా ఆ ఆవరణలో తిరుగుతూంటే ఎంతో హాయిగా టైము ఇట్టే గడిచి పోతున్నట్లు అనిపిస్తుంది లీలకి.

అందరూ ఆమెనో దేవతలా ఆరాధిస్తుంటారు. రోజుకి ఒకసారి అయినా స్కూలుకి, నర్సింగ్‌హోమ్‌కి వెళ్ళి అక్కడి కార్యకలాపాల్ని పర్యవేక్షిస్తూ ఉంటుంది. ప్రముఖ రచయిత్రిగా ఎంతో పేరునీ, డబ్బునీకూడా సంపాదించుకుంది.

అయినా మునుపటిలా ఉత్సాహంగా లేకపోవడం, మందకొడిగా, నీరసంగా ఉండడం

**(గత పంచిక తరువాయి)**

గమనించాయి సునిశితమైన కళ్ళు. కళ్ళ క్రింద ఏర్పడిన నల్లటి చారలు, పాలిపోయినట్లున్న కళ్ళు అతనిని అనుమానింపజేశాయి.

"ఒంట్లో బాగుండడం లేదా లీలా ?" అని ఒకటి, రెండుసార్లు అడిగితే, "నీ డాక్టరు బుద్ధి పోనిచ్చుకున్నావుకాదు చివరికి నా విషయంలో కూడా" అంటూ నవ్వింది.

ఆ రోజు అనాధశరణాలయంలోని తన పని ముగించుకుని ఒకసారి ఆ ఆవరణ అంతా తిరిగి వచ్చి, నర్సింగ్‌హోమ్‌లోకి వెళ్ళి రఘుతో కాస్సేపు మాట్లాడి స్కూలుకి వెళ్ళింది. జగదాంబతో అవి ఇవి మాట్లాడి బయటికి వస్తూ తల తిరిగినట్లు అయి నిలబడలేక దభీమని పడిపోయింది గుమ్మానికి అడ్డంగా. తల తలుపుకి ఠపీమని కొట్టుకుంది.

జగదాంబ, మరిద్దరు టీచర్లు గబగబా దగ్గరికి వచ్చి లేవదీసి బల్లమీద పడుకోబెట్టి రఘుకి కబురు చేశారు. ఆ కబురు వినగానే గబగబా పరుగెత్తుకుంటూ వచ్చాడు రఘు. పరీక్ష చేసిన అతని కనుబొమలు ముడిపడ్డాయి. స్ట్రెచర్ తెప్పించి ఆమెను నర్సింగ్‌హోమ్‌కి తీసికెళ్ళాడు. ఇంజక్షను ఇచ్చాడు. ముఖం మీద కొద్దిగా నీళ్ళు చిలకరించాడు.

కాస్సేపటికి కళ్ళు తెరిచింది లీల.

నీరసంగా నవ్వుతూ "నీ బుద్ధి పోనిచ్చుకున్నావు కాదు రఘూ. చివరికి పేషెంట్‌గా నన్ను బెడ్ ఎక్కించేశావు" అంది.

"ప్లీజ్ లీలా ! ఇంత వరకూ నువ్వు చెప్పింది నేను విన్నాను. ఇక ముందు నేను చెప్తే నువ్వు వినాలి. విని తీరాలి". అంటూ ఆమె బ్లడ్, యూరిన్ తీసుకుని పరీక్ష చేశాడు. ఎక్స్‌రే యూనిట్‌లోకి తీసికెళ్ళి నాలుగైదు ఎక్సరేలు తీశాడు. అతని ముఖంలోని ఆందోళనని గమనించి తనలో ఏదో పెద్ద జబ్బు అంతర్లీనమై ఉందని గ్రహించింది లీల.

"ఇదంతా ఏమిటి రఘూ ? "

"లీలా ప్లీజ్, నన్నేమీ అడక్కు. ఏమిటి, ఎందుకు అని అడక్కుండా నేనేంచెప్పినా చేస్తానని నామీద ప్రమాణం చెయ్యి."

"అదేమిటి రఘూ ! ఏమిటో, ఎందుకో చెప్పకుండా ఎలా చెయ్యమంటావ్ ?"

"చెయ్యగలవు లీలా. నాకోసం పెళ్ళి మానుకున్నదానివి ఈ మాత్రం చెయ్యలేవా లీలా ?" అతని కళ్ళల్లోని నీళ్ళు చూసి చటుక్కున చెయ్యిచాపి అతని తల మీద పెట్టి "రఘూ ! నువ్వు ఏంచెప్పినా, ఏంచెయ్యమన్నా చేస్తాను. ఏమిటి, ఎందుకు అని అస్సలు అడగను. సరేనా ?" అనేసింది గబగబా.

"థాంక్యూ లీలా, థాంక్యూ వెరీమచ్." కళ్ళు తుడిచేసుకుని "సాయంకాలందాకా కదలకుండా ఈ బెడ్‌మీదే పడుకుని రెస్ట్ తీసుకో, నా పని అయ్యాక నేను స్కూటరుమీద ఇంటికి తీసికెడతాను" అన్నాడు.

"అలాగేలే. అసలు విషయం ఏమిటి ?"

"అదిగో, ఇప్పుడే ప్రామిస్ చేశావు ఎందుకు, ఏమిటి అనే పదాలు నీ డిక్షనరీలో నుంచి తుడిచేస్తానని, అప్పుడే మరచిపోయావు" చిరుకోపం ప్రదర్శించాడు.

"నిజమే రఘూ ! నాకేమైందో నాకు తెలియాలి కదా ?"

"అవసరంలేదు. అయినా ఇప్పుడేకదా ఎక్స్‌రేలు తీశాను. వాటి రిపోర్టునుబట్టి కేసు నిర్ధారణ అవుతుంది."

"రఘూ ! ఏదైనా దాచకుండా నాకు చెప్పాలి. ప్లీజ్, చెప్తావు కదూ ?" అతను వెళ్ళిపోబోతూంటే చెయ్యిపట్టి ఆపి బతిమాలుతున్నట్లుగా అంది.

**జరిగిన కథ — 6 :** వీరరాఘవులు, విశ్వనాథం ఇద్దరూ బాల్యస్నేహితులు. వీరరాఘవులు వ్యాపార నిమిత్తం విజయవాడలో స్థిరపడతాడు. విశ్వనాథం వూర్లోనే వ్యవసాయం చేసుకొంటుంటాడు. పెద్ద కామందు. వీరరాఘవులు పెద్దకొడుకు రఘు అమెరికా వెళ్ళి సర్జరీలో అనుభవాన్ని సంపాయించుకొని తిరిగివస్తాడు. విశ్వనాథం ఏకైక కుమార్తె లీలని అతనికిచ్చి చేయాలని ఇరువురూ నిర్ణయించుకొంటారు. లీల కూడా అతన్నే ప్రేమిస్తుంది. కానీ ఎవరూ ఊహించని విధంగా రఘు లీలని చెల్లెలిగా భావిస్తున్నానని చెప్తాడు. తన కిప్పుడే పెళ్ళి చేసుకోవాలని లేదని మంచి సంబంధం చూస్తానన్న రఘుతో చెప్తుంది లీల. రఘుకి తన చిన్ననాటి స్నేహితురాలు రేణుక తారసపడుతుంది. రఘు తన చాకచక్యంతో వెంకటేశాన్ని మంచి మనిషిగా తీర్చిదిద్దుతాడు. రఘు, రేణుక తన చిన్ననాటి తలపులు నెమరువేసుకొంటారు. తనకు వాగ్దత్త అయిన రేణుని ఒకరికి అర్పించలేను అన్న వెంకటేశానికి ఆమె జోలికి వెళ్ళనని మాట ఇస్తాడు రఘు. కానీ లీల రఘు, రేణులని ఒకటిగా చేస్తుంది. ఓ అనాధశరణాలయాన్ని నడపాలని నిశ్చయించుకొంటుంది లీల. అనుకున్న ప్రకారంగానే అనాధ శరణాలయాన్ని నిర్మించి ఎంతోమంది అభాగినులను ఆదుకొని వారికి జీవనోపాధి చూపెడుతుంది లీల.

చెప్తాను. కాని, ఆ విషయం ఆంటీకి కానీ, అంకుల్‌కికానీ, చివరికి రేణూకి కానీ తెలియనివ్వనని ప్రామిస్ చెయ్యి.''

''అలాగే రఘూ! నాకు మాత్రం తెలియదా? నా కాలిలో ముల్లు గుచ్చుకున్నా విలవిల్లాడిపోతారు వాళ్ళు. అసలు నేనే ఆ మాట నీకు చెప్పాలి అనుకున్నాను.''

''సరే లీలా. రేపు ఏ విషయం చెప్తాను. అనవసరంగా ఆందోళనపడక రెస్టు తీసుకో. నాకు కొద్దిగా అర్జంటుపనుంది. అది చూసుకుని వస్తాను.''

''సరే వెళ్ళు. అన్నట్లు, అక్కడ నా రూమ్‌లో కాగితాలు, పెన్ను ఉన్నాయి. ఎవరినైనా పంపి తెప్పించిపెట్టు.''

''అలాగేలే'' అంటూ వెళ్ళిపోయాడు రఘు.

మరో పది నిముషాలకి కాగితాలు, కలం తీసుకొచ్చి ఇచ్చింది ఒక నర్సు.

ముందు రాసింది ఒకసారి చూసుకుని రాయబోయేదాన్ని ఒకసారి జ్ఞాపకం తెచ్చుకుని పూర్తిగా తను ఊహించుకున్న ప్రపంచంలోకి వెళ్ళిపోయింది, మిగిలిన విషయాలన్నిటినీ పక్కకినెట్టి.

* * *

వాతావరణం గంభీరంగా, తుఫాను తరువాత అలుముకున్న నిశ్శబ్దంలా ఉంది. విశ్వనాథంగారి నెత్తురు మరిగిపోతోంది. గుండెల్లో సెలయేర్లు పొంగుతున్న హోరు. ఆకాశం ఉరుముతున్నట్లుగా మధ్య మధ్యలో ప్రభావతమ్మగారు ముక్కు చీదుతున్న చప్పుళ్లు.

''లీలా! ఏమిటే ఇది? ఇంతవరకూ నువ్వు కోరుకున్న విధంగానే జరిపించుకున్నావు. సంఘసంస్కర్తగా, రచయిత్రిగా కూడా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నావు. ఇంకా ఆ పిహెచ్‌డి చెయ్యకపోతేనేం? ఎంత చదివినా ఇంకా మిగిలి ఉంటూనే ఉంటుంది. ఈ ప్రపంచంలోని విజ్ఞానం అంతా మనం స్వంతం చేసుకోవాలనుకుంటే మరో నాలుగు జన్మలెత్తినా ఇంకా మిగిలి ఉన్నట్లే అనిపిస్తుంది. చేసుకుంటూ చేసుకుంటూ అంటూ అలా ఆశ పెట్టకపోతే అసలు పెళ్లి చేసుకోనని చెప్పెయ్యరాదూ, పెదనాన్నగారికి, పెద్దమ్మకీను, నిన్ను వదిలి ఉండలేకేకదే నువ్వు కాలేజీలో చేరతానని పట్టుబడితే పట్నం వెళ్ళి రావడానికి వీలుగా కారు కొన్నారు పెదనాన్నగారు. వారి బాధని నువ్వెందుకు అర్థం చేసుకోవూ? హైదరాబాదు అంటే దగ్గరా? దాపా? నిన్ను అంతదూరం పంపించి వాళ్ళు స్థిమితంగా ఉండగలరా? చిన్నప్పటి నుంచీ ఒకే ప్రాణంలా మసిలాము. నేను మాత్రం నిన్ను వదిలిపెట్టి ఉండగలనా? అయినా ఇక్కడ ఇన్ని వ్యాపకాలు నీ చుట్టూ అల్లుకుని ఉన్నాయి. తెంచుకుని వెళ్ళిపోతే అవన్నీ వాడి ఎండిపోతాయి. నువ్వు ఇన్నాళ్ళుగా పడిన శ్రమఅంతా వృథా అవుతుంది.''

''పిచ్చిదానా! వెనకటికి ఓ ముసలమ్మ ఊరి మీద కోపం వచ్చి కోడి, కుంపటి లేకపోతే మను ఎలా తెల్లారుతుందో చూస్తాననే అందర్నీ బెదిరించి తన కోడీ కుంపటితో ఊరు విడిచివెళ్ళిపోయిందిట. అంత మాత్రం చేత తెల్లవారడం ఆగిపోతుందా? సూర్యోదయం ఆగిపోతుందా? ఇదీ అంతేనే. నేను ఇక్కడ లేనంత మాత్రాన ఏదీ ఆగదు. నువ్వులేవూ? రఘు, నాన్నగారూ లేరూ! ఎవరి పనిని వాళ్ళు సక్రమంగా చేస్తున్నారో లేదో చెక్ చెయ్యడమే కదా? నేను లేకపోతే నువ్వు ఆ పని చెయ్యలేవా?'' సూటిగా అడిగేసరికి తడబడింది రేణుక.

''చెయ్యననీ చెయ్యలేననీ కాదే. నువ్వు అంతదూరం వెళ్ళడం ఇష్టంలేక అంటున్నాను.''

నవ్వింది లీల. ''నాకు తెలుసే, అయినా తప్పదు. రేపు నేను అత్తవారింటికి వెడితే అలా అనుకుంటావా?''

''అదీ, ఇదీ ఒకటేనా?'' ఈసారి ఆ మాట ప్రభావతమ్మ నోటినుంచి వచ్చింది.

''ఒకటైనా, రెండయినా నేను ఈ ఊరు విడిచి వెళ్ళక తప్పదుగా. నా భర్త ఉద్యోగరీత్యా హైదరాబాదులో ఉంటున్నాడని, నా భర్త కోసం నేనీ ఊరునీ, మిమ్మల్నీ విడిచి హైదరాబాదు వెడుతున్నాననీ అనుకో. అప్పుడు నీకు బాధగా అనిపించదు.''

''అంతేగానీ, నీ పట్టుదల మాత్రం విడిచిపెట్టనంటావు. పరే, నీ ఇష్టం వచ్చినట్లు అఘోరించు. మీ అమ్మా నాన్నా రాతిబొమ్మలు అనుకుంటున్నావు కాబోలు. అలాగే అనుకోమ్మా.



# అనురాగ తరంగాలు

మేము చచ్చాకగానీ, మా విలువ అర్థంకాదు నీకు'' కోపంగా అరిచారు విశ్వనాథంగారు.

ఎప్పుడూ ఎవరిమీదా రానంత కోపం వస్తోంది ఆయనకి లీలమీద.

నిర్లిప్తంగా నవ్వి ''ఎవరు ముందో, ఎవరు వెనకో ఎలా తెలుస్తుంది నాన్నగారూ. ఎవరి టైము వచ్చినప్పుడు వాళ్ళు ఈ లోకం నుంచి నిష్క్రమించవలసినదే. తప్పదు. ఒకరి కోసం ఒకరు ఆగలేరు. ఆగకూడదు కూడాను'' అంటూండగానే అంతవరకూ మౌనంగా ఉన్న రఘు చటుక్కున ఒక్కడుగు ముందునేసి లీల నోరుమూసి ''ఛ! ఏమిటమ్మా ఆ మాటలు. అంకుల్ ముందు అలా అంటారు గానీ, నీ మాటకి వ్యతిరేకంగా ఎప్పుడైనా, ఏపని అయినా చేశారా? అలాగే వెడుదువుగానీలేగానీ అలా మాట్లాడకు''బొంగురుపోయిన గొంతుతో.

''రఘూ! ఏమిట్రా, దానికి నచ్చచెప్పాల్సిందిపోయి, సమర్థిస్తున్నావు ?'' తన కోపాన్ని రఘు మీదికి మళ్లించారు విశ్వనాథంగారు.

''అవును అంకుల్, నేను లీలనే సమర్థిస్తాను. నాన్నగారు మీలాగే భావించి ఉంటే నేను ఫారిన్ వెళ్లగలిగేవాడినా? ఈ ఊళ్లో ఉంటూ ఇంతటి పేరు ప్రఖ్యాతులు సంపాదించుకోగలిగేవాడినా? ఆసక్తి ఉన్నవారిని ఆపకూడదు అంకుల్.''

''బాగుంది బాబూ, నువ్వు మగపిల్లవాడివి. అందుకే నిశ్చింతగా పంపించారు మీ నాన్న విదేశాలకి, ఇక్కడ మేమున్నాము నిన్ను ఆదరిస్తాము అన్న నమ్మకంతో నిశ్చింతగా ఉన్నారు. కానీ అది ఆడపిల్ల, ఒంటరిగా ఉంటూ చదివి ఎవరిని ఉద్ధరించాలి బాబూ ?'' గద్గద స్వరంతో అంది ప్రభావతమ్మ.

''ఎంతో శ్రమపడి, నిద్రాహారాలు మానేసి ఇన్ని కొత్త కొత్త సాధనాలు, పరికరాలు కనిపెట్టిన శాస్త్రజ్ఞులు నీలా భావించి ఉంటే మనం ఇంత సుఖంగా ఉండగలిగేవాళ్ళమా? మన దేశం ఇంత అభివృద్ధిని సాధించగలిగేదా అంటే ?''

''దాని పేరు చరిత్ర పుటల్లోకి ఎక్కి ఆ శాస్త్రజ్ఞుల్లా చిరస్థాయిగా నిలచిపోవాలనే అంత పెద్దకోరిక మాకు లేదు రఘూ. కూతురి పెళ్ళి చేసి అది భర్తతో, పిల్లా పాపలతో సుఖంగా ఉంటే చూసి ఆనందించాలనుకునే సామాన్య తల్లిదండ్రులం మేము''! అన్నారు విశ్వనాథం గారు.

''అలాగే అంకుల్. ఈ సారికి లీల ఇష్ట ప్రకారంగా జరిగి పోనివ్వండి. రీసెర్చి పూర్తవగానే బలవంతంగానైనాసరే ఆమె మెడలు వంచి పెళ్ళి జరిపించే పూచీనాది. సరేనా అంకుల్ ''

''బలవంతంగా మెడలు వంచాల్సినంత అవసరం రాదులే. నా అంతట నేనే తలవంచి నాన్న ఎవరిచేత తాళి కట్టించుకోమంటే అతని చేతనే కట్టించుకుంటాను.'' నమ్మకంగా చెప్పింది లీల.

''దానికి మీ సపోర్టు ఏమిటి మధ్యలో '' రఘు మీద గయ్ మంది రేణుక.

''నేను కూడా ఇంకా చదువుకోవాలనే కోరిక ఉన్న పిచ్చివాడిని కనుక'' తాపీగా అన్నాడు,

''అయితే మీరు కూడా బయలుదేరండి.''

''బయలుదేరేవాడినేగానీ, నువ్వు బాధపడతావని ఆగిపోతున్నాను.'' అన్నాడు నవ్వుతూ.

''ఏమిటే రేణూ, నేను వెడతానంటూంటే మీ ఆయనమీద ఎగురుతావు ? ఊ! వెరీ బేడ్ ! నీకు తెలుసు. అతను సపోర్టు చెయ్యకపోయినా నేను ఆగను. ఆ విషయం అతనికీ తెలుసు. అందుకే తెలివిగా నన్ను సమర్థిస్తున్నాడు. నీకు బుర్రుందిగానీ బొత్తిగా ఆలోచన లేదే.''

''అదికాదే లీలా అసలు...'' రేణుక మాట పూర్తికాకముందే నోరు గట్టిగా మూసి ''అనవసరంగా ఎక్సైట్ అవకు. నేను వెళ్ళేది ఖాయం అయినా, నేనేదో అండమాన్స్‌కో




ఐరోపాకో వెడుతున్నట్లు ఈ గందరగోళం ఏమిటి ?'' అంది కొంచెం విసుగుదలను కనబరుస్తూ.

''నీ ఇష్టం వచ్చినట్లు అఘోరించు'' విశ్వనాథంగారు విసురుగా బయటికి వెళ్ళిపోయారు.

నిస్త్రాణగా కుర్చీలో కూలబడిన లీలని చూసి ''రేణూ! కాస్త గ్లూకోజ్ నీళ్ళలో కలిపి తెచ్చి లీలకివ్వు'' అన్నాడు రఘు, రేణు చేతుల్లోని బాబుని అందుకుంటూ.

''ఈ నాలుగు మాటలు మాట్లాడినందుకే ఇలా తోటకూరకాడలా వాలిపోయిన పిల్ల పొరుగూరు వెళ్ళి చదువు వెలగబెడుతుందట'' సాగదీసుకుంటూ అంది ప్రభావతమ్మ.

కళ్ళు మూసుకునే నిర్లిప్తంగా నవ్వింది లీల. రేణుక ఇచ్చిన గ్లూకోజ్ వాటర్ తాగేసి పెరట్లోకి వెళ్ళి. గ్లాసు కడిగేసి వంటింట్లో పెట్టేసి వెళ్ళి తన మంచంమీద పడుకుని నీళ్ళు నిండిన కళ్ళని పైటతో ఒత్తుకుని కళ్ళు మూసుకుంది లీల.

*  *  *

ఆ మరునాడు ఉదయం ఏడయినా లేవలేదు లీల. రెండుసార్లు ఆమె గదిలోకివెళ్ళి చూసి, నిద్రపోతున్నదాన్ని లేపడానికి మనస్కరించక లోపలికి వెళ్ళి ప్రభావతమ్మని తప్పుకోమని కాఫీ ఫలహారాలు తయారుచెయ్యడంలో నిమగ్నమైంది రేణుక.

ఒక్కరాత్రిలోనే ఎన్నో సంవత్సరాల వయస్సు పెరిగిపోయినట్లు కృంగిపోయిన ఆ దంపతుల్ని చూస్తూంటే రేణుకి కూడా లీలమీద కోపం వచ్చింది.

పెరట్లో పాలేర్లకి పన్లు పురమాయిస్తోంది ప్రభావతమ్మ. ఎంతటి పని వత్తిడిలో ఉన్నా పాలేర్లని విసుక్కుని ఎరుగని ఆవిడ ఆ రోజు విసుక్కోవడం, అకారణంగా వారిపై చిరాకు పడడం లోపలనుంచే గ్రహించింది రేణుక.

రఘు స్నానంచేసి రాగానే అతనికి టిఫెను ఇచ్చి, వెళ్ళి లీలను లేపింది. వాడిన పువ్వులా, వడలిన తోటకూర కాడలా ఉన్న లీలని చూడగానే ఆమెమీద ఉన్న కోపం చటుక్కున మాయమైపోయింది.

''ఏమే, ఒంట్లో బాగా లేదా ?'' ఆదుర్దాగా నుదుటిమీద, చెంపలమీద చెయ్యేసి రాస్తూ అడిగింది.

ఆ చేతిని గట్టిగా నొక్కిపట్టుకుని ''అదేం లేదు రేణూ. రాత్రి సరిగా నిద్ర పట్టలేదు. కొద్దిగా తలనొప్పిగా ఉంది'' అంటూ ఏదో జ్ఞాపకం వచ్చి ఆ చేతిని చటుక్కున వదిలేసింది.

అదేమీ గమనించని రేణు ''ఊ! లేచి ముఖం కడిగి స్నానం చేసిరా. టిఫెన్ తిని, కాఫీ

# ఎన్‌లైన్®

## మీ వ్యక్తిత్వాన్ని ప్రజ్వరిల్లించును



ఈ పండుగ సమయాల్లో మీ ఆనందోత్సాహాలను ఎన్ లైన్‌తో పంచుకొనండి. ఎన్ లైన్ బట్టలు, సమృద్ధిగా పండిన పంటల్లా మీకు హర్షోల్లాసాన్ని ఇచ్చును. ఎన్ లైన్ శ్రేణిలో పాలియెస్టర్, పాలియెస్టర్ మిశ్రమం, కాటన్ లలో ఎన్నోరకాల చీరలు, సూటింగులు, షర్టింగులు, యూనిఫాం బట్టలు మరియు డ్రెస్ మెటీరియల్ లభించును.

**మంచి అభిరుచి. తగిన ధరలు.**

**నేషనల్ టెక్స్‌టైల్ కార్పొరేషన్**



(తమిళునాడు మరియు పాండిచెరి) లి.
భారత సర్కారపు ఒక ఉద్యోగ సంస్థ
10/64 సోమసుందరం మిల్స్ రోడు, కొయమత్తూరు-641009

MCA/NTC/92/TEL

---

ఇండెంటింగ్ ఏజెంట్లు : ఆంధ్ర ప్రదేశ్: బాలాజీ టెక్స్‌టైల్ ఏజెన్సీస్, 3-4-394, టొబ్యాకో బజారు, సికింద్రాబాద్-500 003 (ఏ. పి.). సంగం టెక్స్‌టైల్స్ ఏజెన్సీస్, 230, మొదటి అంతస్థు, డి. బి. రోడ్డు, కొయమత్తూరు-641 002. ఆర్. పి. డిస్ట్రిబ్యూటర్స్, 3-4-394, టొబ్యాకో బజారు, సికింద్రాబాద్-500 003 (ఏ.పి.).

తాగి పడుకుందువుగాని'' అంది చెదిరిన జుట్టు సర్దుతూ.

''అలాగేలే, నువ్వు పద వస్తున్నా'' అంది గానీ, కదల్లేదు లీల.

రఘు పిలవడంతో బయటికి వెడుతూ ''మళ్ళీ నిద్ర పోతావేమో ? తొందరగా లే'' హెచ్చరించింది.

ఆమె లేచి స్నానంచేసి కాఫీ ఫలహారాలు ముగించేసరికి, రఘు ఆస్పత్రికి వెళ్ళడానికి తయారై కొడుకుని ఎత్తుకుని ఆమె గదిలోకి వచ్చాడు.

''లీలా ! అక్కడావనుంది. ఇక్కడ ఈ ఏముంది అంటూ కదిలి హైరానపడకు. ఆ పన్లు అన్నీ నేను చూసుకుంటానులే. నువ్వు హాయిగా రెస్టు తీసుకో. మా ఫ్రెండు దగ్గర్నుంచి లెటరుకోసం చూస్తున్నాను. అది రాగానే మన ప్రయాణానికి ఏర్పాట్లు చేస్తాను.''

''అలాగే రఘూ.'' దీర్ఘంగా నిట్టూర్చింది లీల.

''అలా నిరుత్సాహంగా ఉండకూడదు లీలా. మనసుని ప్రశాంతంగా ఉంచుకోడానికి ప్రయత్నించు. ఎక్కువగా ఆలోచించకు'' అంటూ బాబుని ఆమె ఒడిలో కూర్చోబెట్టి ''ఆంటీతో చక్కగా కబుర్లు చెప్పరా'' అంటూ బాబు బుగ్గలు నిమిరాడు.

''వద్దు రఘూ ! బాబుని నా దగ్గరకు రానివ్వద్దు'' బాబుని అతనికి అందించేసింది గభాల్న.

''లీలా !''

''అవును రఘూ ! డాక్టరువి నీకు తెలియనిది ఏం ఉంది ?''

''సరే గానీ, భవిష్యత్తుని భయంకరంగా ఊహించుకుంటూ నీ ఆరోగ్యాన్ని మరంత పాడు చేసుకోకు. తొందరలోనే నువ్వు మామూలు మనిషివి అవుతావు''

''అలాగేలే, నువ్వు వెళ్ళు.'' అంది.

అతను వెళ్ళిపోయాక పడుకోవడం విసుగ్గా అనిపించి లేచి టేబుల్‌దగ్గరకు వెళ్ళింది. కుర్చీని దగ్గరకు లాక్కుని కాగితాల్ని ముందుకి జరుపుకుని పెన్ను అందుకుంది. ఆ ఊహా ప్రపంచంలోకెళ్ళిపోతే నిద్రాహారాల సంగతిగానీ, తనచుట్టూ ఏం జరుగుతోందన్న సంగతిగానీ గమనించనంత ఏకాగ్రతతో పేజీలు పేజీలు నిండిపోతాయి.

కానీ, ఆ రోజు ఐదారుపేజీలు కూడా వ్రాయకముందే మెదడులోని ఆలోచనా తరంగాలు పటపటా తెగిపోతున్నట్లు, గజిబిజిగా అనిపించి తలను రెండు చేతులతో పట్టుకుని నిస్త్రాణగా, నిస్తేజంగా టేబులు మీదకి వాలిపోయింది. తలలోని నరాలు చిట్లిపోతున్నంతబాధ. ఆ నిస్సహాయతకి ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఊపిరిసలపని దగ్గు తెర వచ్చి ఉక్కిరిబిక్కిరి చేసిపారేసింది. గుండెను చేత్తో పట్టుకుని వెనక్కి జార్లబడింది ఆయాసపడుతూ. కళ్ళనుంచి జారిన నీటిబిందువులు వెనక్కిజారి జుట్టులో ఇంకిపోతున్నాయి.

ఆమెని భోజనానికి పిలవడానికి వచ్చిన రేణు ఆ స్థితిలో లీలను చూసి ఖేదపడింది. మెల్లగా కళ్ళనీళ్ళు తన పైటచెంగుతో వత్తి, చెమటలు తుడిచి, ఫేను ఆన్ చేసింది. మునివేళ్ళతో జుట్టుని సర్దింది. చెదిరిన పైటని సరిచేసింది. మెల్లగా కళ్ళుతెరిచి చూసింది లీల.

''మరీ ఇంత అలసట వచ్చేవరకూ రాయకపోతేనేమిటే ?''

నిర్జీవంగా నవ్వింది లీల.

''అయినా ఈమధ్య బాగా నీరసంగా ఉంటున్నావు. రాత్రీ, పగలు ఆ దగ్గొకటి నీ ప్రాణం తీస్తోంది. ఆయన్ని ఒకసారి పరీక్ష చెయ్యమనవే. మందులు శ్రద్ధగా కొన్నాళ్ళపాటు వాడితేగానీ లాభంలేదు'' అంది ఆప్యాయత నిండిన స్వరంతో.

''అలాగే రేణూ ! హైదరాబాదు వెళ్ళాక వాడతానులే.''

''సరే. తొందరగా రా అన్నం తినేసెయ్ కాసేపు పడుకుందువు గాని.''

''అలాగే నువ్వు పద'' లేచి మెల్లగా వంటింట్లోకి వెళ్ళింది. ఎప్పటిలా తల్లి ఎడ్డించలేదు. తనమీద బాగా కోపం వచ్చిందని గ్రహించింది. రేణు వడ్డిస్తూంటే నాలుగు ముద్దలు తిని; ఆ కంచం, మంచినీళ్ళు తాగిన గ్లాసు రెండుసార్లు శుభ్రంగా కడిగేసి లోపల పెట్టేసి తన గదిలోకివచ్చి రఘు కిచ్చిన మాట జ్ఞాపకం వచ్చి డ్రాయరు తాళం తీసి రెండు టాబ్లెట్లు మింగి, కూజాలోని నీళ్ళు గ్లాసులోనికి వంపుకుని తాగింది. తండ్రి పొలం నుంచి వచ్చిన సవ్వడి వినిపించినా బయటికి రాబుద్ధికాక అలాగే పడుకుండి పోయింది.

ఆమెకు తెలుసు. తల్లిదండ్రులకి తనమీద కోపం కాదని, తను పెళ్ళి పెటాకులు లేకుండా చదువు పేరుతో వారిని విడిచి వెడుతున్నానని బాధ పడుతున్నారని. వాళ్ళకేం తెలుసు. తను చదువు వెలగబెట్టడానికి కాదని, తనలోని భయంకర పిశాచిని వదలగొట్టుకోవడానికని తెలిస్తే వాళ్ళ గుండెలు బద్దలైపోతాయి. 'బతికినన్నాళ్ళు వాళ్ళదగ్గరే ఉండనీ, ఎప్పుడు ఆయుర్దాయం ముగిస్తే అప్పుడే శాశ్వతంగా వెళ్ళిపోతాను' అంటే రఘు వినడు. ముందరి కాళ్ళకి బంధం వేసినట్లు ముందుగానే చెప్పినట్టు చేస్తానని ప్రామిస్ చేయించుకున్నాడు. అతనికి ఇచ్చిన మాట తీసి అవతల పారెయ్యడం నావల్ల అయ్యేపనేనా ? ఉహూ ! అప్పుడేకాదు. కంఠంలో ప్రాణం ఉన్నంతకాలం తను అతనికి బద్ధురాలే. 'ఏది ఎలా జరిగేది ఎప్పుడు జరగాల్సింది నిర్ణయించేది నీవే భగవాన్, మేము నిమిత్త మాత్రులం మాత్రమే.' ఇక ఆలోచించడానికి కూడా ఓపికలేక, కళ్ళు మూసుకుని పడుకుండి పోయింది లీల.

**(ఇంకా ఉంది)**

(కె. బాపయ్య) విడుదలయ్యాయి. అంటే ఇంత వరకూ ఆరు హిందీ చిత్రాలు విడుదలయ్యాయి.

ఇపుడు అమితాబ్‌తో శ్రీదేవి మూడు చిత్రాలలో నాయికగా నటిస్తున్నది. ఒకటి : శ్రీ ఈశ్వర్ క్రియేషన్స్ తాతినేని రామారావు దర్శకత్వంలో నిర్మిస్తున్న కన్నడంలో సూపర్ హిట్ చిత్రం 'చక్రవ్యూహం'. రెండవది : సత్యచిత్ర— యస్. రామనాథన్ దర్శకత్వంలో రూపొందించే తాజా చిత్రం. మూడవది : పద్మాలయాఫిలింస్ కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో నిర్మించే చిత్రం.

ఇవిగాక జితేంద్రతో 'తోఫా' (కె. రాఘవేంద్రరావు), అకల్ మండ్ (రాజ్ భరత్) హిందీ పాపారాయుడు (దాసరి),



రోజా ఎంటర్ ప్రైసెస్ వారి చిత్రం ముహూర్తంరోజున దర్శకుడు రాఘవేంద్రరావుతో శ్రీదేవి, ఆమె చెల్లెలు శ్రీలత

...చున్, జయప్రద, శ్రీదేవి

...జాన్]



వి. వి శాస్త్రిగారి హిందీ మంత్రిగారి వియ్యకుడు (బాపు) ఆఫ్‌తాబ్ ప్రొడక్షన్స్ చిత్రం (యస్ ఏ చంద్రశేఖర్), రాజేష్‌ఖన్నాతో 'మక్సద్' (కె బాపయ్య) సి వి కె శాస్త్రి చిత్రం (రవిటాండన్) కమలహాసన్‌తో లక్ష్మీప్రొడక్షన్స్ చిత్రం (తాతినేని రామారావు) రాకేష్ రోషన్‌తో అతని స్వంత చిత్రం (కె విశ్వనాధ్), సన్నీ డియోల్‌తో కె రాఘవేంద్రరావు దర్శకత్వంలో విజయ మాధవి పిక్చర్స్ జూన్ 1984 నుంచి నిర్మించే చిత్రం, జోషిలే ఎఫ్ సి మెహ్రా రష్యన్ కొలాబ్రేషన్‌లో నిర్మించే చిత్రం ఇవి శ్రీదేవి ప్రస్తుతం నటిస్తున్న హిందీ చిత్రాలు ఇందులో విజయమాధవి, ఆఫ్‌తాబ్ ప్రొడక్షన్స్, సి వి కె శాస్త్రి నిర్మించే చిత్రాలు జూన్‌లో ప్రారంభమై సెప్టెంబరు 1984 కి పూర్తి అవుతాయి ఎఫ్ సి మెహ్రా రష్యన్ సహకారంతో నిర్మించే చిత్రం 1985 లో ప్రారంభం అవుతుంది

శ్రీదేవి యిపుడు మూడు తెలుగు చిత్రాలలో మాత్రమే నటిస్తున్నది ఆ మూడు చిత్రాలకు ఏ కోదండరామిరెడ్డి దర్శకుడు అవి రోజా ఎంటర్‌ప్రైసెస్ పతాకంపై ఎం అర్జునరాజా సమర్పణలో వి కనకరాజు నిర్మిస్తున్న చిత్రంలో శోభన్‌బాబు నాయకుడు రెండవది నందిగం దేవీప్రసాద్ సమర్పణలో యన్ రామలింగేశ్వరరావు నిర్మిస్తున్న 'కంచు కాగడా' చిత్రం మూడవది రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ పై మిద్దె రామారావు నిర్మించే తాజా చిత్రం ఈ రెండు చిత్రాల్లోను కృష్ణ హీరో. శ్రీదేవి నాయికగా రెండున్నరఏళ్లక్రితం ప్రారంభమైన విజయమాధవి పిక్చర్స్ వారి "బొబ్బిలిగాడి దెబ్బ" పూర్తికావలసి వుంది కృష్ణంరాజు హీరోగా నటిస్తున్న యీ చిత్రానికి కె వాసు దర్శకుడు

శ్రీదేవి 1970 నుంచి 1977 వరకూ బాలతారగా నటించిన చిత్రాలు 23 ఆమె యింతవరకూ నటించిన చిత్రాల వివరాలు తమిళం 40, మళయాళం 25, కన్నడం 3, తెలుగు 59 (శ్రీరంగనీతులు - వరకు) యుక్తవయసు వచ్చింతర్వాత 1978 నుంచి 1983 వరకూ యీ 59 చిత్రాల్లోను నటించిందన్నమాట. అంటే సగటున ఏడాదికి 12 చిత్రాలు

ఎన్ని భాషా చిత్రాల్లో నటించినా, నటిస్తున్నా శ్రీదేవిలో పిసమెత్తు అహం పెరగ లేదు నాటి బాలతారగా ఎంతటి వినయవిధేయ తలతో వుండేదో, నేడు నెం1 తారయినా ఆ వినయ విధేయతలు అలాగే వున్నాయి. పెద్దల పట్ల గౌరవం, అందర్నీ చిరునవ్వుతో ఆప్యాయంగా పలుకరించడం, క్రమశిక్షణ, సీనియారిటీ ఆమెకు పెట్టని ఆభరణాలు !

— మోహన్ కుమార్.



# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## తెలుగు నిర్మాతల హిందీ చిత్రాలు

★ దాసరి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో టి. క్రాంతికుమార్ నిర్మించే శ్రీ అన్నపూర్ణా ఇంటర్నేషనల్ ''ఆజ్ కా ఎం. ఎల్. ఏ'' (ఎం. ఎల్. ఎ. ఏడుకొండలు) చిత్రంలో రాజేష్‌ఖన్నా, షబ్నా ఆజ్మి, గెస్ట్‌గా జితేంద్ర నటిస్తున్నారు. డాక్టర్ రాహీ మాసూమ్ రేజా సంభాషణలు, బాప్పిలహరి సంగీతం, కె. ఎస్. హరి ఛాయతో కుమార్జీ ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్.

★ కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో పద్మాలయ నిర్మించే ''శక్తి'' చిత్రంలో జితేంద్ర సరసన రాధ నాయిక.

★ ''హైసియత్'' (సీతారాములు) చిత్రాన్ని దాసరి నారాయణరావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో శ్రీకాంత్ నహతా నిర్మిస్తున్నారు. జితేంద్ర సరసన జయప్రద నాయిక.

★ డి. రామానాయుడు నిర్మించే ''మక్సద్'' (ముందడుగు) చిత్రంలో రాజేష్ ఖన్నా, జితేంద్ర, శత్రుఘ్నసిన్హా, అంజాద్‌ఖాన్, ప్రేమ్‌చోప్రా, శ్రీదేవి, జయప్రద, వహీదా రెహమాన్, శ్రీరామ్‌లాగు, అస్రానీ, రంజిత్, శక్తికపూర్ ప్రభృత తారాగణం. కె. బాపయ్య దర్శకుడు.

## దాసరి స్క్రీన్‌ప్లే, మాటలు, నిర్మాణంలో పదవ శిష్యుడు రమణబాబు దర్శకత్వం

''భారతంలో ఒక అమ్మాయి — చిత్రంలో అప్రెంటిస్‌గా చేరి, ఆ తర్వాత అసిస్టెంట్ అయి, అసోసియేట్‌గామారి, 'యుద్ధం' చిత్రానికి నా వద్ద కో డైరెక్టర్ పనిచేసిన చురుకైన యువకుడు రమణబాబుకు మా తారకప్రభు ఫిలిమ్స్ 6వ చిత్రానికి దర్శకత్వ బాధ్యతను అప్పగించాము. నవంబర్ 25 నుంచి డిసెంబర్ 10 వరకు తొలి షెడ్యూల్, డిసెంబర్ 20 నుంచి జనవరి 5 వరకు మలి షెడ్యూల్. దీంతో షూటింగ్ పూర్తయిపోతుంది. ఉగాదికి విడుదల,'' అన్నారు దాసరి నారాయణరావు. ఈయన స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, నిర్మాణంలో దాసరి పద్మ సమర్పించే చిత్రంలో జయసుధ, మురళీమోహన్, శరత్‌బాబు, సుజాత, గొల్లపూడి మారుతీరావు, నూతన్ ప్రసాద్, అల్లు రామలింగయ్య, రమాప్రభ, జయమాలిని, సూర్యకాంతం, ఒక అపూర్వమైన పాత్రలో దాసరి నటిస్తున్నారు. గొల్లపూడి కథ, రమేష్ నాయుడు సంగీతం, కె. ఎస్. హరి ఛాయ, భాస్కరరాజు శిల్పం, కృష్ణ కూర్పు, రాధాకృష్ణమూర్తి సహ దర్శకత్వం నిర్వహిస్తున్నారు.

'పోరాటం'లో పూర్ణిమ, శివకృష్ణ, చి॥ మహేష్, అంజలీదేవి





'చండి — చాముండి'లో కవిత

## హీరో కృష్ణ కొత్త చిత్రాలు

★ రత్నా మూవీస్ 2వ చిత్రాన్ని ఎం. మల్లికార్జునరావు దర్శకత్వంలో జి. నాగరత్నమ్మ నిర్మిస్తారు.

★ ఘట్టమనేని రామమోహనరావు, పాటిబండ్ల శాయిబాబు నిర్మించే శాయిరామ్ మూవీస్ ''భార్యాభర్తలు'' చిత్రానికి బాల మురుగన్ కథ, పరుచూరి సోదరుల సంభాషణలతో ఎం. మల్లికార్జునరావు దర్శకుడు.

★ పద్మాలయ స్టూడియోస్ సమర్పించే అమృతా ఫిలిమ్స్ 9వ చిత్రంలో జయసుధ నాయిక. ఎం. బాలయ్య దర్శకత్వంలో అలపర్తి సూర్యనారాయణ, మన్నవ వెంకట్రావు నిర్మాతలు.

★ భవానీ ఇంటర్నేషనల్ కంబైన్స్ ''సూపర్ స్టార్'' చిత్రాన్ని వంగల జగదీశ్వరరావు కూర్పు. దర్శకత్వంలో తాళ్ళూరి కృష్ణవేణి నిర్మిస్తారు. వి. ఎస్. ఆర్. స్వామి ఛాయాగ్రాహకుడు. సత్యం సంగీత దర్శకుడు.

★ ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో ఎన్. రామలింగేశ్వరరావు నిర్మించే రాంప్రసాద్ ఆర్ట్స్ పిక్చర్స్ ''కంచు కాగడా'' చిత్రంలో శ్రీదేవి నాయిక.

★ కె. సి. ఎస్. చంద్రశేఖర్ సమర్పించే వినయ్ మూవీస్ ''ముఖ్యమంత్రి'' చిత్రంలో అంబిక నాయిక. విజయనిర్మల దర్శకత్వంలో టి. శ్రీనివాసరెడ్డి, శాఖమూరి రామచంద్రరావు నిర్మాతలు. చక్రవర్తి సంగీత దర్శకుడు. పుష్పాల గోపీకృష్ణ ఛాయాగ్రాహకుడు.



'మానస వీణ'లో రేవతి

★ కృష్ణ సమర్పించే పద్మావతి ఫిలిమ్స్ 9వ చిత్రాన్ని ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో యు. సూర్యనారాయణబాబు నిర్మిస్తారు.

★ దాసరి నారాయణరావు రచన, దర్శకత్వంలో జి. సత్యనారాయణరాజు నిర్మించే రాధాకృష్ణా మూవీస్ కొత్త చిత్రంలో కృష్ణ, కృష్ణంరాజులు ప్రధాన పాత్రధారులు.

★ డాక్టర్ ఎం. తిరుపతిరెడ్డి సమర్పణలో కె. ధనుంజయరెడ్డి నిర్మించే సంయుక్తా మూవీస్ 2వ చిత్రానికి ఎ. కోదండరామిరెడ్డి దర్శకుడు.

★ రవిచిత్ర ఫిలిమ్స్ 14వ చిత్రాన్ని కట్టా సుబ్బారావు దర్శకత్వంలో వై. వి. రావ్ నిర్మిస్తారు.

★ నిర్మాత మిద్దె రామారావు కొత్త సంవత్సరంలో ప్రారంభించే రాజ్యలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ 9వ చిత్రానికి ఎ. కోదండరామిరెడ్డి దర్శకుడు.

★ పి. చంద్రశేఖరరెడ్డి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కోగంటి విశ్వేశ్వరరావు నిర్మించే శ్రీ పంచవటి చిత్రాలయ వారి ''బంగారు కాపురం'' చిత్రంలో జయసుధ, జయప్రద నాయికలు. సత్యానంద్ సంభాషణలు, జె. వి. రాఘవులు సంగీతం, లక్ష్మణ్ గోరే ఛాయతో కోగంటి విజయకుమార్ నిర్మాణ సారధి.

## "రైలు దోపిడి" పతాక సన్నివేశాలు

కె. ఎస్. రెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో గోటేటి శ్రీరామారావు సమర్పించే గోటేటి ప్రొడక్షన్స్ ''రైలు దోపిడి'' చిత్రానికి పతాక సన్నివేశాలు తిరుపతి—చంద్రగిరి స్టేషన్‌ల మధ్య రైల్వే ట్రాక్‌పై నవంబర్ 18, 19 తారీఖుల్లో అధిక వ్యయప్రయాసలకోర్చి చిత్రీకరింపబడ్డాయి. దొంగలు రైలును దోపిడి చేసి, గుర్రాలపై పారిపోయే సన్నివేశాన్ని రెండు కెమెరాలతో చిత్రీకరించారు. ప్రభ, భానుచందర్, విజయలలిత, పి. ఆర్. వరలక్ష్మి, జీవా, శర్మ, భీమేశ్వరరావు, ఎందరో స్టంట్ ఆర్టిస్టులు పాల్గొన్నారు. అంతకు ముందు శారదా స్టూడియోలో రకరకాల విషసర్పాలతో చిత్రీకరించిన సన్నివేశాలు కూడా ఎంతో గగుర్పాటును కలిగిస్తాయి. నూతన్ ప్రసాద్, అనూరాధ, జయమాలిని, నరసింహరాజు, మోదుకూరి సత్యం ఇతర పాత్రధారులు. సెంటిమెంట్‌తోపాటు థ్రిల్స్ గల ఈ చిత్రకథను వియత్నాం వీడు సుందరం తయారుచేశారు. పేరాల సంభాషణలు, డాక్టర్ సి. నారాయణరెడ్డి గీతాలు, రాజ్ సంగీతం, రంగాఛాయ, బి. చలం శిల్పం, నాయని మహేశ్వరరావు కూర్పు, ఎస్. పి. రంగారావు సహకార దర్శకత్వం, జి. వి. రావ్ నిర్వహణతో జి. సత్యవతి, జి. నారాయణరావు నిర్మించే ఈ చిత్రం డిసెంబర్ చివరన విడుదలవుతుంది.

## వాశిరాజు ప్రకాశం చిత్రం "రామరాజ్యం వచ్చింది"

''నాటి ఆంధ్రుల అభిమాన కథానాయకుడు, నేటి ప్రజానాయకుడు రాజర్షి శ్రీ ఎన్. టి. రామారావు ముఖ్యమంత్రి అయ్యాక సాధించిన, సాధించనున్న ప్రగతి కార్యక్రమాలు ఈ చిత్రంలోని ముఖ్యాంశాలు. ఒక్కముక్కలో చెప్పాలంటే—తెలుగు ప్రజల్లో ఈనాడు కానవస్తున్న సాంఘిక, రాజకీయ చైతన్యం ఈ చిత్రంలో ప్రధాన విశేషం,'' అన్నారు వాశిరాజు ప్రకాశం. ఈయన డిసెంబర్ 15న చిత్రీకరణ మొదలెట్టిన జయశ్రీ చిత్రవారి ''రామరాజ్యం వచ్చింది.'' చిత్రంలో చంద్రమోహన్, నూతన్ ప్రసాద్, రమణమూర్తి, కాంతారావు, రాళ్ళపల్లి, మాడా, పొట్టి ప్రసాద్, రవి, ప్రభ, పండరీబాయి మున్నగువారు నటిస్తున్నారు. బొల్లిముంత శివరామకృష్ణ సంభాషణలు, ఎస్. రాజేశ్వరరావు సంగీతం, భాస్కరరావు ఛాయ, కళాధర్ శిల్పం, కె. ఎం. నాయుడు నిర్వహణతో రేలంగి నరసింహారావు దర్శకుడు.



గొల్లపూడి 'మనిషికి మరోపేరు'

'కోటీశ్వరుడు' లో ఒక సన్నివేశం



## సినిమా

### "సువర్ణ సుందరి"లో స్వప్నసుందరి

కర్పగం స్టూడియోలో శిల్ప దర్శకుడు భాస్కరరాజు ప్రతిభకు తార్కాణంగా ఏవేవో ఊహా లోకాల్లోకి తీసుకెళ్ళే బ్రహ్మాండమైన సెట్టు ... రెండు వరుసలలో పెద్ద పెద్ద గంటలు, వాటి చుట్టూ భామలు. ఒకవైపు కాస్త ఎత్తులో ఒక పెద్ద కలం ... "ఊహా సుందరి ఉన్మత్తతలో, కల్పనాదేవి ఆరాధనలో, అన్వేషణలో, ఆలోచనలో, ఆలాపనలో — ఊహాకు కూడా అందని సుందర ఆరామ వాటికల్లో విహరించి, అంతు తెలియని ఏవేవో లోకాలను అధిగమించిన ఆధునిక భావుకుని పుష్పకన్నా సున్నితమైన గాథ," అని కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చి, దర్శకత్వం వహించే బీరం మస్తాన్ రావు వివరించిన రూపకల్పనకు ఊపిరిపోస్తున్నట్లుంది నృత్య చిత్రీకరణ. నాయకుడు చంద్రమోహన్ యువకవి. ఆయన ఊహాసుందరి జయశ్రీ నృత్యానికి వేటూరి సాహిత్యం, రమేష్ నాయుడు సంగీతం, శేషు నృత్య దర్శకత్వం రసవత్తరంగా అమరాయి. 14 పాటలు, 12 నృత్యాలు గల ఈ చిత్రం వీనుల విందు, కనుల పండుగ కలిగించడానికి కె. పి. ఆర్. పిక్చర్స్ యూనిట్‌లోని ప్రతి ఒక్కరూ ఎంతో కృషి చేస్తున్నారు. మలయాళ నటి, నర్తకి జయశ్రీ ద్విపాత్రలు నిర్వహిస్తున్న "సువర్ణ సుందరి" చిత్రంలో జగ్గయ్య, గొల్లపూడి మారుతీరావు, సరళ, అన్నపూర్ణ ఇతర పాత్రధారులు. బీరం నవీనలక్ష్మి సమర్పించే ఈ చిత్రానికి సత్యమూర్తి సంభాషణలు, భాస్కర రావు ఛాయ, నరసింహారావు కూర్పు, రాజేంద్ర సింధే, సుధాకరరెడ్డి సహకార దర్శకత్వంతో పి. భరద్వాజ నిర్మాణ సారధ్యం వహిస్తున్నారు. "డిసెంబర్‌లోగా నిర్మాణ కార్యక్రమం ముగించాలి. కథకు అనుగుణంగా ఎన్ని భారీ సెట్లు వేయవలసివచ్చినా ఖర్చుకు వెనుకాడకుండా మా కె. పి. ఆర్. పిక్చర్స్ బానర్‌ను ఎస్టాబ్లిష్ చేసుకోడానికి మేమంతా అహర్నిశలూ శ్రమిస్తున్నాం," అన్నారు నిర్మాత అట్లు బ్రహ్మానందం.

'సువర్ణ సుందరి'లో జయశ్రీ





'మంచి మనిషి'లో తులసి



ఇటీవల మదరాసు విజయాగార్డెన్స్‌లో జరిగిన యోగ్రప్రియ ఆర్ట్ క్రియేషన్స్ వారి "ముద్దుల చెల్లెలు" పాటల రికార్డింగ్ సందర్భంగా గాయనీ-గాయకులు సుశీల, బాలసుబ్రహ్మణ్యం, దర్శకుడు ఇమంది రామారావు, సంగీత దర్శకుడు కె. వి. మహదేవన్, కో-డైరెక్టర్ కేశవరావు, నిర్మాత రమణయ్యనాయుడుగార్లని చిత్రంలో చూడవచ్చు.



"లాటరీ టికెట్ కొన్నాను-బహుమతి రాగానే నిన్ను హీరోయిన్‌గా పెట్టి సినిమా ప్రారంభించటమే ఇక!"

## ఇమంది రామారావు దర్శకత్వంలో కొత్త చిత్రాలు

ఇటీవలే యోగ్రప్రియ ఆర్ట్ క్రియేషన్స్ "ముద్దుల చెల్లెలు"కు దర్శకుడైన ఇమంది రామారావు దర్శకత్వంలో మరికొన్ని చిత్రాలు తయారు కానున్నాయి.

"మురళీ-మోహన్" గా మురళీమోహన్ ద్విపాత్రలు నిర్వహించే చిత్రాన్ని మల్లీశ్వరి ఆర్ట్ క్రియేషన్స్ పతాకంలో మామిళ్ల సత్యనారాయణ నిర్మిస్తారు. మార్చి నెల నుంచి షూటింగ్ జరుగుతుంది.

ఎం. జగపతిరాజు "సన్నజాజులు" అనే సంగీత నృత్యప్రధాన చిత్రాన్ని నవనటీనటులతో నిర్మిస్తారు.



## సినిమా

# తమిళ తారల ప్రేతాత్మలు!

చాలా కాలం క్రితం మధుర వాస్తవ్యులు శ్రీ సోమసుందర ప్రజ్ఞాన సంబంధ దేశిక పరమాచార్యస్వామిగారు "మరణించిన వారి ఉనికి, వాళ్ళ భావాలు" అనే తమిళ గ్రంథాన్ని రచించి, పరమపదించారు. ఆ గ్రంథాన్ని చదివిన మధుర, రామనాథపురం జిల్లాలోని ఇద్దరు ముగ్గురు, అందులోని విధానాల ననుసరించి ప్రేతాత్మలతో సంభాషించగలుగుతున్నారట. వారిలో మధుర, ఇందిరానగర్, నెహ్రూజీ వీధిలోని రంగనాయికమ్మ అనే నడి వయస్కురాలి గురించి ఇటీవల కొన్ని విషయాలు తెలిశాయి. ఈమె తన భర్త, కొడుకులు, మనమళ్ళు సైతం కోరిన ఆ కుటుంబ పూర్వీకుల ప్రేతాత్మలను ధూపదీపాలు వెలిగించి, రాత్రి వేళల్లో రప్పించి మాట్లాడగలుగుతున్నదట. ఈమె రెండో కొడుక్కి మరణించిన కొందరు తమిళ సినిమా నటీనటుల ప్రేతాత్మలు ఏం చెబుతాయో తెలుసుకోవాలని ఆశ. కాని, రంగనాయకమ్మకు అది ఇష్టం లేకపోయినా ఆ కొడుకు బలవంతం మీద ఒకరోజు రాత్రి వాళ్ళ డాబామీద కూర్చొని, ముత్తురామన్, సురుళిరాజన్, అశోకన్, శోభ, కవికణ్ణదాసన్ మున్నగు వారి ప్రేతాత్మలను రావించి సంభాషించగలిగిందట. ముత్తురామన్, శోభల— మరణాలు ఎలా సంభవించాయో వారి ప్రేతాత్మలు తెలియజేశాయట. "మీ అబ్బాయి కార్తిక్‌కు ఎప్పుడు పెళ్ళవుతుంది, ఎవరితో ?" అని అడిగితే, "నా కొడుకు నటి రాధనే పెళ్ళాడుతాడు. 1984 లేక 1985లో పెళ్ళి జరగవచ్చు," అందట ముత్తురామన్ ప్రేతాత్మ.

హాస్యనటుడు సురుళిరాజన్ ప్రేతాత్మ చాలా సీరియస్‌గానే జవాబిచ్చిందట. కవికణ్ణదాసన్ ప్రేతాత్మ ఎంతో ఉత్సాహంతో, జవాబిచ్చిందట. "మీరు రాసిన సినిమా పాటలలో మీకు నచ్చినది ఏది ?" అని అడిగితే, "అణ్ణన్ ఎన్నడా, తంబి ఎన్నడా— అనే పాట... పళని— చిత్రంలోనిది, "అని జవాబిచ్చిందట. నటుడు అశోకన్ ప్రేతాత్మ ఆంగ్లంలో అడిగిన ప్రశ్నలకు జవాబివ్వక, తమిళంలో అడిగిన ప్రశ్నలకే జవాబిచ్చిందట.

అప్పుడప్పుడు కొన్ని దుష్ట ప్రేతాత్మలు కూడా వచ్చి, రంగనాయకమ్మ ప్రశ్నలకు అవి కూడా జవాబులిస్తూ, వాటిని పొమ్మన్నా వెంటనే పోక, నటీనటుల ప్రేతాత్మలకు అడ్డు తగులుతూ వచ్చాయట.

ఒకసారి రంగనాయకమ్మ తన అత్తగారి ప్రేతాత్మను రావించి, "నమస్కారం ... మీరు సజీవంగా ఉన్నంతవరకు మనిద్దరం పోట్లాడుకుంటూనే ఉన్నాం. ఇప్పుడైనా ప్రేమతో శాంతంగా మాట్లాడండి, నేను మీ కోడలు రంగనాయకమ్మను," అనేసరికి అత్తగారి ప్రేతాత్మ ఆ డాబా చుట్టూ మూడుసార్లు తిరిగి తుర్రుమందట.

చచ్చి దయ్యమైనా అత్తగారికి కోపం తగ్గనట్లుంది !



## పి. యు. డి. – ఇడుపులపాడు

స్నేహానికి సరిఅయిన నిర్వచనం ఏమిటి ?

★ ఇద్దరు వ్యక్తులు—అభిప్రాయ భేధాలను గౌరవించుతూ—అన్యోన్యంగా వుండడం.

మానవుని ఆశకు అంతు ఎప్పుడు ?

★ లేదు. చస్తూ కూడ నా పేరు నీ కొడుక్కి పెట్టు అనో – నా పేర – శాశ్వతంగా ఏమైనా చేయి అంటూనో కోరుతాడు !

## వి. వి. – నూజివీడు

మేం ప్రేమించుకుంటున్నాం, పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాం. కాని మా మతాలు వేరు. ఏం చెయ్యాలి ?

★ ఇద్దరికీ వయస్సు వుండి, మీ కాళ్లమీద మీరు బ్రతక్కల ఆధారం వుంటే—కులాల ప్రసక్తి లేకుండా స్పెషల్ మేరేజస్ యాక్టు కింద రిజిస్టర్ పెళ్లి చేసుకోండి— లేదు— కులంకోసం ప్రేమ త్యాగం చేసుకోండి.

## పి. డి. – ఎమ్మిగనూరు

మీరు ఉత్తరములకు ఎన్ని సంవత్సరాల నుంచి జవాబులిస్తున్నారు ?

★ జ్ఞాపకంలేదు. నేను కాలాన్ని లెక్కించను, గడిపేస్తాను.

## వాసుదేవ్ – కొత్తగూడెం

విలువైన రూపం ఏది ?

★ అద్దంలో కన్పించే మన ముఖమే కదా వాసుదేవా ?

## వి. బి. ఆర్. – విశాఖ

గుమస్తా కేడర్‌పై తేలికభావం ... మీ సంగతి చెప్పండి ఆ గుమస్తా గురించి.

★ ఏంచెప్పను— నేను గుమస్తా కూతుర్ని !




## ఎస్.ఎస్.ఎన్.డిగ్ బాయ్ (అస్సాం)

ఈ భూమిమీద పుట్టిన వారందరూ గొప్పవారెందుకు కావడంలేదు ?

★ అప్పుడింక గొప్పకి ప్రత్యేకత ఏమిటి వుంటుంది నారాయణా ! అజ్ఞానం ఉంటేనే— విజ్ఞానానికి గుర్తింపు. చీకటి లేకపోతే వెలుక్కి గుర్తింపేది ? అలాగే— ఇదీను.

## ఆర్. ఎన్. ఆర్. – మాచర్ల

'మని'షిలో మీరు దేనికి విలువనిస్తారు ?

★ నేను మాటలు మాటల్లా చూస్తాను. అక్షరాల్లా చూడను.

## జి. వి. – విశాఖపట్నం

కోరికలు తీరడానికి మార్గం సూచించండి.

★ కోరికలు తక్కువైన కొద్దీ, అవి తీరడం— సులభం అవుతుంది.

## జి. ఎమ్. కె. – మోటూరు

ప్రేమకు మనస్సు గొప్పదా శీలం గొప్పదా?

★ ప్రేమించే వ్యక్తి నిర్ణయించుకోవలసిన— రెండు వ్యక్తిగత విషయాలవి.

## ఎస్. ఎమ్. – రేపల్లె

నాకు మీలాగే రచనలు చేసి, మీలాగే తర్వాత ప్రశ్నావళి నిర్వహించాలని వుంది. నాకు డిగ్రీ విద్య లేదు. హైస్కూలు విద్య లేదు. ప్రాథమిక విద్య అబ్బింది, నన్నేంచేయమంటారు?

★ ప్రయత్నిస్తూండడమే— వ్రాయడం. పాతికేళ్ల అనుభవం తరువాత— మీరూ నాలాగే తయారవుతారు !

## కె. సి. ఆర్. ఎన్. – మైదుకూరు

అక్కయ్యా సినిమాలవల్ల సమాజం చెడిపోతూందనే మాట నిజమా ?

★ సమాజం చెడదు. వ్యక్తులు చెడిపోవచ్చు— నిజం చెప్పాలంటే— దేనివల్లనైనా చెడిపోయేవాళ్లూ వుంటారు. బాగుపడేవాళ్లూ వుంటారు.

## బి. వి. డి. డి. – అరసవల్లి

పెళ్లయినంత మాత్రాన స్త్రీ తన వ్యక్తిత్వాన్ని యింటిపేరునీ ఎందుకు పోగొట్టుకోవాలి ?

★ ఎవరు పోగొట్టుకోమంటున్నారు ?!

జీవితానికి లక్ష్యం అంటూ వుండకపోతే ?

★ నిస్సారంగా— వుంటుంది.

## వి. వి. పి. – బ్రాహ్మణకాక

అదృష్టం, యోగం అనేవి ఉన్నాయా ? కష్టపడి కూడా ఫలితం దక్కడానికి అదృష్టం, యోగం – కావాలా ?

★ కష్టపడిన ఫలితం దక్కడానికి కూడా— సరియైన పరిస్థితి, అనుకూల వాతావరణం వుండాలి – అదే— అదృష్టం యోగం అంటారంతే !

## జి. వి. కె. ఆర్. – రాజమండ్రి

పురుషుల కంటే – స్త్రీలే ఎక్కువగా రచనలు చేస్తున్నారు. కారణం స్త్రీకి తీరిక ఎక్కువగా వుండడమా ? లేక వారికి భావనా శక్తి అపారంగా వున్నందువల్లా ?

★ ప్రచురణావకాశాలు ఎక్కువ కావడం వల్ల. స్త్రీకీనాడు – కాస్త 'తనని' గురించి కూడా ఆలోచించుకునే అదను దొరకడం వల్ల. పనిపాటలు లేకా, మహామేధాసంపత్తి వల్లా కాదీ రచనలు పెరుగుత. ఇక, స్త్రీల పేర్లు చూసి మోసపోకండి. వీటిలో నూటికి ఎనభై శాతం దొంగపేర్లు ! అంచేత ఆడవాళ్లు ఎక్కువ రాసేస్తున్నారన్న దానికంటే – ఆడపేర్లు ఎక్కువగా కన్పిస్తున్నాయి – అనాలి.

## డి. ఎమ్. ఆర్. హైదరాబాదు

మనిషి కూనిరాగాలు ఎందుకు తీస్తాడు ?

★ పాడేవాడు బాధలని చెదరకొడతాడని చెప్తారు కదా ? అందుకే ! ★

---

విజయవాడలోని స్టేట్‌బాంక్ ఆఫ్ ఇండియా స్టాఫ్ కల్చరల్ అసోసియేషన్ వారి ఆధ్వర్యంలో ఇటీవల విజయవాడ ఆర్టిస్ట్స్ అసోసియేషన్‌వారు ప్రదర్శించిన 'చిలకల పందిరి' హాస్యకదంబంలో ఒక దృశ్యం. విన్నకోట విజయరాం, విజయభాను, జయవాణి, వై. రాజకుమారి, కబీర్‌దాస్‌లని చిత్రంలో చూడవచ్చు.



# విడవకుండా వచ్చే దగ్గుకు ఉపశాంతి ఇస్తుంది



## విక్స్ ఫార్ములా 44 కాఫ్ డిస్క్

## ప్రత్యేక పదార్థం సైలెంటియం కలిగిన ఏకైక కాఫ్ లాజెంజ్

సైలెంటియం విడవకుండా వచ్చే దగుకు శీఘ్ర ఉపశమనం ఇస్తుంది. దీనితోపాటు ఫార్ములా 44 కాఫ్ డిస్క్—

- దగ్గు క్రిములను నాశనం చేస్తుంది.
- గొంతు నొప్పినుండి ఉపశమనం ఇస్తుంది.
- శ్వాస తీసుకోవడాన్ని సులభం చేస్తుంది.







## మందులాంటి రుచి మందులాంటి పని

CASRH-19-244 TEL




**బ**యట విపరీతంగా వాన కురుస్తోంది. మధ్య మధ్య పిడుగులు శబ్దం. వాలు కుర్చీలో పడుకున్నాను. చలివేస్తోంది. చేతిలో 'అమృతం కురిసిన రాత్రి' పుస్తకం. తిలక్ అనుభూతి వాదంలో చలికాగుతున్నాను

ఇంటిలో ఏకాంతం భరించరానిదిగా ఉంది. భాను పుట్టింటికి పురుటికెళ్ళింది. మరొక ఇరవై రోజుల్లో పురుడు వస్తుందని అంచనా. తను వెళ్ళిన ఇరవై రోజుల్నుంచి హోటల్ భోజనం. పేకాట, సినిమాలు, స్నేహితులతో కాలక్షేపం... రెండు రోజులు ఉత్తరం రాకపోతే మనసు భానుమీదకి, ఆమె ఆరోగ్యంమీదకి మరలుతుంది. ఆమె వెళ్ళేప్పుడు 'ఆడపిల్ల కావాలి.' అని చెవిలో చెప్పాను. నవ్వుకుంది, 'మరి బాబు తమ్ముడంటున్నాడు' అని నవ్వింది. ఆ నవ్వు, గుంటలుపడ్డ చెక్కిళ్ళు, వాలు కన్నులచాటున దాగిన సిగ్గు తెరలు — ఇంకా నాకు జ్ఞాపకం ఉన్నాయి.

''అమృతం కురిసిన రాత్రి
అందరూ నిద్రపోతున్నారు —
నేను మాత్రం......''

తిలక్ కవిత్వంలో అక్షర సమూహం నవ్వుతాయి — నవ్విస్తాయి. ఏడుస్తాయి — ఏడిపిస్తాయి. ముందుకి సాగలేకపోతున్నాను. ఆగి నిదానించలేకపోతున్నాను.

''టక్... టక్... టక్'' తలుపు మీద చప్పుడు.

వర్షంతోపాటు పోటీపడుతున్న గాలి తలుపు మీద చేస్తున్న చప్పుడనుకున్నాను. తలుపుమీద శబ్దం పెరిగింది. గాలి కాదు. రాత్రి పదకొండు గంటలయ్యింది. ఈ సమయంలో మిత్రులెవరూ రారు.

మళ్ళీ చప్పుడయ్యింది... మళ్ళీ మళ్ళీ...

''ఎవరూ ?'' అనడిగితే జవాబులేదు.

తలుపు తీశాను. ఎదురుగా గుమ్మం అవతల ఒక ఆకృతి... ఖచ్చితంగా స్త్రీ... గాజుల గలగల... ఆకృతిలో కదలికలేదు. లైటువెయ్యాలని అప్పటిదాకా ఆలోచనేలేదు — వేశాను...

ఒక అడుగు ముందుకు వేశాను.

పద్దెనిమిది సంవత్సరాలుంటాయి. యవ్వనం తెచ్చిన అందం ...

మాసిన బట్టలు, తడిసిన జుట్టు, కూలి చేసుకునే పిల్లలా ఉంది.

శరీరమంతా తడిసింది. బట్టలు ఓడుతున్నాయి. జుట్టు నుంచి ధార కారుతోంది. మొహం మీద నుంచి కారే నీళ్ళను తుడుచుకుంటోంది. తనచుట్టూ తడిసిమడుగు అయ్యింది. చీర కట్టింది. తనది కాదు. జాకెట్ తన వయసుకు రెట్టింపు వయసు నాజూకు గలది. ఎవరో ధర్మదేవత రెండింటిని ఇచ్చి ఉంటుంది. యువతి వయసు కళ్ళకి కనిపిస్తుంది. ఆమె బట్టల వయసు మనసుకి కనిపిస్తుంది.

చెవులకి ఏవీ లేవు. చేతులకు చెరో పచ్చ గాజు ఉన్నాయి. వెలుతురులో నన్ను చూడగానే కళ్ళు తళుక్కుమన్నాయి. వాటిలో ఆశ పెట్టుకుని ఉంది. ఆమె ఎవరో నాకు తెలియదు...

''ఎవరు నువ్వు ?''

మొహంమీద నీళ్ళు తుడుచుకుంది.

''రెండు సంవత్సరాల క్రితం 'గంగి' అని మీ ఇంట్లో పనిమనిషి చేసేది గుర్తుందాండీ ?'' ఆదుర్దాగా నావైపు చూసింది.

''అవును గంగి !''

''నేను గంగి కూతుర్నండి ... నా పేరు చంద్ర. నెల క్రితం మా అమ్మ చచ్చిపోయిందండి. మా బాబు ఏనాడో పోయాడండి. తిండి, బట్ట జరగడం లేదండి. చుట్టాలెవరూ సేర నియ్యలేదండి. దిక్కు, దారి లేదండి. ఇంట్లో దాసిగా పనులు చేస్తానండి. ఇంత ముద్దపెట్టి, మీ ఇంట్లో ఉండనియ్యండి బాబూ !'' అని రెండు చేతులు జోడించి నిటారుగా నుంచుంది.

చిర్నవ్వు నవ్వాను.

''ఇంటిలో పని చేస్తే ఎవరు పోషిస్తారు.. నీ పిచ్చిగాని ? ఏదో సామాన్య సంసారం కదా !''

''కాదు బాబూ ! మెతుకులెట్టి ఈ పంచన పడి ఉండనివ్వండి.''

కంఠంలో ఆశ, బాధ ...

''అది మాత్రం కష్టంకాదూ ?''

''మెతుకులు, పంచ... నేనింకేవీ, అడగడం లేదండి. ఎవర్నడిగినా లేదు — లేదంటారు — పొమ్మంటారు — కారణం నాకు తెల్సండి.''

''కారణం ? కారణం ఏమిటి ?'' ఆమె కళ్ళల్లోకి చూశాను.

''కారణం—పడుసుదాన్ని కదండి — పంచకు రానివ్వరు.''

పైకి అనలేదుగాని — ఆమె మాటలు మనసులో అనుకున్నాను. నాకు బాధగా అనిపించింది.

పాపం ! పడుచుదనం నేరమని పడుచుదే అంటోంది.

ఆడది పరపతి కాపాడుకోవాలంటే పడుచుదనం కాపాడుకోవాలి. పరపతితో నిమిత్తం లేకుండా పడుచుదనం కోరతారు కొంతమంది. నిదానించి ఆలోచిస్తే పరపతి — పరువం పరస్పరాశ్రయాలు — అవ్యక్తులకు దేని అర్థం దానిదే.

''మరోకచోట అడిగిచూడు.'' అప్రయత్నంగా అన్నాను.

''చెప్పకోకూడదుగాని చెప్పక తప్పదండి ... 'ఈ వయసులో మిలమిల మెరిసే కళ్ళతో ఇంకా మొగాణ్ణి చూడకుండానే ఉన్నావా ?' అన్నారొక అమ్మగారు.''

''అరె — పాపం !''

''నిన్ను కొంపలో పెట్టుకుంటే మా ఆయన్ని కాయలేక సావాలి అన్నాదింకో అమ్మ.''

''..............''

''వయసు తెచ్చిన వంకరలు నా తప్పా చెప్పండి — ఇలా నిందలు పట్టానికే పుట్టానా అయ్యా !'' అని చంద్ర కంట తడిపెట్టింది. నాలో ఏదో ఆవేదన కలిగింది.

'ఎక్కడుండే మాంసం అక్కడ ఉంటే ఆడదాన్నిచూసి కంట్లోకారంపెట్టుకుంటారేం?' అని చలం వేసిన ప్రశ్న తళుక్కున మెరిసింది.

''మా అమ్మ మీ ఇంటో సాలాకాలం పని చేసింది. అప్పుడు నేను చిన్న పిల్లని — మీరు సాలా మంచోరు. ఏ పని, చెప్పినా చేస్తాను. మార్కెట్టు పని, పిల్లల పని, ఇంటి పని అన్నీ జేస్తా... వద్దనకండి బాబూ !'' ఆందోళనగా అంది.

''సరేలే చేస్తావు... కాని మేం భరించాలి కదా !''

''వద్దనకండి బాబూ — వయసు, దాచుకోవాలి. దయ సూపించండి.'' వెనక్కి చూస్తూ అంది.

ఆడది— చిన్న వయస్కురాలు.. మాటల్లో హద్దుదాటి అడుగుతోంది. తన హద్దు తనకి తెలుసు. కష్టంలో ఎంత తెలివి, నిదానం ...! ఆదుర్దాలో అవగాహన జీవితం నేర్పుతుంది.

''నీ సమస్య అర్థమైంది... కాని నా ఇబ్బందులు నావి..అంచేత మరోచోట అడుగు..'' సమస్యను తప్పించుకుంటున్నానని తెలుసు.

''ఎవర్ని అడగను ? రోడ్‌మీద క్రిష్ణా హోటల్లో పనికి రమ్మన్నాడా ముసలాడు. తిండి పెట్టి వందరూపాయలిస్తానన్నాడు. పని తక్కువన్నాడు. బట్టలు కూడా యిస్తానన్నాడు...''

నా చూపులు సందేహాస్పదంగా ఉన్నాయి.

''కొరకొర జూస్తాడు. అదంతా నా ఒంటి మీద ఆశే తప్ప నా ఆకలి మీద జాలికాదు...''

ఆమె నోరు తెరిచి కాక — మనసు తెరిచి మాట్లాడుతోంది.

''దొంగనవ్వు నవ్వుతాడు. అందులో విషం నాకు తెలుసు. సిగ్గిడిచి చెప్తున్నానని తప్పట్టకండి బాబూ ! ఒంగు తప్పించావంటే నా దగ్గర గుర్రప్పిల్లలా బతుకుతావు—' అన్నాడు. అక్కడ పని కెళ్ళమంటారా బాబూ !'' వెక్కి వెక్కి ఏడుస్తోంది.

అంత చలిలోను నాకు ఉక్కబోస్తోంది.

వెళ్ళమని నేనెలా అంటాను — ''వాళ్ళు వెధవలు — ద్రోహులు.'' అని మాత్రం అనగలిగాను.

''కాదు బాబూ— నా శరీరం ఎదవది— నా వయసు నాకు ద్రోహం చేస్తోంది.''

''చూడు చంద్రా ! మా ఆవిడ పురిటికని పుట్టింటి కెళ్ళింది. ప్రస్తుతం హోటల్లో తింటూ, ఒంటరిగా ఉంటున్నాను. నాకు పని మనిషి అవసరం లేదు.'' సన్నగా అన్నాను.

''మీరు అందరి లాంటి వారు కాదు బాబూ! చెల్లెల్ని అనుకోండి, కూతుర్ని అనుకోండి — మానం దాచుకోడానికి మీ పంచన చేరిన అనాథననుకోండి. అమ్మగారొస్తే ఏవీ అనరు. నేనావిడ కాళ్ళట్టుకుంటాను.''

మనసు వికావికలమైంది.

''ఆవిడ అంటుందని కాదు. ఆడది ఇంట లేనప్పుడు... ఒంటరిగా ఉంటూ— పని మనిషిని పెట్టుకుంటే...''

''ఊఁ... పెట్టుకుంటే...''

''... ... ...''

''చెప్పండి బాబూ !''

''ప్రపంచం ఏమనుకుంటుంది? పెళ్ళయిన వాడిని కదా— నా పరపతి, గౌరవం నేను చూసుకోవాలి కదా !''

''రెక్కలు లేని పక్షిని రక్షిస్తే ప్రమాదమంటారా ? అన్నీ తెలిసినవారు.''

''లోకం అన్నీ సరిగా అర్థం చేసుకోదమ్మా...''

''అమ్మా అని ఇంతవరకూ ఎవరూ పిలవలేదు బాబూ— నేను బలైపోతుంటే లోకానికి పట్టదు కాని— మీరు రక్షిస్తే తప్పదుతుందా అయ్యా !''

''చూడు చంద్రా ! మా ఆవిడను పుట్టింటి నుంచి రానియ్యి— అప్పుడు తప్పక పనిలో చేర్చుకుంటాను. అంతవరకూ ఆగాలి ... ఈలోగా ఓ పని చెయ్యి... యాభైరూపాయలు ఇస్తాను. ఎక్కడేనా బతుకు. చాలకపోతే మళ్ళీ యిస్తా— మా ఆవిడ వచ్చాక పనిలోకిరా !'' అన్నాను.

''మీ డబ్బు నాకెందుకయ్యా ! పని చెయ్యకుండా తీసుకోను. పెద్ద పులులు పొంచి చూస్తున్నాయి—అదే నా భయం !'' అంది.

నేను అనహాయుణ్ణి— నాకు మనసు ఉంది. కాని చిట్లి ముక్కలు ముక్కలుగా ఉంది. నా తప్పు నాకు తెలుసు. అయినా భయం — సంఘ భయం. లోకభీతి...

## వార్ధక్యం

అదను చూసి
కాలం కాటేసింది
తన కసి తీర్చుకుంది
అదే అదనుగా
ముసలితనం ముసుగు కప్పింది
ముసి ముసిగా నవ్వుకుంది
యీ సందట్లో
యవ్వనం తప్పిపోయింది
దాన్ని వెతకటానికి
కళ్ళజోడు అవసరమైంది
ఈ తలమునకలలో
నా తల పండిపోయింది
నా తల వెంట్రుకలు
తెల్లపోయాయి !

— డా పోతుకూచి వెంకటేశ్వర్లు

లోపలికి వెళ్లాను, మూడు పాత చీరలు, నాలుగు జాకెట్లు, రెండు వదిరూపాయల నోట్లు ఆమెకు చూపిస్తూ —

''ఇది తీసుకుని వెళ్ళు చంద్రా! మా ఆవిడ వచ్చాక తప్పక పనిలోకి తీసుకుంటాను. ఇంక ఇబ్బంది పెట్టకు...''

''డబ్బు, బట్టలు నన్ను కాపాడవయ్యా! శరీరం తగులడిన తర్వాత ఎందుకయ్యా ఇవి.''

బిక్కమొహం పెట్టింది. నిస్పృహ వెలికక్కుతోంది. నేనూ ఏం నిర్ణయించాలో తెలియని పరిస్థితిలో ఇరుక్కున్నాను. అది మరీ బాధగా ఉంది.

''అవి తీసుకుని వెళ్లు. నే చెప్పినట్టు చెయ్యి'' అని చటాలున తలుపేసేసి లోపలికి వచ్చేసాను. నా నిర్దయ నాకు స్పష్టంగా తెల్సింది. మంచంమీద వాలాను. మతి లేదు. మరుపురావడం లేదు.

నిదానంగా గోడమీదకి చూశాను.

''ఏం చేశావు?'' అన్నట్టు ప్రశ్నిస్తున్నాడు వివేకానందుడు.

''పిరికిపందవు'' అంటున్నాడు చలం.

''ఛీ! ఛీ!'' అన్నాడు శ్రీశ్రీ.

''మానవునిలో మానవత కొరత'' అంటున్నాడు రస్సెల్.

పటాల్లోంచి మాట్లాడుతున్నారు— మళ్ళీ పుస్తకం తీశాను. అమృతం కురిసిన రాత్రి కాదు— 'హాలాహలం కురిసిన రాత్రి.' వెళ్ళి తలుపు తీశాను. ఆశ్చర్యం.

చంద్ర అక్కడ లేదు. చీరలు, జాకెట్లు, రెండు పదకాయితాలు అక్కడే పడి ఉన్నాయి. నన్ను చూసి నవ్వుతున్నాయి.

చంద్ర కన్నీళ్లు వర్షం తాలూకు నీళ్ళలో కలిసి పోయాయనుకున్నాను.

*　　　*　　　*

రెండు సంవత్సరాలు గడిచాయి. ఆ వేళ రాణి రెండవ పుట్టినరోజు. పెద్ద ఎత్తున పార్టీ జరిగింది. రాణికి కొత్త గౌను, ముత్యాలహారం, చెవులకి రింగులు.

రాత్రి ఎనిమిది దాటింది. రవి పడుకున్నాడు. రాణి ఇంకా ఆడుతోంది— పడుకోమని చెప్తే పడుకోడం లేదు. భానుకి చిరుకోపం... వీధి తలుపుమీద టక్ టక్‌మని శబ్దం.

''ఎవళ్ళో ఒకళ్ళు — ఒక్క నిముషం ఉండనీయరు.'' భాను గదిలోంచి వాకిట్లోకి వెడుతూ అంది.

''హాయి అన్నది అందరికీ ఒకలా ఉండదు.'' అన్నాను.

వీధి తలుపు తీసిన చప్పుడయ్యింది. వచ్చిన మనిషి, భాను మాట్లాడుకున్నారు. నాకు వివరాలు తెలియలేదు.

''మిమ్మల్నే — ఇలారండి— ఈ అమ్మాయి మీతో మాట్లాడాలిట... ఒక్కసారి యిలావచ్చి ఈమెకు చెప్పేది చెప్పి పంపించండి.'' అని విసుగ్గా అంది.

నేను రాణిని భుజాన వేసుకుని వీధి తలుపు వైపు వెళ్ళాను.

''గాపకం ఉన్నానా అయ్యా!'' నిర్జీవంగా నవ్వుతూ అంది. తెల్లబోయాను

''గంగి కూతురు—చంద్రకదూ!'' అన్నాను.

''అవునండయ్యా!''

మరో నిముషం ఎవరూ మాట్లాడలేదు.

మనిషిలో జీవంలేదు. ఎముకలగూడు. వంటిఛాయ పోయింది. పీచు జుట్టు — నడుం వెదురుబద్దలా ఉంది. బట్టలు మాసికలతో ఉన్నాయి.

చేతితో బిడ్డడు — ఈ మాయ ప్రపంచం తెలియక కేరింతలు కొడుతున్నాడు. కిందకి దిగాలని వాడి ప్రయత్నం. వాణ్ణి ఆపలేక చంద్ర ఆయాసపడుతోంది.

''బాగున్నారా అయ్యగారూ!'' కాలానికి విలువనిచ్చే ప్రశ్న.

''ఆఁ... పెళ్ళి అయ్యిందా! మీ అబ్బాయా! చురుకైనవాడే!—'' అన్నాను.

''అవునండి. క్రిష్ణా లాడ్జిలో ఉద్యోగం చేసానండి.''

''నువ్వా — అరె!''

''ఉద్యోగమని చెప్పి – నన్ను అమ్ముకున్నా నండి – అదో జైలండి.''

నాకు నోటమాట రావడంలేదు. భానుకు మతిలేదు. వ్యక్తి, విషయం అర్ధంకావడంలేదు. మా ఇద్దరికేసి మార్చి మార్చి చూస్తోంది.

''పెళ్ళి కాలేదా ?'' అన్నాను.

''లేదండి ...''

''ఈ అబ్బాయి ...?''

''అబ్బాయి పుట్టడానికి పెళ్ళి అవ్వక్కర్లే దండి. ఏడాది క్రితం నా రక్తం, మాంసం పంచుకుని పుట్టాడండి.''

''తండ్రి ...?''

''మా ఇద్దరికీ తెలియదండి ...'' పిచ్చిగా నవ్వింది.

''అ రె రె ... ఎంతపని జరిగింది ?'' అనగలిగాను. భానుకు విపరీతమైన రోషం వచ్చింది. ముఖ కవళికలు మారిపోయాయి. పెగుల్చుకుని మాటలు బైట పడేటట్టున్నాయి.

''ఆవేశ వయసు దాచుకుందామని ఏడ్చాను. వయసు దోచుకున్నారు. అందుకు ఫలితం వీడే !'' తలొంచుకుంది.

''బాధ పడకు.''

చంద్ర బావురుమంది.

భాను ఉద్వేగం ఆపుకోలేకపోయింది.

''ఏయ్... ఎవరు నువ్వు –? ఎందుకిక్కడ ఈ గొడవ ?'' అని తీక్షణంగా చూసింది.

''ఒక ఆడదాన్ని అమ్మా !''

''తెలుస్తూనే ఉంది వాలకం. బిడ్డని కందట– లాడ్జీలట– మొగాడు లేడట.''

''మీరు అదురుష్టవంతులమ్మా – మీకున్నారు. నాకెవరూ లేకపోబట్టే నా బతుకు కాలిపోయింది –

అయ్యా! ఆ నరకంలో బతకలేక పారి పోయొచ్చాను. అప్పుడు ఉండనిస్తే మానం దక్కేది– పోన్లెండి– ఇప్పుడు ఉండనిస్తే ప్రాణం దక్కుతుంది. ఆళ్ళ కంటబడితే సంపేత్తారు బాబూ !''

చంద్ర రోదిస్తోంది.

ఆమె రోదనలో సమస్త మానవజాతి రోదన నాకు వినిపిస్తోంది.

''చంద్రా ! ఫరవాలేదు – భయపడకు – ఇక్కడే ఉండు. తిండి బట్ట ఇస్తాం ...'' అని అనగలిగాను.

''ఏవండీ– ఏవిటండీ– కొంపకి ఈ కొత్త తిప్పలేవిటి ? '' అంది భాను.

''తిప్పలేవీలేవు – ఆమె ఆడది. ఆడదాని సమస్య ఆడదానికి అర్థం కావాలి– నువ్వు తినగా మిగిలిందైనా ఒక ముద్ద పెట్టు–నువ్ కట్టుకుని వదిలేసిన ఓ బట్ట ఇయ్యి– అదీ బతుకుతుంది. దాంతోపాటే పిల్లాడు బతుకుతాడు.'' అని వీధి తలుపు వేసేశాను...

భాను మాట్లాడలేదు.

ఆ రాత్రి మళ్ళీ వర్షం కురిసింది. నాలుగు దిక్కులు ఏకమై ఏకధారగా కురిశాయి ... మెరుపులు, ఉరుములు... శబ్దాలు రొద ...

కిటికీలోంచి చూస్తున్నాను.

అది 'అమృతం కురిసిన రాత్రి.' ★

## ఇ 'వేమన' పద్యాలు




కుక్క గరిచెనేని కుయ్యంగ బిగబట్టి
పక్క విరుగదన్ని పండబెట్టి
నిమ్మకాయ దెచ్చి నెత్తిన రుద్దిన
కుక్క విషము దిగును కుదురు వేమ.

# బ్రహ్మాండమైన అవకాశం!

# బాదల్ ఫ్యానులు

ఉచితం!
ఒక్కొక్క ఫ్యాన్‌తోను ఒక స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్ర




## త్వరపడండి!

ఈ కొద్ది రోజుల సదవకాశాన్ని చేజారనీయకండి.

**Badal** *fans*

● టేబుల్ ● సీలింగ్ ● పెడస్టల్ ● క్యాబిన్

● ప్రముఖ ఫ్యాన్ డీలర్లందరివద్ద లభ్యంకాగలదు.

అసోసియేటెడ్
మార్కెటింగ్ ఏజెన్సీస్
4-4-340/బి గిరిరాజ్ లేన్
బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్-500 001

AMA 21/83TEL



# నేను నా మనస్సు మార్చేసుకున్నాను మంచిదాని కోసం

**ఆ దిట్టమైన ఫ్రెంచి సూపర్ బైక్ బుక్ చేశాను ఇప్పుడే**

నా స్నేహితురాలు సదా హింస పెడుతూంటుంది నేను చేసిన దానికంతా ఎప్పుడూ.
నిజంగా మీరు ఊహించగలరా నేను ఎంత కష్టపడ్డానో, అది వద్దని చెప్పి విశిష్టమైన స్పోర్టిఫ్ తీసుకుంటున్నానని చెప్పడానికి. ఇతర వాటికంటె ఈ స్పోర్టిఫ్‌లో విశిష్టత ఒలికేదేమిటో తెలుసుకోవాలని ఒకటేగోల పెట్టింది. అందుకే చెప్పాను....అంత కంటెకూడా మంచి పనేచేశాను ఆవిడనే వెంట బెట్టుకొని షో రూముకి తీసుకెళ్ళా ఆవిడంతట ఆవిడికే బాగా తెలుస్తుందని. నిజంగా ముఖం చాటంతైంది. బ్రతుకుదేముడా అనుకున్నా.



**స్పోర్టిఫ్ ఎందుకు విశిష్టమైనది**

- మంచి వేగం అందుకుంటుంది· గం॥కి 60 కి.మీ.
—డబుల్ వేరియేటర్ ఫ్లాప్ వాల్వ్ ఇంజను బాగా వేగం అందుకుంటుంది గం॥కి 60 కి మీ. మంచి అధిక టార్క్ నిర్మించుకొని నిమ్నప్రదేశాలల్లో కూడా ఇద్దరిని సౌలభ్యంగా తీసుకుపోతుంది.
- లీటరుకి 80 కి.మీ. మైలేజి — మీకు లీటరుకి 80 కి మీ. వేగం ఇవ్వడానికి ఇంజను ట్రాన్స్‌మిషన్‌తోను గియర్స్‌తోను చేరి వుంటుంది
- దొంగిలించబడటానికి వీలులేని పెట్రోల్ ట్యాంక్ — అద్వితీయమైన పెట్రోల్ ట్యాంక్ డిజైనువల్ల అనవసరంగా దాని జోలికి పోవడానికి వీలులేకుండా తాళం వేయగల సౌకర్యం ఇంకా అంతర్నిర్మితమైన ఇంధనపు మట్టపు సూచి.
- బటన్ నొక్కుతుంటే చాలు స్టార్టు అవుతుంది —సెల్ఫ్‌స్టార్టింగ్ మెకానిజంకు ప్రత్యేకంగా డిజైను చేయబడిన మాగ్నెటో బాగా పనిచేసే బ్యాటరీకి వైరు చేయబడివుంటుంది.
స్పోర్టిఫ్‌కి కిక్ స్టార్టుకూడా వుంటుంది. ఇంకా మీకు అవసరమైతే పెడల్ స్టార్టు చేసుకోవచ్చు
- గియర్లు వాటంతటవే మారతాయి — ఆటో గియరు విధానం వేగము మరియు టార్క్ వేరియేటర్లతో ఆటో గియర్ల విధానంతో గియర్లు బండి నడుస్తూండగానే వాటంతటవే మారతాయి. సాధారణ గియరు డిజైనుకంటె ఎంతో విశిష్టమైన విధానము
- ఈ 80ల నాటి నూతన స్టైయిలు— ధారావాహికంగా దిట్టంగా వుండే డిజైను బాడీ స్టైయిలుకి అనుగుణ్యంగా ఏర్పరచిన మాగ్ చక్రాలు—కాంటూర్ సీటింగ్ ఇద్దరు కూర్చుని సౌకర్యంగా స్వారి చేయడానికి అనువుగా వుంటుంది.
- ముఖ్యమైన విడిభాగాలన్నీ ప్యూజోవారు తయారుచేసినవే.

**SPORTIF** సూపర్ బైక్

ఇప్పుడు భారతదేశంలో లభిస్తుంది.



శ్రీ చాముండి మోపెడ్స్ లిమిటెడ్

ఫ్రాన్స్ **PEUGEOT** వారి సహకారంతో

**స్పోర్టిఫ్**

**దిట్టమైనది. శక్తితోవుండేది. ఫ్రెంచిది.**

అధిక శక్తి 50cc ఇంజనుతో ఇద్దరికి బైక్

HTK-SCM-1472-A

## మీరు మీ స్పోర్టిఫ్‌కి ఇక బుక్ చేసుకోవచ్చు

స్పోర్టిఫ్ చిహ్నము (Logo) భారత ప్రభుత్వమువారి అంగీకారమును అనుసరించి.

సీరియల్:

# గోరంత దీపం

## — వింధ్యవాసిని

**(గత సంచిక తరువాయి)**

అనంతపురం పట్టణానికి దగ్గిరే ఉన్న సింగనమల గ్రామంలో పుట్టాడు పరశురాం. అతనికి గుర్తుతెలీని వయసులోనే అమ్మా నాన్నా పోయారు. అమ్మ చెల్లెలు, పిన్నమ్మ కాపురం ఆ ఊళ్ళోనే. మరో దిక్కు లేక వాళ్ల ఇంట్లో వచ్చి పడ్డాడు పరశురాం.

పిన్నమ్మ మంచిదే. తల్లీ తండ్రీ లేని, ఆ పిల్లాడి మీద జాలి, అక్క కొడుకు అని ఆపేక్ష రెండూ ఉన్నాయి. అయితే ఏంలాభం? ఆ యింట్లో ఆమెకి విలువలేదు. ఇంట్లో పెత్తనమంతా చిన్నాయనదే.

ఆయన దృష్టిలో పరశురాం ఒక దరిద్ర జాతకుడు. ''మా ఇంట్లో ఉండి మాకేం అరిష్టం తెస్తాడో'' అని భయపడేవాడు. ఆ మాటలనే ఎన్నిసార్లో పైకే అనేవాడు.

పరశురాం వచ్చే సరికి పిన్నమ్మకొక కూతురుండేది. అతనక్కడ చేరిన మూడేళ్లకి ఒక మగపిల్లవాడు పుట్టాడు. పుట్టుకతోనే వాడు పరశురాంకి మరిన్ని కష్టాలు తెచ్చి పెట్టాడు. పరశురాం చదువు కేదో వందలూ, వేలూ ఖర్చయిపోతున్నట్లుగా భావించి, తనకో కొడుకు పుట్టగానే అతన్ని చదువు మానమని పోరు పెట్టసాగేడు వాళ్ల చిన్నాయన.

నిజానికప్పుడు పరశురాం స్కూలుకు వెళ్లి వస్తూనే ఉన్నా, ఇంట్లో ఉన్నంతసేపూ ఏదో పని చేస్తూనే ఉండేవాడు. వ్యవసాయం, పాడి పశువులు ఉన్న ఇంట్లో చేసేవారు కావాలి కానీ, పనికి లోటేముంది?

ఆ ఊరి హైస్కూలు హెడ్‌మాస్టారు రంగాచారిగారి సపోర్ట్ కొంత ఉండేది పరుశురాంకి. చదువులో ఫస్ట్‌క్లాస్ కుర్రవాడు కాక పోయినా, ఏ తోడూ ఆస్తీ లేని వాడికి, ఏ నాటి కయినా చదువే తోడునిలిచి సహాయం చేస్తుందని ఆయన నమ్మకం. పరుశురాంకి చిన్నాన్న ఇంట్లో ఏ ఇబ్బంది వచ్చినా, మాట సహాయం చేసి తప్పిస్తుండేవాడు.

నిజానికి వాళ్ళ చిన్నాయన పరుశురాంని ద్వేషించటంలో అర్థమేలేదు. ఎందుకంటే పరుశురాం పేరున వాళ్ళ నాన్న వదిలిన కొంత పొలం ఉంది చెరువు కింద. దాంట్లో ఏటా వరి వేసి మంచి లాభం చేసుకుంటున్నాడు అతను. అయినా పరశురాం కోసం తన స్వంత డబ్బును ఖర్చు చేస్తున్నవాడిలా విసుక్కునేవాడు.

రంగాచారి మాస్టరుగారి కొడుకే విశ్వమూర్తి. ఇతను పరుశురాం కన్నా కొంచెం పెద్దవాడు. అయినా ఇద్దరికీ మంచి స్నేహం కుదిరింది. రోజూ ఎంతపనిఉన్నా ఒక్కసారయినా మాస్టారుగారి ఇంటికి వెళ్ళకుండా, విశ్వంతో కబుర్లు చెప్పకుండా ఉంటే తోచేది కాదు పరుశురాంకి.

విశ్వానికి కోపం, ఆవేశం ఎక్కువ. అనవసరంగా మాట పడేవాడు కాదు. ''ఏమిట్రా నువ్వు. మెత్తగా ఉన్నవాళ్ళు మొత్తుతూనే ఉంటారు. గట్టిగా ఎదురు తిరిగి మాట్లాడాలి'' అని పురి కొల్పుతుండేవాడు మిత్రుణ్ణి.

ఆ మాటలు తనకీ రుచించేవి. కానీ వాటిని ఆచరణలో పెట్టటం మాత్రం అతని వల్ల కాలేదు. బాగా చిన్నవయసులోనే చిన్నాన్న ఎదుట మాట్లాడలేని బెదురేదో ఏర్పడిపోయింది. అది వదిలించుకోవాలంటే తనింకా పెద్దవాడు కావాలి. అంతదాకా ఆగాలి అనుకునేవాడు. అతనికి ఓర్పు, ఆలోచన ఎక్కువ.

పెద్ద చదువులు చదవాలనే ఆశలేదు పరుశురాంకి. ఎప్పటికయినా చిన్నాన్న అధికారం నుండీ బయటపడి స్వతంత్రంగా బ్రతకాలంటే కొంత చదువు అవసరం. అందుకనే ఏది ఏమయినా స్కూలుఫైనలుకి ముందు మాత్రం చదువు ఆపకూడదు అని గట్టిగా నిర్ణయించు కున్నాడు.

పట్టుదల అనేది ఉండాలేగానీ, కారు చీకట్లో అయినా చిరుదీపం సహాయంతో ముందుకు వెళ్ళవచ్చు. ఆ పట్టుదల పరుశురాంలో ఉంది. అతనికి ఇంట్లో చెల్లెలు రాజ్యం, బయట విశ్వమూర్తి స్నేహితులు, ఆత్మీయులు. ఆ పిల్లకి అన్నయ్యంటే చాలా అభిమానం. ఇంట్లో తమ్ముడు పుట్టి, తన ముద్దు ముచ్చటలు తగ్గి పోయాక అన్నకి మరింత చేరువ అయింది.

స్కూలుకి సెలవులొస్తే రోజంతా పొలం పనే పరుశురాంకి. ఇంటికివచ్చేటప్పుడు ఏ చెరుకు ముక్కో, మొక్కజొన్న పొత్తులో విరిచి తెచ్చే వాడు చెల్లెలి కోసం. వాటినే గొప్పగా, అపు రూపంగా తినేది ఆ పిల్ల.

ఆ రోజుల్లో ఎవరి భూముల్లో వ్యవసాయం చేసే కూలీలకి వాళ్ళే భోజనాలు పంపడం ఆన వాయితీగా ఉండేది. పెద్ద బుట్ట నిండగా జొన్న సంకటి, ఒక పిడత నిండా పచ్చడి, పెద్ద బానెడు మజ్జిగతేట ఇచ్చి పంపేవారు పరుశురాం ఇంటి నుంచీ.

రాజ్యం కాస్త పెద్దయినప్పట్నుంచీ సద్ది మూట వెంట తనూ వచ్చేది, అన్నకోసం రహస్యంగా ఏ వేపుడు కూర ముక్కలో పట్టుకుని. సమయానికి తండ్రి అక్కడ లేకపోతే పరశురాం దగ్గర కూచుని కబుర్లు చెబుతూ, భోజనంలో భాగం పంచుకుని తినేది.

> **జరిగినకథ — 2 :** 'గోరంత దీపం' రాయలసీమ వార్త వారపత్రిక ఎడిటర్ విశ్వమూర్తి, ఎం. డి. పరశురావ్ ప్రాణస్నేహితులు. విశ్వమూర్తి కూతురు రమణ అదే ఆఫీసులో పనిచేస్తుంది. పరశురావ్ కూతురు కరుణకు ట్యూషన్ చెబుతున్న హరిప్రసాద్ కరుణ సహాయంతో ఆ ప్రెస్‌లోనే ఉద్యోగం సంపాయిస్తాడు. మంచి తెలివితేటలు, గౌరవ గల హరిప్రసాద్‌కు తన పెద్దకూతురు అరుణను ఇచ్చి పెళ్లి చేయాలని నిశ్చయించుకొంటాడు పరశురావ్.

## 8

ఒక్కో ఏడూ గడిచి, పెద్ద వాడవుతున్న కొలదీ, రోజు రోజుకీ ఇంట్లో బానిసలా అయి పోతున్న తన బ్రతుకు మీద అసహ్యం పేరుకు పోతోంది పరశురాం మనసులో.

స్నేహితుడు వెళ్ళి అనంతపురం కాలేజీలో చేరిపోయాడు. పరశురాం ఒంటరి వాడయాడు. అయితే ఏదో ఒక రోజీ జైలు నుంచీ తప్పించుకుని స్వతంత్రంగా బ్రతుకుతాననే నమ్మకం అతనిలో ప్రబలంగా ఉండేది.

విశ్వం బియ్యేలో ఉండగా, స్వాతంత్రోద్యమపు గాలులు దేశమంతా వ్యాపించాయి. ఊరూరా విద్యార్థులు సంఘాలుగా ఏర్పడి, విరివిగా సమ్మెల్లో పాల్గొంటున్నారు.

విశ్వాన్నీ గొడవల నుంచి తప్పించి, చల్లగా తీసుకొచ్చి ఇంట్లో ఉంచుకోవాలన్న మాస్టారి ప్రయత్నాలేవీ ఫలించలేదు. ''నేను రాను. పిరికి వాడిలా పారిపోయి వచ్చినా, నా మనసు నిలవదు'' అని మొండికేశాడు విశ్వం.

ఒకసారి విశ్వానికి మూడునెలలు జైలు శిక్ష విధించారని తెలియగానే, వాళ్ళమ్మ దిగులుతో జబ్బుచేసి మంచాన పడింది. తర్వాత అతని గురించిన వార్త ఏదీ సింగనమల చేరలేదు. మాస్టారుకి లోలోపల అనుమానమే, ఈ అల్లర్ల లోనో, జైల్లోనో కొడుకు ఎప్పుడో చనిపోయి ఉంటాడేమోనని. పయికి మాత్రం ధైర్యంగా ఉంటూ భార్యకి సేవలు చేసేవాడు. అప్పట్లో అమ్మగారి దిగులు పోగొట్టేందుకు, పరశురాం రోజూ వెళ్ళి కబుర్లు చెప్పి వచ్చేవాడు.

స్వతంత్రం వచ్చి ఏడాది అయినా విశ్వం వార్త ఏదీ అందలేదు. పరశురాంకి, పూర్తిగా

నమ్మకమే, స్నేహితుడు ఎక్కడో సుఖంగా ఉండి ఉంటాడని.

ఒకసారి సింగనమల నుండీ, కర్నూలుకు వెళ్ళి వచ్చిన ఆసామీ ఒకాయన, విశ్వం కబురు తీసుకొచ్చాడు— ''మీ అబ్బాయి బజార్లో కనిపించాడు కర్నూల్లో'' అని, మాస్టారితో చెప్పాడు.

విషయం తెలిసినప్పటినించీ, ఒకటే గొడవ చేసింది విశ్వం అమ్మగారు. ''ఎలాగయినా వాణ్ణి ఇంటికి రప్పించే దారి చూడండి'' అని వేధించింది. అనంతపూర్ నుండి, కర్నూల్ తొంభయి మైళ్ళ దూరమే అయినా, అప్పట్లో ఇప్పటంతగా ప్రయాణ సౌకర్యాలు లేక, అది మరో రాష్ట్రంలోనో, దేశంలోనో ఉన్నట్లు అనిపించేది. సింగనమల వాళ్ళు అక్కడికి వెళ్ళాలంటే, అనంతపూర్ వెళ్ళి రైలెక్కి, గుంతకల్లులో రైలు మారి వెళ్ళాలి.

ఏలాగో కష్టపడి విశ్వం అడ్రసు సంపాదించారు మాస్టారు. నాలుగయిదు ఉత్తరాలు వ్రాసిన జవాబు వ్రాయలేదు కానీ, జబ్బుచేసిన తల్లిని చూసేందుకు తనే స్వయంగా వచ్చాడు విశ్వం. అతని రాక తల్లిదండ్రులకన్నా ఎక్కువ సంతోషాన్ని కలిగించింది, పరశురాంకి.

మూడవ రోజు ఉదయం విశ్వం తల్లి మరణించింది.

''ఇన్ని నెలలుగా అనారోగ్యంతో మంచాన పడిన ముసలామె, కొడుకు కోసమే పళ్ళు కరుచుని ప్రాణం నిలబెట్టుకుని ఉన్నదేమో. కొడుకు వచ్చాడు. కోరిక తీరగానే వెళ్ళిపోయింది'' అన్నారు ఊళ్ళో అంతా. కావలసిన కార్యాలు అన్నీ అయినాయి

తిరిగి బయలుదేరేందుకు తయారు అయాడు విశ్వం. స్నేహితుడు పరశురాంకి ముందే చెప్పిపెట్టాడు తనతో వచ్చెయ్యమని.

''ఈ ఊర్లో ఎన్నాళ్ళున్నా, బావిలో కప్పలా, మీ చిన్నాన్న చెప్పుకింద తేలులా పడి ఉండాలి. నాతో వచ్చెయ్యి రామూ, ముందీ కూపంనుంచీ బయటపడితే చాలు. తెల్లారి చీకట్తోనే అనంతపురం వెళదాము. తయారుగా ఉండు'' అని హెచ్చరించాడు.

నడి సముద్రంలో బెదురుతూ, ఒంటరిగా, ఈది అలసిపోతున్నవాడికి, పెద్ద బల్లచెక్క దొరికినట్లుగా విన్పించాయి పరశురాంకి స్నేహితుని మాటలు. బాగా ఆలోచించాడు. తన బ్రతుకెలాగయినా మారాలంటే అదొక్కటే మార్గం. ఇప్పుడు భయపడి మానుకుంటే విశ్వం వెళ్ళిపోతాడు. జీవితమంతా ఇట్లా చిన్నాన్న ఇంటి పాలెగాడిలా బ్రతకాల్సిందే. ఏమయితే అయిందని వెళ్ళేందుకే నిశ్చయించుకున్నాడు. రహస్యంగా విషయం చెల్లెలికి మాత్రమే చెప్పిపెట్టాడు. తను ఇల్లు దాటేదాకా ఆ సంగతెవరికీ తెలియకుండా ఉంచుతానని ఒట్టేసింది రాజ్యం. నాన్న జేబులోంచి అయిదురూపాయలు దొంగిలించి తెచ్చి, పరశురాంకిచ్చింది.

రాత్రి భోజనాలయిన తర్వాత తండ్రితో అన్నాడు విశ్వమూర్తి.

''తెల్లారి ఊరెళతాను నాన్నా'' అని.

''మళ్ళీ ఎందుకురా వెళ్ళటం ? మీ అమ్మ పోయింది, నా దారికి నన్ను వదిలి. నువ్వక్కడ ఏం సాధించాలని. స్వంత ఊరు, ఇల్లు, వాకిలి అన్నీ వదులుకుని, దేశాలు పట్టుకుని వెళ్ళాలిసిన అవసరం ఏముంది ? నీకీ పల్లెలో ఊరికే కూచోవటం ఇష్టం లేకపోతే, చెప్పు. ఏదో ఒక రకంగా ఎవరికాళ్ళయినా పట్టుకుని, నీకు అనంతపురంలో ఉద్యోగం వేయిస్తాను. రోజూ పోయి రావచ్చు'' అని నచ్చజెప్పబోయాడు రంగాచారి.

చల్లగా అసలు విషయం బయటపెట్టాడు విశ్వం. ''నాకోసం మీరు ఎవరికాళ్ళో పట్టుకోవటం ఎందుకు ? నాకు అక్కడ బాగానే ఉంది. ఆరునెలల క్రితం పెళ్ళి చేసుకున్నాను,'' అని.

''ఓహో, మాకు మాటమాత్రం చెప్పనక్కరలేదనుకున్నావా ? నేను చచ్చాననుకున్నావా ? నీలాంటి త్రాష్టుణ్ణి చూస్తూ బ్రతకటంకన్నా, మీ అమ్మ చావటమే మంచిదయింది.

పోనీ ఏదో ఏడిచావు. ముందు వెళ్ళి ఆ పిల్లను ఇంటికి తీసుకొచ్చెయి. మన ఇంటా వంటా లేవిలాంటివి. పోయిన పరువు ఎలాగూ పోయింది. ఇప్పటినించీ అయినా సవ్యంగా ఏడువు'' అన్నాడు కోపంతో పళ్ళు నూరుతూ.

''అబ్బే వద్దులే నాన్నా, ఆ అమ్మాయి మనకులం కాదు. ఆ అమ్మాయిని తెచ్చి మన



ఇంట్లో చేరుస్తే, నిప్పుల్నికూడా నీళ్ళతో కడిగే మన ఆచారం, కులం మంటగలిసిపోవూ ? మా బ్రతుకేదో మేము చూసుకుంటాం. దూరంగా ఉంటేనే మేలుకదా ?'' ధైర్యంగా అన్నాడు విశ్వం.

కోపం పట్టలేకపోయాడు మాస్టారు. ''ఛీ, దరిద్రుడా ! నా ఇంట్లో చెడబుట్టావుగదరా ? ఈ సంగతి ముందే ఏడిస్తే, నిన్నీ ఇంట్లో అడుగు పెట్టనిచ్చేవాణ్ణికాదు. మీ అమ్మకు తల కొరివి పెట్టనిచ్చేవాణ్ణికాదు. పో ఈ క్షణమే నా ఇంట్లోంచీ వెళ్ళిపో'' అని అప్పటికప్పుడే కొడుకుని తరిమేశాడు.

నేరుగా పరశురాం దగ్గరికి వెళ్ళాడు విశ్వం. వసారాలో చీకట్లో చిరుచాపమీద నిద్రరాక దొర్లుతూ ఉన్న పరశురాంని పిలిచాడు.

''లేరా, పోదాం'' అని.

''అప్పుడే తెల్లారిందా'' మెల్లగా అంటూ లేచి కూర్చున్నాడు పరశురాం. ''అప్పటిదాకా కాచుకుని ఎవరు కూర్చుంటారు. చల్లగా నడుచుకుని, అనంతపురం పోదాం పద'' అని బయలు దేరదీసాడు విశ్వం. కట్టుబట్టలతో మిత్రుని వెంట బయలుదేరాడు పరశురాం.

* * *

విశ్వం, పరశురాం కర్నూల్లో దిగేసరికి, మరుసటి రోజు తెల్లారి ఆరు గంటలయింది. స్వంత వూరొదిలి మరో ఊరు రావటం అదే మొదలు పరశురాంకి. అందులోనూ తను స్వతంత్రంగా బ్రతికేందుకు దారి చూపబోతున్న వూర్లో స్టేషనుదాటి అడుగు పెట్టగానే మనసంతా బరువుగా అయింది. ఒకసారి మనసులోనే దేవుణ్ణి ప్రార్థించుకున్నాడు, తనని సరియయిన మార్గంలో నడిపించమని.

స్టేషన్‌నుండీ పావుగంటసేపు నడచినా, ఆ చుట్టుపక్కల ఒక ఊరంటూ ఉన్న సూచన లేమీ కనిపించలేదు. అక్కడకూడా విసిరేసినట్లున్న కొన్ని ఇళ్ళూ, వాటి చుట్టూ పెద్ద తోటలూ తప్పిస్తే.

నాలుగు రోడ్ల కూడలిలో కుడి వయిపు తిరగగానే, కనుచూపుమేరలో, పెద్ద కోట బురుజు ఒకటి కనిపించింది. ''దాన్నే కొండా రెడ్డి బురుజు అంటారు'' అని చెప్పాడు విశ్వం. అంత దూరం నించీ కనిపిస్తూనేఉన్నా, దాన్ని చేరుకోవటానికి చాలాదూరమే నడవాల్సి వచ్చింది. బురుజు చుట్టూ అయిదారు రోడ్లు, సందులూ ఉన్నాయి అందులో ఒక సందులోకి తిరిగారు ఇద్దరూ. బురుజు నానుకొని ఉన్న పెద్ద మెయిన్‌రోడ్‌ని చూపుతూ ''ఊర్లో ముఖ్యమయిన సెంటర్ ఇదే. అల్లదిగో ఆటు పూవులు, పళ్ల అంగుళ్ళున్నాయే, వాటి కవతలే ఉంది బస్టాండు'' అని చెప్పాడు విశ్వం.

మరో రెండు మలుపులు తిరిగి, ఒక చిన్న ఇంటి ముందర ఆగారు, తమ ఊర్లోలాగా

# గోరంత దీపం

ఇంటి ముందర అరుగులుగానీ, వసారాగానీ లేక పోవటం గమనించాడు పరశురాం. గడప ముందొక కాలువ. దానిమీదొక బండ అడ్డంగా వేసి ఉంది.

విశ్వం భార్య మీనాక్షి తలుపు తీసింది. లోపల కొద్దిగా బయట స్థలం, బావి ఉన్నాయి, తర్వాత చిన్న వసారా, దాన్నానుకుని రెండు గదులూను, అంతే ఇల్లు. పల్లెలో పెద్ద ఇళ్లు చూసిన అలవాటు వల్ల, చిన్నపిల్లలు ఆడుకునే బొమ్మరిళ్లలాగా కనిపించాయి పరశురాంకి ఆ గదులు.

విశ్వం కాలేజీలో చదివేటప్పుడున్న గది స్వంత దారుడి కూతురు మీనాక్షి. అప్పుడయిన పరిచయమే స్నేహంగామారి పెళ్లి చేసుకున్నారు.

తెల్లారే ఎర్రంచు నేతచీరె కట్టి, తల్లో ఒకే ఎర్రమందారం, ముఖాన ఎర్రటి బొట్టుతో కన్పించిన మీనాక్షి, ఏ దేవతలాగానో కనిపించింది పరశురాం కళ్లకి. అతనికి తెలియకుండానే ఆమె పట్ల గౌరవం ఏర్పడింది. 'వదినా'అని పిలవటం అప్పట్నించే ఆరంభించాడు. ఆవేశమేగాని, ఆలోచించే ఓర్పులేని విశ్వానికి కుదురుగా ఉండటం ఈవిడే నేర్పి ఉంటుంది అనుకున్నాడు మనసులో

''ఇదుగో మీనా, మా పరుశురాం వచ్చేశాడు. ఇకనుంచీ మనతోనే ఉంటాడు'' అన్న విశ్వం మాటలకి ఆమె ఆశ్చర్యపోలేదు. అతన్ని గురించి ముందుగానే తెలిసిన దానిలా చిరునవ్వుతో ఆహ్వానించింది.

బావిలో నీళ్లు తోడుకుని, ఇద్దరూ ముఖాలు కడుక్కుని స్నానాలు చేశారు. పరశురాంకి తనవే ఒక జత దుస్తులు ఇచ్చాడు విశ్వం. ఇంతదాకా అడ్డపంచే, అరచేతుల చొక్కా వేయటమే అలవాటు పరశురాంకి. ఇప్పుడీ పేంటూ, చొక్కా వేసుకోవాలంటే మొహమాటంగా ఉంది. అయినా''పరవాలేదు వేసుకోరా. ఇక్కడ నువేదయినా ఉద్యోగం చేయాలంటే ఈ

### చిరంజీవ

నిర్జీవమైన కాగితాలకు
జీవం తెప్పించడానికై
జరిగే
భగీరథ ప్రయత్నంలో
కాగితాలకే నోరొచ్చి
ఒక్కసారి తుమ్మితే...
యిచ్చేవారేమనుకున్నా
పుచ్చుకునేవారు మాత్రం
వెంటనే అనేదీ...
''చిరంజీవ !''

— సూరజ్ ప్రసాద్

డ్రస్ తప్పనిసరి'' అని విశ్వం బలవంతంగా వేయించాడు.

మూడు గ్లాసుల్లో చిక్కని కాఫీ చేసి తెచ్చింది మీనాక్షి. ముగ్గురూ తలొక గ్లాసు పుచ్చుకుని, గడపనానుకుని, ఉన్న మెట్ల మీద కూర్చున్నారు. ఊర్లో జరిగిన విషయాలన్నీ మీనాక్షి, విశ్వానికి వివరిస్తూ ఉంటే, పరశురాం తనూ వింటున్నాడు. ఆ మాటలని బట్టే, వాళ్లిద్దరూ ఎంతో అన్యోన్యంగా దాపరికాలు లేకుండా ఉంటారని గ్రహించుకున్నాడు.

పరుశురాంకి ఎప్పుడో చెల్లెలి పుణ్యమా అని అరగ్లాసు పాలు త్రాగటమే కానీ, కాఫీని రుచి చూడటం ఇదే మొదలు. మొదట కొంచెం చేదుగా అనిపించినా, గ్లాసు మొత్తం ఖాళీ అయేసరికి, కొత్త శక్తి ఏదో వచ్చి హుషారుగా అనిపించింది.

''కాఫీ బాగుంది వదినా'' అన్నాడు మన స్ఫూర్తిగానే. ''ఇదే ముందిరా. నేనింతకన్నా బ్రహ్మాండంగా చేయగలను.'' అని తేల్చేశాడు విశ్వం.

నిజానికి విశ్వం పోదాం రమ్మని అనగానే బయలుదేరి వచ్చేశాడు గానీ లోలోపల భయమే, ఇక్కడ విశ్వం భార్య ఏమనుకుంటుందో అని, తమ స్నేహాన్ని అర్థం చేసుకుంటుందో లేదో అనీ. మరో దారింకేదీ లేక ఏమయినా సరే వచ్చేశాడు.

కానీ మీనాక్షిని చూసాక తన భయాలకి అర్థం లేదని గ్రహించాడు. తన స్వంత అన్నా వదినెలలాగునే ప్రవర్తిస్తూ, తనని తమలో ఒకడుగా కలుపుకున్న వారిద్దరి అప్యాయతకి అతని మనసు ఆర్ద్రం అయింది.

అటు మీనాక్షి పుట్టింటివారికి దూరమయి, అత్తింటి వారి ముఖమే చూడక, రెండేళ్ళుగా మొఖం మొత్తి ఉందేమో, పరుశురాంని చూడ గానే, ఆమె మనసు తేలిక పడినట్లయింది. దాదాపుగా తన వయసే ఉన్నా, అమాయకంగా కనిపించే అతను, తనకన్నా చిన్నవాడు అని పించింది. అతన్ని పూర్తి పేరు పెట్టి పిలిచేది. ఇంత వరకూ పరుశురాంని అట్లా పిలిచిన వారెవరూ లేరు.

## 9

విశ్వం పనిచేసే ప్రింటింగ్ ప్రెస్, కూర గాయల మార్కెట్ అవతలవీధిలో ఉంది. జీతం అరవయిరూపాయలు. ప్రెస్‌యజమాని గుండూ రావు గొప్ప దేశభక్తుడు. స్వలాభం మానుకుని, స్వాతంత్రోద్యమానికి ఉపయోగించే ఎన్నో కర పత్రాలు, సావనీర్‌లు తన ప్రెస్‌లో అచ్చు వేశాడు. అలా ఉద్యమంలోపాల్గొన్న అబ్బాయిల్లో కాస్త చురుకుగా కనిపించిన విశ్వమూర్తి మీదొక మంచి అభిప్రాయం ఏర్పడింది. అందుకే అతను అనంతపురం నుంచీ వచ్చి తన పరిస్థితి వివరించు కున్నప్పుడు, అతని అవసరాన్ని అర్థం చేసుకుని,







# బైద్యనాధ్

# చ్యవన్‌ప్రాశ్ స్పెషల్

- శరీర కండరములను బలపరుచును. శక్తివంతముగా చేయును.
- శరీరమునకు శక్తిని ప్రసాదించి రోగ క్షమతను కలుగచేసి, పునరుజ్జీవనము కలుగ చేయును.
- దగ్గు, జలుబు మొదలగు శ్వాసకోశ వ్యాధులనుండి కాపాడును.
- పాండు, మరియు కాల్షియం తగ్గుదలలో అత్యంత ప్రయోజనకారిగా నుండును.
- సహజమైన వనమూలికలచే తయారు చేయబడి నందున సులభముగా జీర్ణమగును.




**Baidyanath :** WORLD'S NO. 1 AYURVEDIC CO.

INTRMARK·CHS 51T

తన ప్రెస్‌లో ఉద్యోగం ఇచ్చి, స్వంత ఖర్చుతో పెళ్ళి కూడా చేశాడు.

విశ్వం పరశురాంని నేరుగా ఆయన దగ్గరికే తీసుకుని వెళ్ళాడు.

"వీడు నా మిత్రుడు బాబూ, పేరు పరుశురాం" అని పరిచయం చేయగానే, రెండు చేతులెత్తి నమస్కారం చేశాడు పరశురాం. ఆయన్ని అందరూ 'బాబూ' అని పిలుస్తారు.

ఖద్దరు బట్టల్లో ఆజానుబాహుడయిన ఆ పెద్దమనిషిని చూడగానే, గాంధీగారిని చూసినంత సంతోషం అయింది పరుశురాంకి.

"స్నేహితుడు అనటమేగానీ, తమ్ముడితో సమానమే లెండి. వీడికెవరూలేరు. ఎస్సెల్సీదాకా చదూకున్నాడు. సొంతంగా బ్రతుకు తెరువు చూసుకోవాలని నాతో వచ్చాడు. మీరేమయినా సహాయం చేస్తారేమోనని..."

ఆయన నములుతున్న కారా కిళ్ళీ వరండా అవతల ఉమ్మేసి వచ్చి కూచుని పరశురాంని పరకాయించి చూశాడు. "పరవాలేదు. పల్లెటూరివాడయినా, ముఖంలో చురుకుతనముంది" అనుకున్నాడు తనలో తనే.

"బ్రాహ్మలా ?"

"కాదండి, నాయుళ్ళు"

'ఉహు, మా కులమే నన్నమాట' తల పంకించాడు. వయసులో ఉన్న కుర్రవాళ్ళని చూస్తే, తన కూతురు గుర్తొస్తుంది ఆయనకి. ఆ అమ్మాయికి ఒక కాలు వంకర. ఈ పిల్లనెవరు చేసుకుంటారో, ఎట్లా పెళ్ళి చేయాలో అని ఆయన దిగులు.

ఆయన చెప్పే మాటకోసం చూస్తూ, విశ్వం, పరశురాం పిట్టగోడ నానుకుని నిలుచుని ఉన్నారు. ఆయన సింహాసనం లాంటి ఒక పాత పడక కుర్చీలో కూర్చుని ఉన్నాడు.

"నిదానంగా ఆలోచిద్దాంలే. ప్రస్తుతానికి ప్రెస్‌కి వస్తూ ఉండమను. ఏదయినా పని నేర్చుకుంటాడు."

తృప్తిగా గాలి పీల్చుకున్నాడు విశ్వం. 'ఫరవాలేదు, ప్రెస్‌లో పని నేర్చుకోమన్నాడంటే, వీడి మీద మంచి అభిప్రాయమే ఏర్పడిందన్నమాట,' అనుకున్నాడు.

"మీ అమ్మకి బాగాలేదని వెళ్ళావు గదా. ఎట్లాగుందిప్పుడు ?"

"మా అమ్మ పోయారు బాబూ !" తల వంచుకుని అన్నాడు విశ్వం.

"అయ్యోపాపం. అయితే అక్కడ మీ నానొక్కడే నన్నమాట...నువేమో ఆదర్శవాదివి. కోరుకున్న అమ్మాయిని పెళ్ళి చేసుకుంటివి. కులం పట్టుకుని ప్రాకులాడే పెద్దాళ్ళకి ఇలాంటివి నచ్చవు మరి."

మిత్రులిద్దరూ అక్కడి నించీ ప్రెస్‌కి వెళ్ళారు.

*　　　*　　　*

గుండూరావుగారి ప్రెస్ మూడు గదుల్లో ఉంది. ఒక గదిలో కంపోజింగ్ చేస్తారు. మరో గదిలో ప్రెస్ ఉంది. రోడ్డునానుకుని ఉన్న మూడో గదిలో, పేపర్ కటింగ్, బైండింగ్ చేస్తారు.

మామూలుగా ప్రెస్‌కి, పెళ్ళి పత్రికలు, ఇతర విధాల ఆహ్వాన పత్రికలు, ఇంకా సర్కారు ఆఫీసులో ఉపయోగించే అకౌంటు పుస్తకాలు, రిజిస్టర్లు, ఆర్డర్స్ వస్తుంటాయి. ఇవికాక ఎక్సర్‌సైజ్ నోట్ బుక్‌లు తయారు చేసి వీళ్ళే పుస్తకాల అంగళ్ళకి విక్రయిస్తారు. గుండూరావు ప్రతీరోజు ఏదో ఒక సమయంలో వచ్చి కొంచెంసేపు ఉంటాడు ప్రెస్‌లో. ఆయనకింకా వేరే ఏవో వ్యాపారాలున్నాయని అనుకుంటారు అంతా.

వచ్చిన ఆర్డర్స్ బుక్ చేయటం, 'కాపీ' తయారు చేయటం, ప్రూఫ్ రీడింగ్ చేయటం, ఇవీ విశ్వం చేసే పనులు. అక్కడ పని చేసేవారిలో బాగా చదువుకున్నవాడు ఇతనొక్కడే.

పరశురాం మూడు నెలలపాటు కంపోజింగ్ నేర్చుకున్నాడు. 'కాపీ'ని చూసి, ఒక్కో అక్షరాన్నే, 'గ్యాలీ' అనే ఒక రకమయిన ట్రేలో అమర్చటం, అతనికి చాలా విచిత్రంగానూ, ఆసక్తిగానూ ఉండేది. రానురాను వేగంగా కంపోజ్ చేయటం

వచ్చింది. ప్రెస్ పనిచేస్తున్న శబ్దం, అతనికి వీనుల విందుగా ఉండేది. ఎన్నిగంటలసేపు పని చేసినా, అలుపు అనిపించేదికాదు.

పని కొంచెం తక్కువగా ఉన్నప్పుడు, తిరుగుతున్న ప్రెస్ చక్రాల వయపు చూస్తూ ఉండిపోయేవాడు. 'ఈ చక్రాల కెంత శక్తి ఉన్నదీ ?' అనుకునేవాడు. 'ఇందులో అచ్చు అయే ప్రతీ అక్షరమూ, వాక్యమూ ఎంతమంది చేత చదవబడుతాయో, ఎంతమందికి ఎన్ని సందేశాలనిస్తాయో' అని తలపోసేవాడు. అతని కెందుకో, తన జీవితం ఈ ప్రెస్‌తోనే ముడిపడి ఉందని అనిపించేది.

కంపోజర్ ఒకతను మరో ఉద్యోగం దొరికి మహబూబ్‌నగర్ వెళ్ళిపోవటంతో పరశురాంకి ఉద్యోగావకాశం ఏర్పడింది. నెలకి ఇరవయి రూపాయలు జీతం నిర్ణయిం. డు గుండూరావు. అదెంత తక్కువో విశ్వానికి తెలుసు. కానీ ఆయన మీదే నమ్మకం, ఆశ పెట్టుకున్నాడు అతను. అందుకే మారుమాట్లాడకుండా ఉండిపోయాడు. పరశురాంలో ఉన్న కష్టించి పనిచేసే తత్వమూ, శ్రద్ధా, నిదానమీద ఆయనకే తెలుస్తుందిలే అని సరిపెట్టుకున్నాడు.

పరశురాంకి రోజులు సుఖంగా జరిగి పోతున్నాయి. మొదటి తారీఖున అందుకున్న ఇరవయి రూపాయలు తెచ్చి మీనాక్షిచేతి కిచ్చేస్తాడు. మొదటిసారి అట్లా తీసుకుందుకు కోపగించుకుంది ఆమె.

"మేము నిన్ను పరాయివాడిలా అనుకోలేదు పరశురాం. ఆయనకే ఒక తమ్ముడుంటే మాతోనే ఉండేవాడు కదూ ?"

"అట్లా అనుకోవాలనే నా ఇష్టంకూడా. మరదిగానే నా సంపాదన తెచ్చి మీకిస్తున్నాను వదినా. ఇది మీ అభిమానానికీ, ఆప్యాయతకీ కట్టిన ఖరీదు మాత్రంకాదు. నాకేమయినా కావాలంటే అడిగి తీసుకుంటానుకదా ?" అని సర్దిచెప్పాడు పరశురాం.

పెళ్ళికి ముందు మీనాక్షి మాంసాహారే అయినా, విశ్వంని చేసుకున్నాక తన అలవాటు మానుకుంది. కానీ విశ్వం సలహామీద, పరశురాంకి మాత్రం అప్పుడప్పుడూ ఏ కోడి మాంసమో వండిపెట్టేది.

ఉదయం వేడివేడిగా భోజనం చేసి మిత్రులిద్దరూ ప్రెస్‌కి వెళతారు. ఇల్లు చేరటం తిరిగి సాయంత్రం అయిదున్నరకే. మధ్యాన్నం కొంచెం తీరుబాటు అయినప్పుడు, వెంట తీసుకెళ్ళిన పెరుగన్నమో, జొన్నరొట్టో, పచ్చడితో తినేస్తారు.

కడుపునిండా తిని, కంటినిండా నిద్రపోగలటం, ఏ చీకూ చింతాలేని జీవితం, ఆనందంగా ఉంది పరశురాంకి. తనింతకు మునుపు ఎరుగని స్వేచ్ఛ అనేది మనిషి జీవితానికి, మానసిక వికాసానికి ఎంత అవసరమో అతనికిప్పుడే అర్థం అవుతోంది.

అయితే ఇలా జరిగిపోతేచాలునని సంతృప్తిగా లేదు అతనికి. ఇంకా ఏదో చెయ్యాలి, ఏదో విధంగా డబ్బు సంపాదించాలి అనిపిస్తుంది. విశ్వం వెంట సాయంత్రాలు లైబ్రరీకి వెళ్ళటం అలవాటు అయింది. కానీ విశ్వంలా పెద్ద పుస్తకాలు చదివే ఓపిక తనకి లేదు. రోజూ ఒక దినపత్రిక చదవటం మాత్రం అలవాటు చేసుకున్నాడు.

విశ్వం ప్రయివేటుగా బియ్యే చదువుతున్నాడు. రాత్రుళ్ళు చాలాసేపు పుస్తకాలు ముందేసుకుని శ్రద్ధగా చదువుతాడు. అతనికి బియ్యే అవుతే, ఏ హైస్కూల్లోనో టీచర్‌గా ఉద్యోగం సంపాదించుకోవాలని ఉంది.

పరశురాం కీవిధమయిన ఆసక్తి ఏమీ లేదు. ఎప్పుడో పరీక్షలు, పుస్తకాలు పక్కకి నెట్టేసిన తనకి, మళ్ళీ చదువు మొదలుపెట్టటం ఇష్టం లేదు.

* * *

పరశురాం ఈ మధ్య సినిమాలు ఎక్కువగా చూస్తున్నాడు, తనకీ పొద్దుపోతుంది. ఇంట్లో భార్యాభర్తలకీ కాస్త ఫ్రీగాను ఉంటుందని.

రాత్రి పదిగంటల సమయం. సినిమానుంచి ఇంటికి వస్తున్నాడు. వీధిలో ఒక ముసలాయన, నిచ్చెనమీద ఎక్కి, గోడలకి సినిమా పోస్టర్లు అతికిస్తూ కనిపించాడు. వెంటనే ఒక ఊహ వచ్చింది పరశురాంకి.

మరుసటి రోజు సాయంత్రం చాంద్ సినిమాటాకీస్‌కి వెళ్ళాడు. ఊళ్ళోఉన్న మూడు సినిమాటాకీసుల్లో అది ఒకటి. మేనేజర్‌ని కలుసుకుని తనక్కావలసిన వివరాలన్నీ తెలుసుకున్నాడు. సాయంత్రం ఏడింటికి పోస్టర్లు ఇస్తారు. రోజుకు ఒక మనిషికి ముప్పయికి మించి ఇవ్వరు. పని మాత్రం వారానికి మూడు రోజులే ఉంటుంది. ప్రతీ ఆదివారం సినిమా మారుస్తారు. శుక్ర, శని, ఆదివారాల్లో కొత్త పోస్టర్లు అతికించే పని ఉంటుంది. పది పోస్టర్లకి నాలుగణాల చొప్పున ఇస్తారు.

ఆ వేళ శుక్రవారం. పోస్టర్లు తీసుకుని పని మొదలు పెట్టాడు. రాత్రి పది గంటలకి ఇల్లు చేరుకున్నాడు. "ఏరా చెప్పకుండా సినిమాకి వెళ్ళేవా ? ఇంతసేపూ నీ కోసం చూసి ఇప్పుడే భోంచేశాం" అన్నాడు విశ్వం.

అన్నం తిన్న తర్వాత నెమ్మదిగా అసలు విషయం బయటపెట్టాడు పరశురాం. "ఏదో పని చేసి డబ్బు సంపాదిస్తానంటే వద్దని ఎవరంటారు ? కానీ నీ ఆరోగ్యం జాగ్రత్తరా రామూ. రోజంతా ప్రెస్‌లో పనిచేసి, మళ్ళీ సాయంత్రం పనులు పెట్టుకుంటే నీ ఆరోగ్యం ఏం కాను !"

"పోనిద్దూ. ఇదేం ఉద్యోగమా ? ఇష్టం ఉన్నరోజు చెయ్యొచ్చు. లేనిరోజు మానెయ్యొచ్చు. ఓపిక లేనిరోజు మానేస్తాను, వారానికి మూడు రోజులే అదయినా," అని సర్ది చెప్పాడు పరశురాం.

అతనికోసం, మీనాక్షి ఒక హుండీ కొని తెచ్చిపెట్టింది.

## 10

వారానికి మూడు సాయంత్రాలు పని చేయటం అలవాటు అయిన తర్వాత, మిగతా నాలుగు రోజులు విసుగ్గా ఉంది పరశురాంకి. ఏం పని కల్పించుకోవాలో తోచకుండా ఉంది.

# గోరంత దీపం

ప్రతీ ఆదివారం ప్రెస్‌కి సెలవు. ఆరోజు ఉదయం నుండీ మధ్యాహ్నందాకా చాలా మటుకు విశ్వం లైబ్రరీలో గడిపేస్తాడు. ఆ సమయంలో ఊళ్ళో రోడ్లన్నీ సర్వేచేయటమే పరశురాం పని. ఊరంతా కొట్టినపిండి అయిపోయింది. ఏమూల ఏం జరుగుతూ ఉందో, ఏ వస్తువు ఎక్కడ సులభంగా దొరుకుతుందో బాగా తెలుసు. తిరగటం కూడా బోర్ అనిపించిన రోజు తుంగభద్ర ఒడ్డునున్న సాయిబాబా దేవాలయానికి వెళ్ళి కూచునేవాడు.

బాబాకు దండం పెట్టుకుని, మెట్ల మీద కూర్చుని ప్రసాదం తినేసి, నీళ్ళు తాగి నది వయిపుగా ఉన్న గేటు దాటి అవతలున్న మెట్ల వయిపు వెళ్ళేవాడు. అక్కడ ఇసుకలో, నీళ్లకి దగ్గరగా కూచుంటే మనసంతా, ప్రశాంతంగా ఉన్నట్లు తోచేది. ఆ భావనే అతన్ని మళ్ళీ మళ్ళీ అక్కడికి రప్పించేది.

తుంగభద్ర కర్నూలు ప్రాంతానికి జీవం పోసే తల్లి లాంటిది. ఈ జీవనది నీళ్లతో తమ దాహం తీర్చుకుని, తమ భూముల్ని సస్యశ్యామలం చేసుకుంటున్న ఇక్కడి వారెంత అదృష్టవంతులో—అనుకునేవాడు పరశురాం. నదికవతలి ఒడ్డున చిన్న పల్లె ఏదో ఉంది. అక్కడంతా బెస్తవాళ్లుంటారు. వారివే కొన్ని పెద్దసైజు వెదురు తట్టల్లా కనిపించే 'ఆరిగోల'లు అటూ ఇటూ తిరుగుతూ ఉంటాయి.

పరశురాం ఒకసారి మొదటి సారిగా జెవ్వాలు తేవలసి వచ్చింది. విశ్వం ఎప్పుడూ కొనే పెద్ద అంగడి ఏదో తనకి తెలుసు. సంచీలు తీసుకుని నేరుగా అక్కడికే వెళ్లాడు. జనం ఎక్కువగా ఉండటంవల్ల కాస్సేపు కాచుకోవలసి వచ్చింది.

---

ప్రాచ్యభాషా పట్టభద్రుల రాష్ట్రీ సంఘం తృతీయ వార్షికోత్సవ సమావేశంలో ప్రత్యేక సంచికని ఆవిష్కరిస్తున్న శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ, అధ్యక్షత వహించిన శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య, సంఘం కార్యదర్శి శ్రీ ఎన్.వి.ఎస్. చలపతిరావులని చిత్రంలో చూడవచ్చు.



ఆ సమయంలో అక్కడున్న రకరకాల ధాన్యాల మీదికి దృష్టి మళ్లింది.

గోధుమపిండి చపాతీలకు, రవ్వ ఉప్మాకు ఎక్కువగా ఉపయోగిస్తారు. కానీ అప్పట్లో పిండి, రవ్వ అమ్మేవారుకాదు. ప్రతీ ఒక్కరూ గోధుమలు కొని ఇంట్లో తయారు చేసుకోవలసిందే.

జెవ్వాలు కొనటం అయింది. అంతా లెక్క సరిచూసి డబ్బిస్తూ షావుకారుని అడిగేడు పరశురాం. "గోధుమపిండి, రవ్వ చేయించి అమ్మిన బాగా కొంటారు కదండి" అని.

"బాగానే కొంటారు. కానీ మళ్లీ ఆ మిషనుకు పట్టించే పనంతా మాకెందుకయ్యా బాబూ, ఇట్లాగే అమ్ముడయిపోతుంటే. పెద్ద పెద్ద సిటీల్లో అయితే అలా అమ్ముతారట" అని పెదవి విరిచాడు అతను.

దారి వెంబడి ఆ మాటలే తలచుకొని ఆలోచిస్తూ ఉన్నాడు పరశురాం. గోధుమల్ని హోల్‌సేల్ దుకాణంలోగానీ, రైతుల దగ్గర కాని కొని మిషనుకి పట్టించి, అంగళ్లకి అమ్మి లాభం చేసుకోవచ్చు. బాగానే ఉంటుంది. ఆ పని తనూ చేయలేడూ? ఒక రోజంతా ఆలోచించుకుని విశ్వంతో చెప్పాడు.

"ఆలోచన బాగుంది కానీ, కొంత మాట సహాయం, ధన సహాయం అవసరం అవుతాయి. మనకీ ఊళ్ళో ఆ మాత్రపు సహాయం చేయగలవారు గుండూరావుగారొక్కరే. ఆయన్నే అడిగి చూద్దాం" అన్నాడు విశ్వం.

"నా దగ్గరొక వంద రూపాయల దాకా ఉంది."

"ఇంకా చాలా కావలసొస్తుందిరా. వ్యాపారం అంటే ఏమనుకున్నావు? ముందుగా నువ్వో సైకిలు కొనుక్కో. కొంత శ్రమ తప్పి, అవసరానికి ఉపయోగిస్తుంది."

ఇద్దరూ కలిసి గుండూరావు ఇంటికి బయలుదేశారు.

నిండా పద్దెనిమిదేళ్ళులేని పరుశురాం ఆలోచనా సరళికి గుండూరావు ఆశ్చర్యపోయాడు. 'మంచి వ్యాపారస్తుడయే లక్షణాలున్నాయి కుర్రవాడిలో' అనుకున్నాడు. విశ్వం కోరిన విధంగా పరుశురాంకి మూడువందలు అప్పుగా ఇచ్చాడు. తన పలుకుబడి ఉపయోగించి, పరుశురాం దగ్గర రవ్వ, పిండి కొనేందుకు కొందరు పచారీ అంగళ్ళ వాళ్ళను అంగీకరింపజేసేందుకు ఒప్పుకున్నాడు.

ఆదివారం కొత్త సైకిలేసుకుని, అయిదు మైళ్ళ దూరంలో ఉన్న ఒక పల్లెకి బయలుదేరాడు. రైతుల ఇళ్ళలో అయిదు బస్తాల గోధుమలుకొని తెచ్చి ఇంట్లో వేయించాడు అయిదింటినీ సైకిల్‌మీద వేసేందుకు అనువుగా పది అరబస్తాలు చేసుకున్నాడు. ఒక్కొక్కటీ మిషనుకి చేర్చి ఆడించాడు. అంతా అయిన తర్వాత మీనాక్షి సహాయంతో, అంతా జల్లించి, పిండి, రెండు రకాల రవ్వ వేరుచేసి ఉంచుకున్నాడు. అంతటినీ ముందుగా మాట్లాడి ఉంచుకున్న అంగళ్ళకీ వారు కోరిన విధంగా చేరవేశాడు. మొత్తం మీద అన్ని ఖర్చులూ పోను, బస్తా మీద అయిదు రూపాయలు లాభం తేలింది. మూడు నెలలదాకా స్వంతసైకిలునే ఉపయోగిస్తూ, బళ్ళబాడుగలు, కూలీల ఖర్చులు ఎక్కువ కాకుండా చూసుకున్నాడు. నాలుగోనెలలో గుండూరావుగారి అప్పు తీరిపోయింది.

ఒకసారి సాయిబాబా టాకీసులో వచ్చిన సినిమావి పోస్టర్లు రాలేదు. ఇలా అవటం ఇదేం కొత్తకాదు. అప్పుడప్పుడూ జరుగుతోనే ఉంటుంది. అలాంటప్పుడు ఊర్లో అక్కడక్కడా కొన్నిచోట్ల గోడలమీద సినిమా వివరాలు, ఏ నీలి రంగులోనో వ్రాయించేవారు. ఈ పనికి మామూలుగా పోస్టర్స్ అంటించే కూలీకి రెండింతలు కూలీ ఇవ్వాల్సి ఉంటుంది. పరుశురాంకీపద్ధతేమీ నచ్చలేదు. ఇందులో ఒక ఇబ్బంది కూడా ఉంది. పోస్టర్లు అయితే పాతబడినవి చింపేసి, కొత్తవి అంటిస్తుంటారు. గోడలమీద రాసిన అక్షరాలు ఆయా గోడలనే వికారంగా మార్చటమే కాకుండా, వాటిని చెరపటం సులభంగా వీలయేది కాదు.

అందుకొక ఆలోచన చేశాడు పరుశురాం. ఎన్నో సినిమాలవి పోస్టర్లు మిగిలిపోతుంటాయి. వాటి వెనకాల శుభ్రంగానే ఉంటుంది. వ్రాయవలసిన అక్షరాలని చెక్క అచ్చులతో వాటి మీద ముద్రిస్తే చక్కగా ఉంటుంది. గోడలమీద వ్రాయటం కన్నా ఇది సులభం కూడాను. ఈ పనే తనే చేపట్టాలనుకున్నాడు. 'రాధాకృష్ణ' టాకీస్ మానేజర్ని సంప్రదించాడు.

"మళ్ళీ ఈ గొడవ ఎందుకులేవయ్యా. ఏదో విధంగా పని జరిగిపోతోంది కదా?" అని చప్పరించేశాడాయన.

అంతటితో వదల్లేదు పరశురాం. ఎన్నో విధాలుగా అందులో ఉన్న ఉపయోగాలని వివరించి చెప్పాడు. "మీకెక్కువ ఖర్చు అవకుండా నేను తయారు చేసి ఇస్తాను" అని చెప్పి ఒప్పించాడు.

కావలసిన బ్లాకులు, ట్రేలు కార్పెంటర్‌తో చేయించుకున్నాడు. కానీ అవన్నీ ఉంచుకుని అచ్చు పని చేసేందుకు కొంత స్థలం కావాలి. ఇప్పటికే ఇంట్లో తన గోధుమ బస్తాలతో చాలా ఇరుకుగా అయింది. ఇంకా ఈ పనీ అక్కడే చేయటం సాధ్యం కాదు. 'పోనీ ప్రెస్ మూసేసిన తర్వాత అక్కడే చేస్తే' అనిపించింది.

గుండూరావుగార్ని సంప్రదించాడు. ఆయన వ్యాపారస్తుడు. ఎవరికీ ఏదీ ఊరికే ఇవ్వడు. అందుకే ప్రెస్ గదులు, అక్కడ ఏ విధంగా అయినా పరశురాంకి అవసరం అయ్యే వస్తువులు, ఉపయోగించుకుందుకు రోజుకు ఇంత అని రేటు నిర్ణయం చేసి, ఒప్పుకున్నాడు.

ఎరుపు, నీలి ఇంకులు తయారు చేసి, పోస్టర్లు ప్రింటు చేశాడు, పరశురాం సినిమా టాకీసు వాళ్ళకి నచ్చాయి. మిగతా రెండు టాకీసుల వాళ్ళకీ విషయం తెలిసిపోయింది. దాంతో అప్పుడప్పుడు, ఏదో ఒక టాకీసువారి అచ్చుపని దొరుకుతూ ఉంది పరశురాంకి.

అతనికిప్పుడు చేతినిండా పని అయిపోయింది. సరి అయిన టయిముకి ఇల్లు చేరటం, నిద్ర, భోజనంకూడా కష్టం అయిపోయాయి. చాలా మటుకు, మీనాక్షినిబ్బంది పెట్టటం ఇష్టంలేక ఏ హోటల్లోనో భోంచేసి వెళుతున్నాడు, రాత్రులు ఆలస్యం అవుతే. ఇంట్లో వాళ్ళకి నిద్రాభంగం అవకుండా వసారాలోనే పడుకుని నిద్రపోయేవాడు.

తెల్లారిలేచి చూసిన మీనాక్షి, చలికి ముడుచుకుని అలసి నిద్రపోతున్న అతన్ని చూసి బాధపడి, ఒక దుప్పటితెచ్చి కప్పేది. కానీ ఇది అతనికేమీ కష్టంగాలేదు. భోజనంలో రుచీ, నిద్రలో సుఖంకన్నా, అతనికి క్షణం తీరిక లేకుండా కల్పించుకుని పనిచేయటమే ఆనందంగా ఉంది. పైగా మనిషిలో అలసట అన్నది మచ్చుకయినా కన్పించదు. ఎప్పుడూ ఉత్సాహంగా ఉంటాడు.




కర్నూలుకు వచ్చిన కొత్తలో పరశురాంకీ, ఇప్పటి అతని తీరుకీ చాలా తేడా ఉంది. మాసి నలిగిన బట్టలు, తీరుతెన్నులు లేని మూనూగు మీసాలు, గడ్డం, చూపుల్లో అమాయకత్వం — ఇవన్నీచూసి ఇతనీ ఊర్లో ఎలా నెట్టుకొస్తాడో అని భయపడింది మీనాక్షి. అతనిప్పుడు బ్రతుకులో ముందుకు వెళ్ళటం ఎలాగో ఆమెకే పాఠాలు నేర్పగల అనుభవం సంపాదించాడు.

త్వరగా ఇల్లు చేరిన ఏరోజయినా, పళ్ళు, స్వీట్లు తెస్తుంటాడు. కాస్త నదురుగా కన్పించిన బట్టలు కుట్టించి వేసుకుంటున్నాడు. ఒంటిమీద బట్టలతో మాత్రమే ఇక్కడికొచ్చిన పరశురాం ఇప్పుడు ప్రతీ ఉగాదికీ విశ్వంకీ, మీనాక్షికీ కొత్త బట్టలు కొని తేగల స్థితిని చేరుకున్నాడు.

వారిద్దరికీ ఇది చాలా సంతోషాన్ని కలిగిస్తోంది. స్వంత తమ్ముడే బాగుపడుతున్నంత సంతృప్తిగా ఉంది విశ్వమూర్తికి.

(ఇంకా వుంది)

# వ్యక్తిగతం



ఇయెరెమియా తబాయి వయసు 33. ఈయన కిరిబాతి అనే 33 ద్వీపాలదేశానికి అధ్యక్షుడు. కామన్వెల్తు దేశాల అధిపతులలో ఈయనకన్నా చిన్నవారు లేరు. కిరిబాతీ పసిఫిక్ మహాసముద్రంలో ఉంది ...

మాల్టాలో ప్రపంచం బిలియార్డ్స్ ఛాంపియన్ అయిన మయికేల్ ఫెరయిరా ...



సాతవాహనుడు వాశిష్ఠపుత్ర శాతకర్ణి (క్రి.శ. రెండవ శతాబ్దం) నాణెం ఒకదానిని ఢిల్లీలోని నేషనల్ మ్యూసియంలో ఇటీవలే ప్రదర్శించారు ...

డాల్మియాజెయిన్ కంపెనీల వ్యవహారాల విచారణ సంఘానికి అధ్యక్షుడుగా ఉండి పేరు పొందిన జస్టిస్ వివియన్ బోస్ తమ 92వ ఏట బెంగుళూరులో మరణించారు ...



ఫిలిప్పయిన్స్‌లో మిలిటరీ దుస్తులలో ఉన్న ఒక వ్యక్తి, ప్రతిపక్ష నాయకుడు సెనెటర్ బెనిగ్నో అక్వినోని హత్య చేశాడు — అని వార్తలు తెలిపాయి. ఆ హంతకుడిని సార్జెంట్ రోలాండ్ డిగుజ్ మాన్ కాల్చి చంపివేశాడుట. అసలు రహస్యాలు బయట పడకుండా ఉండేందుకే ఇలాగ చంపి ఉంటాడని కొందరి ఊహ. పయి బొమ్మ గుజ్ మాన్ కోర్టులో నుంచుని ఉన్నప్పుడు తీసినది ...




23–12–1983 శుక్రవారం మొదలు 29–12–1983 గురువారం వరకు

♈ మేషం: సానుకూలమయిందనుకొన్న వ్యవహారం మరలా ఎదురు తిరుగుతుంది. 'అశ్విని' వారికి విజయప్రదమైనవారం. ప్రకృతి విఘాతానికి గురియైన మీ స్థలాన్ని బాగు చేసికొంటారు. స్త్రీలకు: లాభించే వారం. ఆదాయం లభిస్తుంది. ఆరోగ్య లోపం లేదు.

♉ వృషభం: గ్రహించండి. అన్ని విధాలా మీకు మేలు సమకూరుతుంది. నటనా సామర్థ్యం గలవారికి, సంగీతంలో నేర్పరితనం గలవారికి, అధిక ఆదరణకు అవకాశమున్నది. నూతనాంశాలు గ్రహించుటకు అనువైన వారం. బంధు విరోధం, అధికారులతో భేదాభిప్రాయాలు రాగల సూచన ఉన్నది.

♊ మిధునం: వ్యాపారం చేయాలని, లాభార్జన గావించాలనీ ఉబలాటం, ఏం లాభం? ఇటీవల మీకు సంబంధించి వట్టి భూగృహాలు బాగా దెబ్బతిన్నాయిగదా! వాని విషయం పట్టించుకొనుటకు అనువైన వారం. పరుల మూలంగా ఎదురు చూచిన సహాయం చేకూరుతుంది. స్త్రీలకు: ఉద్యోగ యత్నాలు ఫలిస్తాయి.

♋ కర్కాటకం: విలువైన వస్తువులు సేకరించుకో గలుగుతారు. వ్యాపార నిమిత్తమో, వ్యవహార పరిష్కార నిమిత్తమో, విక్రయ సామానులు కొనుగోలు చేయుటకొరకో చాల మంది ప్రయాణించనున్నారు. సాటి వారితో పోటీ ఏర్పడే అవకాశమున్నది. స్త్రీలకు: వృత్తి ఉద్యోగంలో మేలు చేకూరుతుంది.

♌ సింహం: గమనించండి, మీరు ఎదురు చూచే సహాయం అందుతుంది. ద్రవ్యం కూడా చేతికి రానున్నది. విద్యా రంగంలో పరిశ్రమించే వారికి అనుకూలత చేకూరగల వారం. 'పుబ్బా' నక్షత్ర జాతకులు అధిక శుభాలనందుకొంటారు. స్త్రీలకు: విందు వినోదాలకు, నూతన వస్త్రాలంకరణకు అవకాశం గలవారం. అంతో యింతో చేతికి అందటం, అవసరాలు తీరటం గమనిస్తారు.

♍ కన్య: విలాస వస్తు సేకరణకు అవకాశమున్నది. వ్యాపారం సుకరంగా సాగిపోనున్నది. చాలమందికి ప్రయాణం చెప్ప అనువైన వారం. 'చిత్త' నక్షత్ర జాతకులకు అర్థ లాభం, ఆనందం, హాయి, మనశ్శాంతికి అవకాశమున్నది. స్త్రీలకు: ఉద్యోగంలో పెంపు, ఆదాయంలో అభివృద్ధి, మిత్ర వర్గీయుల సాయం లభించ గలవారం. గమనించి, శ్రమించాలి.

♎ తుల: ఏవో ఎత్తులు వేస్తారు. ఏదేదో సంకల్పిస్తారు. చివరకు ఏమో చేసారు. బంధు వర్గీయులకు మిత వర్గానికి, తుదకు సాటి వారికి విసుగు కలిగిస్తారు. మూర్ఖత, పట్టుదల వదలక పోతే యిబ్బంది కలుగుతుంది. ధనార్జన నిమిత్తమై శక్తి వంచన లేకుండా పాటు పడుతారు. స్త్రీలకు: అన్ని విధాలా సామాన్య ఫలితం సంభవం.

♏ వృశ్చికం: జాయింటు వ్యాపారం చేస్తున్నా, భారి వ్యాపారం చేస్తున్నా, గనుల సంబంధమైన వ్యాపారాన్ని చేపట్టినా, వెనక ముందులాలోచించి అడుగిడవలసిన వారం. సాటివారితో మనస్పర్థలు రావచ్చు, గమనించండి. స్త్రీలకు: నూతనాంశాలు గ్రహించటం, నూతనోద్యోగానుకూలత గల వారం.

♐ ధనుస్సు: అన్ని విధాలా, అన్ని రంగాలలో శ్రేయోదాయకమైన వారమే. అయినా ఒకానొక విషయంలో మీకు అగ్ని పరీక్ష తప్పదు. మీకు అనుకూలమని భావించిన వ్యవహారం వ్యతిరేకంగా పరిణమించ గలదు. స్త్రీలకు: శుభ ప్రస్తావనలు, ఆశించిన 'ప్రమోషన్' లభించుట వార విశేషం.

♑ మకరం: చతురమైన మాటలు, శ్రద్ధతో పని పాటలులు ముగించుకొనుట వలన సంఘ గౌరవం, ఒకవేళ సభా సత్కారానికి కూడా కొందరకు అవకాశమున్నది. వస్తు సేకరణకు 'ఉత్తరాషాఢ' జాతకులు ప్రయత్నించటం మంచిది, విక్రయ మూలకంగా లాభం సంపాదించ గలరు. స్త్రీలకు: ఉద్యోగంలో గాని, వృత్తి యందు గాని యిబ్బందులు తటస్థిస్తాయి. గమనించాలి.

♒ కుంభం: ఎంతో కాలం జాగ్రత్తగా కాపాడిన భూమి గాని, గృహం గాని దెబ్బతింటుంది. అందు మూలంగా యిబ్బందులను ఎదుర్కొంటారు. గమనించి మెలగాలి. చాలమందికి ప్రయాణానుకూలత చెప్పదగిన అంశం. స్త్రీలకు: శుభ వర్తమానం, సంతానం నిమిత్తమై చేసే ఉద్యోగ యత్నాలు ఫలిస్తాయి.

♓ మీనం: ఆదాయమున్నది. ఏమయినా అందుకు తగిన ఖర్చు కూడా లేకపోలేదు. చాల మంది ఎలాగైనా శుభ కార్య నిర్వహణకు యత్నిస్తారు, అనుకూలత నందనున్నారు. దీర్ఘ వ్యాధులు గల వారు శ్రద్ధ వహించటం ఎంతైనా అవసరం. స్త్రీలకు: విద్యా సంబంధమైన ఉద్యోగాలకు యత్నించినా, వ్యాపార సంస్థలందు యత్నించినా ఉద్యోగం చిక్కే అవకాశమున్నది.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి



కొండముది శ్రీరామచంద్రమూర్తి

# "అమ్మా.. నీపాలు చేదే!"

కన్నబిడ్డ ఆకలి తీర్చడం కోసం నాలుగు దిక్కులూ తిరిగి నాలుగు పరకలేరుకు వచ్చిన తల్లిపిట్ట గూటిలో కువ కువ లాడుతున్న పసిగుడ్డు నోటికి తన ముక్కుతో ఆహారాన్నం దిస్తూ, కడుపుతీపి అనుభవంలోకి వచ్చి అర మూతలుగా కళ్ళు మూసుకుంటున్నది.

యజమాని దయతలచి వదిలిన పాలనే తల్లి పొదుగును కుమ్మి కుమ్మి మరీ తాగుతోంది లేగ దూడ.

మేడమీద బాల్కనీలో కూచుని, ఒంటి చేత్తో ఉయ్యాల లాగుతున్న రజనికి ఆ రెండూ దృశ్యాలూ కనిపించి మనస్సులో ముల్లు గుచ్చు కున్నట్లైంది. హాల్లో వున్న ఉయ్యాల్లో తన కన్నబిడ్డ, కలల పంట, ఏడ్చి ఏడ్చి అలసిపోయి నిద్రపోతున్నాడు. ఆ పసివాడు ఏ క్షణాన్నైనా లేవొచ్చు. లేస్తాడంటేనే తనకు భయంగా ఉంది. ఏ తల్లికైనా అడ్డాల్లోవున్న పసివాడు అల్లనల్లన కళ్ళు తెరచి, బోసినోటితో నవ్వుతుంటే, కనిపించని స్వర్గం కాళ్ళ దగ్గరకు నడిచివచ్చి నట్లుంటుంది. కానీ తన బిడ్డకు మెళకువ వస్తే మాత్రం తనకు ప్రతిక్షణం నరకమే.

ఆ పసివెధవకు డబ్బాపాలు పడవు. ఆవు పాలు వేడి. గేదెపాలు వాతం. తనకూ వుంటుంది వాణ్ణి పయ్యెదచాటుకు తీసుకుని, రొమ్ము వందిం చాలని. ఆ పసివాడు కొన్ని తాగి, కొన్ని చుక్కలను పెదిమల చివరలనుండి కిందకు అల్లరిగా జారు స్తుంటే, మెల్లగా వాడి బుగ్గ గిల్లి ఆ తుంపరు లను తుడవాలని, వాడు తన బుల్లి పెదిమలతో తన రొమ్ము నదిమిపెడితే అణచుకోలేని చక్కిలి గింతలతో వాణ్ణి అమాంతం గుండెలకు హత్తుకో వాలని. కానీ ఏం లాభం? తనకా యోగం లేదు. వాడిది ఏడుపురాత. తనది పాలుపడని రొమ్ముల బాధ.

ఆ పసరుకాదని ఈ పసరూ, ఈ మందు కాదని ఆ మందూ తనచేత తినిపించింది తన









# అమ్మా! నీ పాలు చేదే!

అత్తగారు. ఉహూ, అయినా పాలు పడలేదు. తన కన్నబిడ్డ కడుపాకలి తీరలేదు. నిస్సహాయతతో, గుండె కోతతో, రజనికి తెలియకుండానే ఆమె కళ్ళనుండి కన్నీరు కిందకు కారసాగింది. అప్పుడే అక్కడికి వచ్చాడు రాజారాం. చప్పుడు చేయకుండా ఆమె దగ్గరకు నడిచాడు. మెల్లగా కర్చీఫ్‌తీసి ఆమె కన్నీరు తుడిచాడు. ఆమె ఉలిక్కిపడింది. భర్తను చూసి గభాలున లేచి నిలబడబోయింది. ఆమెను లేవకుండా రెండు భుజాల మీదా చేతులువేసి మెల్లగా నొక్కి కూర్చోపెడుతూ, ప్రేమగా అన్నాడు. "మన మధ్య మర్యాదలేవిటోయ్... ! కూచో... కూచో... కూచుని వాడు లేవకుండా చూడు. లేస్తే ఇహ ఇల్లుపీకి పందిరేస్తాడు."

"పాపం, వాడు మాత్రం ఏం చేస్తాడండీ? ఆకలికి తట్టుకోలేకపోతున్నాడు !"

రాజారాం చిరుకోపంతో అన్నాడు. "అంత ఆకలి అయినవాడు, ఏవో పాలు తాగి పొట్ట నింపుకోవచ్చుగా, నీ పాలకోసమే అంత అఘోరింపు దేనికి ?"

భర్తకోపంచూసి, అంత దుఃఖంలోనూ రజనికి నవ్వు వచ్చింది. "తల్లిపాలకోసం బిడ్డ తపనపడ్డంలో అఘోరింపేముందండీ. బిడ్డకు పాలిచ్చుకోలేని దురదృష్టం నాది ?" రాజారాం ఇంకా కోపంగానే ఉన్నాడు. "అదేం కాదు. ఈ రోజుల్లో అందరు బిడ్డలూ తల్లి పాలమీదనే బతుకుతున్నారేవిటీ ? ఏ పాలు దొరికితే ఆ పాలు తాగడం నేర్చుకోవాలిగాని !"

అతను బాల్కనీ చివరకువెళ్ళి నుంచుని సిగరెట్టు ముట్టించుకున్నాడు. వెన్నెల పసివాడి చిరునవ్వులా నిర్మలంగా, మనోహరంగా ఉంది. ఎక్కడో ఏ తల్లి పాడుతున్న జోలపాటో గాలిలో తేలివస్తో సర్వ ప్రకృతినీ ఆర్ద్ర పరుస్తోంది.

అంత ఎత్తుమీదినుంచి చూస్తే వీధికి అవతలగా ఖాళీస్థలంలో వున్న ఓ చుట్టుగుడిసె కనిపిస్తోంది. ఆ చుట్టు గుడిసె బీదగా ఉండి, పాతగా ఉంది. ఆ చుట్టు గుడిసె ముందు వయసులో ఉన్న వో ఆడపుట్టువు కూచునివుంది. ఆమె వొళ్ళో ఏడాది వయస్సున్న వో పాపవుంది. ఆ పాప కేరింతాలు కొడుతున్నది. ఆ కేరింతాలకు ఆ తల్లి మురిసిపోతున్నది. ఇంతలో ఆ పాప పాలకోసం మారాం చేయడం కనిపించింది. ఆ తల్లి ఆ పసిదాన్ని లాలనగా మరింతగా దగ్గరకు తీసుకుంది. పమిటకొంగు పక్కకు తప్పించింది. జారుముడిగా ఉన్న రవిక ముడి విప్పింది. తన వక్షానికి ఆ పసిదాన్ని హత్తుకుంటూ, ఓ చనుమొనను దాని బోసినోటి కందించింది.

అంత దూరంనుంచి కూడా రాజారాంకు కళకళలాడుతున్న ఆ తల్లి మొహం, ఆరోగ్యంగా ఉన్న ఆ బిడ్డరూపం, పొంగిన ఆ తల్లి పాలిండ్లు, ఆనందంగా కదులుతున్న పసిబిడ్డ పెదవులు కనిపించినట్లే అనిపించింది.

అతని మనసులో మెరపులా వో వూహ మెరిసింది. ఒకేవొక అంగలో భార్య రజని దగ్గరకు వచ్చాడు. చిలిపిగా ఆమె మొహంమీదకు గుప్పున సిగరెట్టుపొగ వదిలాడు. ఆమె ఉక్కిరిబిక్కిరయింది. రవ్వంత దగ్గుతూ, "ఏవిటండీ ఇది, అవతల పిల్లవాడు ఎక్కడ నిద్దర్లేస్తాడోనని నేను హడిలిచస్తుంటేను ... !" అన్నది చిరాకు పడుతూ.

"భయపడ్డాలూ, హడలిచావడాలూ ఇహ నీకేం అక్కర్లేదే బాలామణి !" విస్ఫారిత నేత్రాలతో, ఆశ్చర్యంగా రజని తన భర్తవంక చూసింది. "ఎందుకనీ ?"

"తనను గన్నతల్లి పాలుకాకున్నా, మరో అమ్మపాలు వాడికేర్పాటు చేస్తున్నా" అంటూ ఎదుటి గుడిసెముందు కూర్చున్న తల్లీ బిడ్డల్ని రాజారాం చూపించాడు.

"వాళ్ళా ?"

"ఏం ? వాళ్ళకేం ?"

"ఎవన్నా రోగాలూ గట్రా ఉంటయ్యేమోనండీ !"

"కాయకష్టం చేసుకు బతికేవాళ్ళు, మన కన్నా వాళ్ళే ఆరోగ్యంగా ఉంటారు. పైగా ఏ తల్లి పాలైనా సరే, అమృతంతో సమానం."

"తన బిడ్డక్కాకుండా, మన బిడ్డకు ఇస్తుందా ఆవిడ తన పాలను ?"

రాజారాం ఒక్కక్షణం మౌనంగా ఉండిపోయాడు. జీవిత రహస్యం తెలిసినవాడిలా అన్నాడు, "డబ్బు సాధించలేనిదంటూ ఏమీలేదు ఈ లోకంలో !"

"కన్నబిడ్డ నోటి కూడును ఏ తల్లీ డబ్బు కమ్ముకోదు." రజని నమ్మకంగా అన్నది. రాజారాం ఆమెతో వాదనకు దిగలేదు.

బిడ్డకు పాలిచ్చి నిద్రలోకి జోగుతుండడంతో, కుర్రదాన్ని భుజాన వేసుకుని లోపలకు వెళ్లడానికి సిద్ధమవుతుండగా, ఎదురుగా వో అయిదున్నరడుగుల ఆగంతుకుడొకడొచ్చి నిలబడ్డంతో రవంత తొట్రుపడి, అంతలో సర్దుకుంటూ "ఎవురు బాబూ తవరు. ఎవురు కావాలి తమకు ? " అన్నది రత్తాలు.

"నువ్వే ! "

"నానా !" రత్తాలు కళ్ళల్లో ఎర్రజీరలు. "ఏతనుకుంటున్నారేటి నన్ను ? బజారు మడిసి నమకున్నారేటి ? పిల్ల తల్లిని ! ! కనపట్టంలా ? ఎళ్లండెల్లండి, నా మొగుడొచ్చే ఏలయింది, ఆడి కసలే ముక్కుమీద కోపం ! " అంటూ లోపలకు వెళ్లిపోబోయింది.

వెనక్కు తిరిగిన రత్తాలు కొప్పులో ఎర్రని కనకాంబరాలు. నల్లగా నిగనిగలాడుతున్న ఆమె బలిష్టమైన శరీరం చుట్టూ ఎర్రని కోక.

"అది కాదమ్మా !" రాజారాంకు తనన్న మాటలోని పొరపాటు తెలిసివచ్చింది. "నేనందుకు

రాలేదు. నేనటువంటి వాణ్ని కానేకాదు. నీ పాల కోసం వచ్చాను !''

''నా పాలా ?'' ఈసారి రత్తాలు — దండతాడిత భుజంగమే అయింది. ''నానేం పాల వాపారం సేడంలేదు. ఎళ్లెళ్లు — వొంటరిగా వున్న ఆడదాన్ని ముగ్గులోకి దింపడానికి రకరకాల సాకులు !'' ఆమె మరో రెండడుగులు వెనక్కు వేసింది.

పరాయి స్త్రీ ముందు సరిగా మాట్లాడ్డం రాని తన చేతకానితనానికి తనను తనే లోలోపల తిట్టుకున్నాడు రాజారాం. ''అదిగాదమ్మా !'' ఒకసారి గొంతు సవరించుకున్నాడు. ''ఎదురింటి మేడలో, పై భాగంలో అద్దెకుంటున్నాంమేము.''

ఆమెలో ఏదో గుర్తుకు వచ్చిన సూచనగా కళ్లలో తెలిసినతనం. ''అట్టాగా ! మీ కుర్రాడే నేటి, పొద్దుగుంకులూ వోహాటేమైన ఏడుత్తుంటాడు ! ఆ గుంటణ్ని సవుదాయించడం సేత కాదేటి మీ ఆడదానికి ?''

''చేతకాక్కాదు, పాల్లేక !''

''ఆడదానొంటో పాల్లేకపోతే అదేం ఆడ కూతురు బాబూ ? పుట్టినోడికి పాలు కుడపక పోతే ఆడెట్టా బతుకుతాండంట ?''

''మా కుర్రవాణ్ని బ్రతికించమని అడగ డానికే ఇప్పుడు నీ దగ్గరకు వచ్చాను ?''

''మీ బుడ్డోణ్ని నేనెట్టా బతికిస్తానూ?''

''వాడికి పాల దానం చేసి...''

''అర్థం అయ్యేట్టు సెప్పండ సామీ !''

''మా అబ్బాయికి తల్లి పాలు తప్ప మరే పాలూ పడవు. నువ్వువాడికి పాలిస్తే...''

''మరి నా కూతురేం కావాలి ?'' వెంటనే అడిగింది రత్తాలు సూటిగా.

జవాబు చెప్పలేదు రాజారాం. కాసేపు ఉభయుల మధ్య నిశ్శబ్దం. చివరకు అతనే అన్నాడు.

''నీ ప్రశ్నకు నేను సమాధానం చెప్పలేను— కానీ, నువ్వు నాకు జేసే సహాయానికి నీకు ఎంత డబ్బు కావాలో చెప్పు, అంతా ఇస్తాను. ఆ డబ్బు పెట్టి నీ కూతురికి నువ్వు మంచి మంచి గౌన్లు కుట్టించొచ్చు, కాళ్ళకు వెండి పట్టాలు చేయించొచ్చు, మొలకు సిగ్గుబిళ్ళ కొని పెట్టొచ్చు, మెడలో బంగారు గొలుసు అలంక రించొచ్చు, చేతులకు గాజులు తొడిగించొచ్చు...''

''కానీ ఇయ్యన్నీ నా బిడ్డకు తల్లిపాలతో సమానమౌతయ్యా సామీ ? అది జరగని పని కానీ ఎళిపో సామీ ! ఎళిపో !''

రత్తాలు బిడ్డతోసహా లోపలికు వెళ్ళిపోయి తడిక తలుపు థడాలున వేసేసింది. ఆ తలుపును తన గుండెలమీదనే వేసి కొట్టినట్లనిపించింది రాజారాంకు. హతాశుడై, మ్రాన్పడి అట్టే నిలుచుండిపోయి, కొంతసేపయింతర్వాత మెల్లగా తెప్పరిల్లి కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి తిరిగి వచ్చేశాడు. రాజారాం అటు వెళ్ళాడో లేదో, ఇటు రత్తాలు మొగుడు, నిరాశగా మట్టు గుడిసె దగ్గరకు వచ్చి, గుమ్మం ముందు నిలబడి విసగటుగా, ''వుసేయ్ రత్తి, రత్తి !'' అంటూ పిలిచాడు.

''వత్తన్నా మావా !'' రత్తాలు వచ్చి తలుపు తీసింది. మొగుణ్ని ఆ స్థితిలో చూసి ఆశ్చర్యపడుతూ, ''రిక్షా ఏది మావా ?'' అని అడిగింది.

''బకాయి పూర్తిగా సెల్లిత్తే కాని, వోనరుగాడు బండి ఈనన్నాడే ?''

''అదేం పోయేకాలం ఆ దొంగసచ్చినోడికి ? వారం రోజులు బకాయికే బండి నాగేసు కోవానేటి ?''

''అదంతే మరి, ఆళ్ళోనర్లూ, మనం వర్కర్లూ ! సెవట మనదీ సుకం ఆళ్ళదీ !'' కన్న బిడ్డని చాపమీద పడుకోబెట్టి, కట్టుకున్న వాడికి వీపు రుద్ది వేణ్ణీళ్ళు పోసింది రత్తాలు. వేడివేడి గంజిలో కొరుక్కోడానికి వేయించిన చల్ల మిరపకాయలు పక్కన పెట్టింది. అతను మెల్లగా నడుం వాల్చింతర్వాత తల్లిగా పక్కన చేరి, తన పాలను ఖరీదు చేయడం కోసం వచ్చిన రాజారాం గురించి చెప్పింది. చివరిదాకా విన్న రత్తాలు మొగుడు చివాలున లేచి కూచుంటూ అడిగాడు ''నువ్వేవని సెప్పావ్ జవాబూ ?''

''అమ్మనని సెప్పాను !''

వాడామాట వినగానే చాచి బలంగా రత్తాలు చెంపమీద కొట్టాడు. ''ఏమన్నావ్ ?'' అంటూ అడిగాడు మరోసారి ధూర్తంగా.

''అమ్మ తల్లైవరూ కన్నబిడ్డకోసం వొంట్లో దాచుకున్న పాలమ్మదన్నాను.'' ఏడుస్తోంది రత్తాలు.

''థూత్— నీ సిగదరగ!'' వాడు కాండ్రించి మూలగా ఉమ్మేశాడు.

''మడిసి సెర్మానికి ఇలువనేదు. మడిసి పేణానికి ఇలువనేదు. మడిసి వొంటో వున్న పాలకిలువేవిటే ?...ఆడికేదో గతినేక ఇలవ కడతా నన్నాడు, వొడేసి నాక్కోక దర్మపన్నాలు సెప్తా వేటే— దర్మపన్నాలు ?!''

ఆ తర్వాత వాడు తనలో తను అనుకుంటు న్నట్టుగా పెద్దగా అన్నాడు. ''అడిగినంతిత్తా నన్నాడు కదా ఆ మారాజు — కావలసినంచుచ్చేసు కుంటే. అద్దె రిక్షా ఎందుకే — సొంత రిక్షాయే కొనుక్కోవచ్చు, నాను రిక్షా వోనర్నైతే, నువ్ ఓనరు పెళ్ళానివైపోతావ్ ! మన గుంతది రిక్షా వోనరు కూతురు— తెల్సిందా ? అప్పుడు మనకు సివాట్లూ, సెప్పుదెబ్బలూ ఉండవ్, వొంగి వొంగి దణ్ణాలెట్టక్కర్లేదు — మన కట్టం మనకే మిగులిద్ది. ఈయేటికి ఓ రిక్షా వుంటే, వచ్చే ఏటికి అది రెండు పిల్లల్ని పెట్టుద్ది — మూడో ఏటికి అది నాలుగు పిల్లల్ని పెట్టుద్ది. అర్థమైందా ఎర్రిమొగమా ! రేపొద్దున్న ఎల్లి, మనకెంత కావాలో అంతడుగు ఆళ్లను — మొమోటడక !''

భర్త మాటల్ని వెర్రిగా వింటోంది రత్తాలు. ఆమె మొహంలో పర్చుకుంటున్న నీడల్ని గమనించాడు రత్తాలు మొగుడు. ఆఖరుగా అన్నాడు. ''నాను సెప్పినట్టు సేత్తే నిన్ను నా గుండెల్లో ఎట్టుకుంతా! సెయ్కపోతే నీగుండెల్లో కుంపటెడతా !— నీ ఇట్టం !!''

మర్నాడు సూర్యుడు నిద్ర లేవకముందే నిద్ర లేచింది రత్తాలు. పిల్లవంక దిగులుగా



## గమనిక

పాఠకులు పడ్డ వంటలే పడితే "ఎప్పుడూ అవే వంటలా?" అంటారు. కనుక 'వంటలు' పంపేవారు ఓసారి పాత సంచికలు తిరగేసి అందులో లేనివి వ్రాసి పంపమని— సాధ్యమైనంత క్లుప్తంగా వ్రాయమని మనవి.

—సం.

## 'ఉత్తరాలు' శీర్షికకి రాసేవారు

తమపేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

—సంపాదకుడు.





చూసింది. తలమీద కొంగు తిప్పుకొని ఎదురు మేడవైపు నడిచింది.

ఆమె చెప్పిందంతా విన్నది రజని. "పాలిచ్చినందుకు వెయ్యి రూపాయలా?" అన్నది ఆశ్చర్యంగా.

"మీ అబ్బాయికి పాలిచ్చినందుక్కాదమ్మా! నా సిట్టితల్లికి పాలీనేక పోయినందుకు !!"

"అయితే ఒక షరతు. నువ్వు ఇరవైనాలుగ్గంటలూ మా అబ్బాయి దగ్గరే ఉండిపోవాలి, పాపం, వాడికెప్పుడు ఆకలవుతుందో ఏమో! ఆకలైతే వాడొక్క క్షణం ఊరుకోలేదు!"

"కానీ నా సిట్టితల్లి... నా సిట్టితల్లి..!" అనుకుంది లోలోపల రత్తాలు. "నా కడుపున పుట్టినందుకు, పాలమ్ముకుంటున్న తన తల్లిని సూసి, సిగ్గుతో, అవమానంతో, సాపమీద వో మూల సగం చచ్చి పడుంటుంది!"

"ఏవిటాలోచిస్తున్నావ్?"

"ఎడవాన్సులైనా ఇత్తారేమోనని!"

"ఎంత కావాలి?"

"వో అయిదొందలిప్పించండి!"

రాజారాం మాట్లాడకుండా అయిదు వందలూ తెచ్చి ఆమె చేతికిచ్చాడు. రత్తాలు అవి తీసుకుని, "ఇప్పుడే వత్తానమ్మా!" అంటూ పరుగెత్తుతున్నట్టుగా ఇంటికి వచ్చింది. ఆ కాయితాల్ని భర్తమీద గిరవాటేసి కొట్టింది. కంఠంలో గీరతో, కళ్ళల్లో ఎర్రజీరతో అన్నది—

"ఇదిగోనయ్యా నువ్వు ఆశపడ్డ డబ్బు! నా వొంటో పాలకు అల్లిచ్చిన ఎడవాన్సు డబ్బు. రిక్షాయే కొనుక్కుంతావో, ఓనరువే అవుతావో నీ ఇట్టం!! కానీ వాలింటో వేవప్పుడు నా ఆడకూతురు ఏడ్సిందంటే మాత్రం, నా నిందు కొప్పుకొనేది నేదు!"

ఆ అయిదువందల్నీ వాడు ఆశగా ఏరుకున్నాడు. కళ్ళకద్దుకున్నాడు. జేబులో కుక్కుకుంటూ అన్నాడు — "ఏడ్సిందంటే, గొంతు పిసికి సంపేత్తాను. నీ ఒంటో ఉన్న పాలన్నీ ఆల్లకూ ఆల్లకూ నువ్వప్పుడు ఏ బాదా నేకుండా అమ్మేసేయొచ్చు, ఏవంతావ్?"

రత్తాలు భర్తవేపు భయంభయంగా చూసింది. వాడన్నంతపనీ చేత్తాడు— మూర్ఖుడు అనిపించింది.

"వొద్దొద్దు. నువ్వంత పని సెయ్యొద్దు. నా కూతురు ఏడవనే ఏడవదు. నా కూతురికి నా పాలే అక్కర్నేదు." అంటూ గబగబా ఇంత వేపాకు తీసుకువచ్చి రసం తీసింది. ఆ రసాన్ని ఆరగా ఆరగా తన వక్షస్థలంనిండా రాసుకుంది. కుంకుడుకాయలు కొట్టి ఆ పులుసు తీసి, తన పాలిండ్లకు పట్టించుకుంది.

"అమ్మా! ఆకలే! పాలు!" అంటూ

దగ్గరకు వచ్చిన పసిబిడ్డ నోటికి తను చనుమొనల్ని అందించింది.

ఆ పసిబిడ్డ తన నోటికి తడి తగలగానే ''థూత్ !'' అంటూ ఉమ్మేసింది. ''అమ్మా ! నీ పాలు చేదే !'' అంటూ దూరంగా పారిపోయింది.

పారిపోతున్న కూతురివేపు చూస్తూ తన మొగుడితో అన్నది రత్తాలు. ''ఏ తల్లీ చెయ్యని పాపం చేస్తున్నా ! — నీకోసం !! ఆ పసిదాని ఉసురు మాత్రం తగలనీమాకు !! అది మనకు సెరుపు సేస్తది. దాని కడుపాకలి తెలుసుకుని మసులుకో ! డబ్బాపాలే ఇత్తావో, పళ్లరసమే పట్టిత్తావో, నాకాడకు మాత్తరం తీసుకు రామాక !! కన్నబిడ్డను సూత్తూ మరో అమ్మ బిడ్డకు నాను పాలీనేను !!''

రత్తాలు కళ్ళనీరు కళ్ళ కుక్కుకుంటూ గబగబా బయటికి వెళ్ళిపోయింది.

రత్తాలు పాలుతాగి రజని కొడుకు బంతిలా తయారవుతున్నాడు. వాడిప్పుడు ఏడుపు మానేశాడు. రాత్రిపూట హాయిగా నిద్రపోతున్నాడు. రాజారాంకూ రజనికీ రాత్రుళ్ళు మధురాతి మధురంగా ఉన్నాయి. కానీ —

రత్తాలుకు మాత్రం రోజులన్నీ వంటరి ఖైదులా ఉన్నాయి. ఆమె రజని కొడుకును విడిచి ఒక్క క్షణంకూడా బయటికి పోవడానికి వీల్లేదు. ఆ కుర్రవాడు మంచంమీద పడుకుంటే, ఆమె ఆ మంచం పక్కనే కింద చాపవేసుకుని పడుకోవాలి. వాడు లేచినప్పుడు వాణ్నెత్తుకుని ఆడించాలి. వాడికి ఆకలేస్తే వాడు తాగినన్ని పాలివ్వాలి. పాలు కాస్త తగ్గుతున్నట్లనిపిస్తే, పాలు పట్టడానికి ఆమె మందులు తినాలి. ఆమె అప్పుడప్పుడూ రోడ్డుకు అవతలగా ఉన్న చుట్టు గుడిసెవేపు చూసేది. దూరంగా మిణుకు మిణుకుమంటున్న దీపం. ఆ దీపం వెనకాల ఏ చీకటి దాగివుందో ఆమెకు కనిపించేది కాదు. ఆ చీకట్లో ఏ పాపం, ఏ శోకం దాగివున్నాయో ఆమెకు వినిపించేదికాదు.

నెల తిరక్కుండానే మరో అయిదువందలూ ఆమె తీసుకుంది. ఆ అయిదు వందలూ తీసుకుని తన ఇంటికి పరుగెత్తుకుని వచ్చింది.

ఇంటిముందు ముద్దులు మూట కడుతున్న కొత్త రిక్షా. 'పోన్లే ! నా పాలు అమ్ముకుంటేనేం — నా మగడు ఓనరైపోనాడు' అనుకుంది. సంబరపడుతూ లోపల కడుగు పెట్టింది. లోపలి దృశ్యంచూసి విచలిత అయింది.

రత్తాలు మొగుడు, రత్తాలు రావడం చూడలేదు. కూతుర్ను చూసి శోకన్నాలు పెడుతున్నాడు. ''కళ్లు తెరవ్వే సిట్టితల్లీ ! సొంత రిక్షాకోసం నీ నోరు కుట్టేసినా కానీ నేనంత కసాయోణ్నికాదే !! అమ్మనే, ఇంకెప్పుడూ మీ అమ్మ పాలమ్మనీను ! అదిగో మన సొంత రిక్షా !! ఏం తెమ్మంటావ్ నీకు !! బత్తాయిపళ్లట్టుకు రానా ? జామకాయలు కొనితేనా ? పోనీ, నా తల్లీ — ఐస్ర్రూటు తింతావేటి ? ఏం కావాలో సెప్పవే, నన్ను సంపమాకే ! — మీ అమ్మొచ్చి ఏందయ్యా నా కూతురిట్టా అయిపోనాది, పుల్లనాగుంది, అంతే నేనేం జవాబు సెప్పుకోనే ? నిజంగానే తన వొంటి పాలమ్ముకోడానికే నిన్ను సంపేసినానంతుంది నన్ను !! నీకే దన్నా అయితే దాని మొహం సూడలేనే నేను !!''

దీనంగా, దిగాలుగా, నిస్సహాయంగా, వేదనా స్వరంలో కూతుర్ని చూస్తూ మాట్లాడుతున్న తన మొగుడికి వెనకాతల నిలబడి ఆ పసిబిడ్డ వేపు చూసింది రత్తాలు.

ఆ పిల్ల శరీరంలో బొమికలే తప్ప,మాంసం ఏదీ ? ఆ పిల్ల కళ్ళల్లో ఏవీ ప్రాణాలు ? — ఎక్కడికి పోతున్నాయి అవ్వి ?!

''నా సిట్టితల్లీ, నా రామసిలకా,'' అంటూ రత్తాలు అమాంతం వెళ్లి ఆ పిల్లను తన సందిట్లోకి తీసుకుంది.

''ఇదిగోనే, వొచ్చేసాన్నేను !! మీ అయ్యగారు, ఎవురు సెప్పినా ఇహ నిన్నిడిసి ఎళ్లను. ఇయిగో, ఈ అయిదొందలూ మీ అయ్యకిచ్చేత్తున్నా, ఇహ నువ్వా నేనూ వొహటి !! మన్నెవ్వరూ ఏరు సెయ్యలేరు. నా పాలన్నీ నీకే !!'' అంటూ అయిదు వందల కాయితాలూ తన భర్త వేపు విసిరికొట్టి, ఆవేశంతో రవిక గుండీలను తెంపి తన పాలిండ్లను కూతురు పాలిపోయిన పెదిమల కందించింది.

ఎక్కడో నూతిలో గొంతుకలా ఆ పసిబిడ్డ స్వరం.

''ఊహు, నాకొద్దు ... అమ్మా, నీ పాలు చేదే !!''

ఎంత ప్రయత్నం చేసినా ఆ పసిబిడ్డ పెదవులు పాలకోసం విడివడడంలేదు. విడివడితే, ''అమ్మా, నీ పాలు చేదే !'' అన్న మాటలు తప్ప మరోటి లేదు. ఆ మాటలు విన్న రత్తాలు మొగుడు ఇహ దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు.

''కాత్తల్లీ ! నీ తల్లి పాలు సేదు కాదే ! అవి ఎంతో గొప్ప మనసుగల తల్లివి !''అంటూ పసిబిడ్డడిలా రత్తాలు వక్షానికి తన తలను ఆనించి తన నోటి నిండా పాలు పీల్చి కూతురు వేపు వంగాడు.

తండ్రి చేష్ట చూస్తున్న ఆ పసిబిడ్డ ఒక్కసారి పెద్దగా అరిచింది, ''ఒద్దు నాన్నా ! అమ్మ పాలు చేదు !!'' అరిచిన ఆ కంఠం నిశ్చలమైంది. ''సిట్టీ !'' అంటూ అరిచిన ఆ తండ్రి నోట్లోంచి వేడిగా ఉన్న రత్తాలు వొంటి పాలు ఆ పసిబిడ్డ మొహంమీద జల్లులా వచ్చిపడ్డాయి.

బయట మంచి ఉధృతంగా వో గాలికెరటం. గదిలో మిణుకు మిణుకు మంటున్న బుడ్డిదీపం కొండెక్కింది. గదిలో చిక్కని చీకటి. వెక్కివెక్కి ఏడుస్తున్న మగవాడి కంఠస్వరం. ''ఎందుకయ్యా ఏడుత్తావ్ ? రిక్షా ఓనరువి గందా ! సచ్చిన కూతుర్ని వోనరు కూతుర్ని సేసినావు గందా ? ఆ రిక్షాలో నీకు నా సిట్టితల్లి మొదటి పాసింజరయ్యా ! తీసికెళ్లింత బుగ్గిసెయ్ !!'' అన్నది రత్తాలు.

తమ ఒంట్లో పాలు తమ బిడ్డలకే పట్టలేని అభాగ్యులైన ఎందరో ఆడవాళ్లల్లో వో చరిత్ర హీనురాలు !! ★

---

ఇటీవల నెల్లూరులో జరిగిన కుమారి చల్లా జయలలిత, శ్రీలక్ష్మి నృత్య ప్రదర్శనకి అధ్యక్షత వహించిన డా. బెజవాడ గోపాలరెడ్డి, ముఖ్యాతిథి జిల్లాకలెక్టరు కుమారి సుజాతారావు, నృత్య కళాకారిణులు — చల్లా సోదరీమణులని చిత్రంలో చూడవచ్చు.



## హైదరాబాదు నోట్‌బుక్

### బ్రిటిష్ రాణికి ఘన స్వాగతం!

రవి అస్తమించని సువిశాల సామ్రాజ్యం అంతరించిపోయినా అణుమాత్రమయినా అంగ లార్చక పాలితులను సమానంగాచూచే ఉదార జాతి బ్రిటిష్‌జాతి. మన దేశంలోనే తమ గడ్డలకు వచ్చిన తెలుగువారిని తమిళులు, తమిళులను తెలుగువారు, దాక్షిణాత్యులను మహారాష్ట్రులు, అందరిని బెంగాలీలు ఈసడిస్తున్నప్పుడు, తమ దేశానికి వలసవచ్చిన కామన్‌వెల్త్ దేశాలవారిని మానవత్వ దృష్టితో మన్నించే ఉత్తమ జాతి బ్రిటిష్‌జాతి. పోట్లాడేకాలంలో పోట్లాడాము, సంధి కుదిరింతర్వాత మనమంతా ఒక్కటే అనే సరసత చిందులాడే జాతి బ్రిటిష్ జాతి. మరి అలాటి జాతి ప్రతినిధి అయిన బ్రిటిష్ రాణి రెండవ ఎలిజబెత్ మన రాజధానికి వచ్చినప్పుడు తెలుగువారు ఘన స్వాగతమివ్వడం సముచితమనే భావిస్తున్నాను. ఎలిజబెత్‌రాణి భారతదేశానికి రావడం ఇది రెండవసారి. 1961లో తొలిసారిగా వచ్చారు. ఆమె 1926 ఏప్రిల్ 21న లండన్‌లో జన్మించారు. ఆమె తండ్రి 6వ జార్జి చక్రవర్తి 1936 నుంచి భారతదేశం స్వతంత్రమయ్యే వరకు భారత చక్రవర్తిగా వున్నారు. బ్రిటిష్ సంప్రదాయం ప్రకారం సామ్రాజ్యానికి వారసురాలయ్యారు. ఆమె చిన్ననాడే చదువుతోపాటు గుర్రపుస్వారీ, ఈత మున్నగు వాటిలో ప్రావీణ్యం సంపాదించారు. 11వ ఏట గర్ల్‌గైడ్ అయి పిదప సీరేంజర్ అయ్యారు. 14వ ఏట బ్రిటిష్ బ్రాడ్ కాస్టింగ్ కార్పోరేషన్‌లో పిల్లల కార్యక్రమంలో పాల్గొని తమ సామ్రాజ్యంలోని పిల్లలకు సందేశమిచ్చారు. 1944లో చక్రవర్తి విదేశ యాత్రలో ఉన్నప్పుడు ఆమె పరిపాలనను నిర్వహించారు. పిదప సైన్యంలోను వివిధ పదవులు నిర్వహించారు. 1947 నవంబర్ 20న ఆమె ప్రిన్స్ ఫిలిప్‌ను పరిణయమాడారు. 1948లోఆమె తన తర్వాత రాజ్యానికి వారసుడుకాగల ఛిలిప్సను ప్రసవించారు. పిదప 1950లో రాజకుమారి అన్నీ, 1960లో రాజకుమారుడు యాండ్రూ, 1964లో రాజకుమారుడు ఎడ్వర్డ్ ఆమెకు జనించారు. వివాహానంతరం ఆమె భర్తతోపాటు ప్రపంచమంతా పర్యటించారు. ఆమె తండ్రి ఆరవ జార్జి రాజు మరణానంతరం బ్రిటిష్‌రాణి అయ్యారు. కామన్‌వెల్త్ దేశాలకు అధినేత్రి అయ్యారు. పూర్వపు బ్రిటిష్ సామ్రాజ్యంలో వున్న 46 దేశాలు కామన్‌వెల్త్‌గా ఏర్పడ్డాయి. ఆమె 1953 జూన్ 2న పట్టాభిషిక్త అయ్యారు. ఆమె భర్తతో పాటు 1961లో భారతదేశంలో 21 రోజులు పర్యటించారు. అప్పటి రాష్ట్రపతికి అతిథిగావున్నారు. 1977లో ఆమె పట్టాభిషేక రజతోత్సవం కామన్‌వెల్త్ దేశాలంతటా జరిగింది. ఆ సందర్భంగా ఆమె భర్తతోపాటు 56 వేల మైళ్ళు కామన్‌వెల్త్ దేశాలలో పర్యటించారు. ప్రజల ఆదరాభిమానాలు చూరగొన్నారు. ఆమె రాజ్యాంగాధినేత్రిగా వారాని కొకసారి తన ప్రధానిని, ఇతర మంత్రులను కలుసుకొంటారు. కాబినెట్ కాయిత పత్రాలను చూస్తారు. మంత్రివర్గ కార్యక్రమాలన్నీ ఆమెకు ముందుగానే అందుతాయి. వీటికి తోడు కామన్‌వెల్త్ దేశాలకు సంబంధించిన విషయాలు అందుతాయి. కామన్‌వెల్త్ అధినేతలకు, ఇతర ప్రముఖులకు ఆమె ఆతిథ్యమిస్తారు. ఏటా ఆమె వివిధదేశాల 30 వేల మందికి విందులు చేస్తారు. ఇవిగాక ఎన్నో విందులు జరుపుతారు. పెక్కు ప్రముఖ వుత్సవాలలో పాల్గొంటారు. కొత్త ప్రాంతాలకు వెళ్ళినప్పుడు సాధ్యమయినంత ఎక్కువగా సామాన్య ప్రజలను కలుసుకోవాలని ఆమె ఉద్దేశం. ఈ పద్ధతి 1970లో ఆమె న్యూజిలాండ్ పర్యటనతో ప్రారంభించారు. ఆమె ప్రధానమయిన వినోదం సుఖమయ గార్హస్థ్య జీవనం. అయినా ఆమె గుర్రపుస్వారిని ఎక్కువగా ఇష్టపడుతారు. ఆ కారణంగా గుర్రప్పందేలకు తరచు వెళ్ళుతారు. ఢిల్లీలో జరిగిన కామన్‌వెల్త్ దేశాల మహాసభకు వచ్చిన ఆమె భర్తతోపాటు నవంబరు 18 రాత్రి ఢిల్లీనుంచి హైదరాబాదుకు ప్రత్యేక బ్రిటిష్ విమానంలో వచ్చినప్పుడు గవర్నర్ శ్రీ రాంలాల్, ఆయన సతీమణి రాంప్యారి, ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావు ఘనస్వాగతమిచ్చారు. పిదప ఆమె బోలారంలోని రాష్ట్రపతి నిలయంలో బసచేశారు. 19వ తేదీ ఉదయం ఆమె బి.హెచ్.ఇ.ఎల్.లోని పరిశోధనా భివృద్ధి విభాగాన్ని సందర్శించి, క్లోస్డ్‌సర్క్యూట్ టెస్ట్ విభాగాన్ని ప్రారంభించారు. అంతర్జాతీయ మెట్ట పంటల పరిశోధన కేంద్రం దర్శించారు. సాయంకాలం గోల్కొండకోటకు వెళ్లి కుతుబ్‌షాహీల సమాధులు శ్రద్ధగా చూచారు. రాష్ట్ర పురాతత్త్వశాఖ డైరెక్టర్ డాక్టర్ వి. కృష్ణశాస్త్రి ఆమెకు చారిత్రకాంశాలను వివరించారు. ఈ సందర్భంలో డాక్టర్ కృష్ణశాస్త్రి రచించిన "ప్రోటో ఎండ్ ఎర్లీ హిస్టారికల్ కల్చర్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్" అనే గ్రంథాన్ని ఆమె ఆవిష్కరించారు. ఆమెకు గవర్నర్ శ్రీ రామ్‌లాల్ విందు చేశారు. ఆమె 20వ తేదీన బోలారంలోని హోలీట్రినిటి చర్చిలో భర్తతోపాటు తమ వివాహం 36వ వార్షికోత్సవం జరుపుకొని ప్రార్థనలు చేశారు. ఆమె తన రాకకు చిహ్నంగా చర్చిలో ఒక ఫలకాన్ని ఆవిష్కరించారు. పిదప ఆమె రంగారెడ్డిజిల్లా మేడ్చెల్ తాలూకా దేవరయాంజాల గ్రామానికి వెళ్లి అక్కడి సీతారామాలయం దర్శించారు; గ్రామాభివృద్ధిని పరిశీలించారు. ముఖ్యమంత్రి రాజదంపతులకు విందు చేశారు. నవంబర్ 21వ తేదీ ఉదయం ఆమె సపరివారంగా ఢిల్లీకి బయలుదేరారు. విమానాశ్రయంలో ముఖ్యమంత్రి, గవర్నర్ మున్నగువారు ఆమెకు ఘనంగా వీడ్కోలిచ్చారు. రాజదంపతులు తమ సంతకం వున్న ఫొటోను ముఖ్యమంత్రికి బహూకరించగా, ముఖ్యమంత్రి వారి మూడు రోజుల పర్యటన ఛాయాచిత్రాల ఆల్బంను వారికి బహూకరించారు. ఎలిజబెత్‌రాణి తెలుగువారి ఆదరాభిమానాలను హృదయపూర్వకంగా ప్రశంసించారు.

బ్రిటిష్‌రాణి రెండవ ఎలిజబెత్ నవంబరు 19న హైదరాబాదులో భారత్ హెవీ ఎలక్ట్రికల్స్‌లోని లేబొరేటరీ టర్బో మెషినరీలో ఒక విభాగానికి ప్రారంభోత్సవం చేస్తున్న దృశ్యం.




### ఉపశ్రుతి :

ఏం సార్, ఇద్దరు మాజీ మహానాయకులు ఇటీవల మంతనాలు సాగించారే, ఆంధ్రప్రదేశ్‌కు ఏమైనా అరిష్టం జరిగేనా? — అనడిగారు నన్నొక జిజ్ఞాసువు. ఒకరు పేలిన చిచ్చుబుడ్డి, మరొకరు ఎన్నటికీ పేలని చిచ్చుబుడ్డి. మరేమీ ప్రమాదం లేదు — అన్నారు మా మాటలు వింటున్న మరొకరు.

— తిరుమల రామచంద్ర ★




చట్టబద్ధమైన హెచ్చరిక: సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం

STATUTORY WARNING: CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

CASVS-307-244 TEL

# భారతి



## భారతి పాఠకులకి మనవి

భారతి మొదటి సంచిక వెలువడి 1984 జనవరితో 60 సంవత్సరాలు పూర్తి అవుతుంది.

ఈ 60 సంవత్సరాలలో మా భారతిలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఎన్ని మార్పులు వచ్చినప్పటికి భారతి తెలుగువారి సంస్కృతికీ, వారి సంస్కృతిలోని ఉత్తమమయిన అంశాలకీ, ప్రతిబింబంగా ఉంటూ వచ్చింది. ఇకముందు కూడా ఈ సంప్రదాయాన్నే భారతి కొనసాగించగలదు.

కొన్ని సంవత్సరాలుగా భారతిలో కథలకి (చిన్నవికానీ, పెద్దవికానీ) అంతగా చోటు ఉండటంలేదు! ఈ లోపాన్ని సరిదిద్దటం కోసం ఇకమీద భారతిలో కథలనీ, నవలలనీ ఎక్కువగా ప్రచురించటానికి నిశ్చయించుకున్నాము!

పాత భారతి సంచికలతో పరిచయం కలవారికి ఇదేమీ కొత్తగా ఉండదు. ఒకప్పుడు భారతిలో ఇప్పుడు కొన్ని వార పత్రికలలో, మాస పత్రికలలో ఉన్నట్లు కథలూ, నవలలూ పుష్కలంగానే ఉండేవి!

కథలూ, నవలలూ ఎక్కువగా వేసినంతమాత్రాన భారతిలో పడే కవిత్వానికీ, వ్యాసాలకీ ఎటువంటి కొరతా ఉండదని వేరే చెప్పనక్కరలేదు!

వీలువిపట్టి, భారతి స్థాయిని అనుసరించి అట్టవికూడా మార్చగలము!

భారతికి ఎప్పటిలాగే పాఠకుల ఆదరాభిమానాలు లభించగలవని ఆశిస్తున్నాము!



## అవీ ఇవీ అన్నీ

### 'హవిస్' అకాల మృతి

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకి చిర పరిచితుడు, ప్రముఖ కథా రచయిత, ఆంధ్రపత్రిక ప్రధాన ఉప సంపాదకుడు శ్రీ వెలగలేటి విశ్వేశ్వరరావు (45) నవంబరు 27న విజయవాడలో అకాల మృత్యువు పాలైనారు.

'హవిస్' కలం పేరుతో ఆయన అనేకానేక కథానికలని రాశారు. ఆంధ్ర సచిత్ర వారపత్రిక



1962లో నిర్వహించిన దీపావళి కథల పోటీలో ఆయన కథ 'మమత' మొదటి బహుమతిని అందుకున్నది. రెండు కథల సంపుటాలని వెలువరించారు. 1965లో ఆయన ఆంధ్ర పత్రికలో ఉప సంపాదకుడుగా చేరారు. కృష్ణా జిల్లా పత్రికా రచయితల సంఘం, ప్రెస్ క్లబ్‌లకి అధ్యక్షుడిగా కొంతకాలం పనిచేశారు. కొద్దికాలంగా ఆయన గుండె, కాలేయ సంబంధమైన రుగ్మతలతో బాధపడుతూ ఉన్నారు.

శ్రీ విశ్వేశ్వరరావుకి తల్లి, భార్య, కుమారుడు, కుమార్తె ఉన్నారు.

### ఉమ్మెత్తల అవార్డు

సాహిత్యవేదిక, బ్రాహ్మణ వీధి, వనపర్తి, (మహబూబ్‌నగర్ జిల్లా), 509 107, వారు 1984లో కూడా ఉమ్మెత్తల అవార్డుని నిర్వహిస్తున్నట్లు తెలుపుతున్నారు. వివరాలకి పయి చిరునామాకి శ్రీ ఉమ్మెత్తల నరసింహమూర్తికి రాయవచ్చు.



*Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao St., Gandhinagar, Vijayawada-3, Editor: S. Radhakrishna.*




## ఎందుకంటే ఫారెక్స్ పాపాయిల సత్వరమైన మరియు సంపూర్ణమైన పెరుగుదల కోసం అధిక పుష్టికరమైన ఘన ఆహారం.

### మీ పాపాయి పెరుగుదల కోసం ప్రొటీన్‌తో సమృద్ధమైనది ఫారెక్స్

నిర్దేశించిన రీతిలో ఫారెక్స్ తయారుచేసి ఇస్తే అది మీ పాపాయి పెరుగుదలకు అత్యావశ్యకమైన ప్రొటీన్ సమృద్ధంగా కల్గి వుంటుంది.

### ఆరోగ్యవంతమైన రక్తం కోసం అదనంగా ఐరన్ కల్గి వున్నది ఫారెక్స్

పాపాయి రక్తానికి, రోగ-ప్రతిరోధక శక్తిని ఎక్కువ చేయడానికి, అతని సామాన్య ఆరోగ్యం మరియు పెరుగుదల కోసం ఐరన్ అత్యంత ముఖ్యం. మీ పాపాయికి పుట్టుకతోనే ప్రకృతి అందించే కానుక ఐరన్. అతడు పెరిగే కొద్దీ దీని నిల్వ తరిగిపోతుంది.

మూడు-నాలుగు నెలల తర్వాత మీ పాపాయికి కావలసిన ఐరన్ కేవలం పాలు మాత్రమే సమకూర్చలేవు. అందుచేత, ఆ దశలో, మీ పాపాయికి ఐరన్ కల్గిన ప్రత్యేక ఘన ఆహారం కావాలి. బ్రాండు చేయబడిన ఇతర ఘన ఆహారాల కంటే ఫారెక్స్‌లో ఎక్కువ ఐరన్ కలదు.

### పాపాయి పళ్లు మరియు ఎముకలకు అతి ముఖ్యమైన కాల్షియం మరియు ఫాస్ఫరస్ సరియైన నిష్పత్తిలో కల్గి వున్నది ఫారెక్స్

పళ్లు మరియు ఎముకలు చక్కగా ఏర్పడటానికి మీ పాపాయికి కావాలి కాల్షియం మరియు ఫాస్ఫరస్. కాని ఈ రెండూ 2 : 1 నిష్పత్తిలో కలిసి వుంటేనే పాపాయికి ఎక్కువ లాభం చేకూరుతుంది. ఈ అత్యావశ్యక తత్వములను ఆదర్శ ప్రాయమైన నిష్పత్తిలో కల్గి వున్నది ఫారెక్స్. ఇది మీ పాపాయి ఎక్కువ ఆరోగ్యవంతమైన ఎముకలు మరియు ఎక్కువ దృఢమైన పళ్లు నిశ్చయంగా పొందేలా చేస్తుంది.

### ఎంతో సులభంగా జీర్ణమవుతుంది ఫారెక్స్

మీ పాపాయి సున్నితమైన జీర్ణశక్తికి అనువుగా ప్రత్యేకంగా ముందుగానే పచనం చేయబడినది ఫారెక్స్.






డాక్టర్లు సిఫార్సు చేస్తారు

**ఫారెక్స్®** గ్లాక్సో ఉత్పాదన

CLARION/GX/1/244 TEL

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA